# నీలకంఠవిజయము

ఆంధ్రీకృత

(చంపూప్రబంధము)



రచయిత:

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

# నీలకంఠవిజయము

ఆంధ్రీకృత

[చంపూప్రబంధము]



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి ధన సహకారముతో ప్రకటితము

రచయిత :

**దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి**

రవీంద్రనగర్, కాకినాడ-2

# ముందుమాట

సంస్కృతమున పెక్కు చంపువులు కలవు. "గద్య పద్యోభయ మయం చంపూరిత్యభిధీయతే" అని చంపూశబ్దనిర్వచనము. సర్వతో ముఖప్రతిభ గలకవి పద్యమందువలెనే గద్యమునఁగూడ దనకవితా శక్తి చూపుట యిందలివిశిష్టత. కేవలపద్యకావ్యమునుగాని కేవలగద్య కావ్యమునుగాని నిర్మించిన కవులు సంస్కృతవాఙ్మయమున బలువు రుండిరి. కాదంబరి, దశకుమారచరిత్రాదులు గద్యకృతులు-కాళిదాస కావ్యములు పద్యకృతులు-పైవాని కవియేసాటి.

మొదట రామాయణగాథను గద్యపద్యోభయాత్మకముగ చం పూనిర్మాణము చేసినవాఁడు భోజుఁడు. "గద్యానుబంధరసమిశ్రితపద్య సూక్తిః హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతిః" అని చంపూప్రశస్తి నాతఁడు నుడివినాఁడు. పిదప భారతచంపువు, కరిగిరిచంపువు, విశ్వగుణా దర్శచంపువు మున్నగునవి బయలుదేరినవి.

అట్టిచంపువులలో నీలకంఠవిజయచంపు వొకటి. దీనిని నీలకంఠ దీక్షితుఁడు రచించెను. ఇతఁడు సుమారు మూఁడువందల యేండ్లక్రిందటి వాఁడు. అప్పయదీక్షితుని మునిమనుమఁడు. నారాయణదీక్షితులకును శ్రీభూదేవికిని జన్మించినవాఁడు. మహాపండితుఁడు. ఇతరచంపూకర్తల వలె గాక యితఁడు 'వక్రోక్తిః కావ్యజీవితమ్' అనికుంతకుఁడు ప్రశం సించిన వక్రోక్తికిఁ బ్రాధాన్య మిచ్చినాఁడు. మఱియుఁ దాను వ్యాకర ణజ్ఞుఁడ ననియుఁ గర్మబ్రహ్మప్రతిపాదకవేదభాగములను బరిశీలించితి ననియు, నుభయమీమాంసల నెఱిఁగినవాఁడ ననియు, శివభక్తుఁడ ననియు గ్రంథాంతమునఁ జెప్పికొనినాఁడు.

ఈ గ్రంథమునకు వ్యాఖ్యాత వేల్లాలమహాదేవసూరి యను పండితుడు. 'విబుధానందము' అను పేరు తనవ్యాఖ్యానమునకు పెట్టినాడు. సత్యమున కీవ్యాఖ్యానము లేనిచో నీగ్రంథమర్థముకానేరదేమో అనిపించును. ఈతడు నిగమాగమవేత్తగా, సకలపురాణజ్ఞుడుగా, సమస్తకోశవిశారదుడుగాం దత్తత్ స్థలములందు చెప్పకయే చెప్పును.

ఈగ్రంథమున ప్రారంభమందే 'వందే వాంఛితలాభాయ' అని యెత్తి తనవక్రోక్తిని చాటినాడు కవి. ధ్వనివిశేషములనెల్ల తనలో నంతర్భాగముగం జేసికొన్నయీవక్రోక్తి, వర్ణవిన్యాసవక్రత, పదపూర్వార్ధవక్రత, ప్రత్యయవక్రత, వాక్యవక్రత, ప్రకరణవక్రత, ప్రబంధవక్రత, అనుభేదముల నలరారుచున్నది. ఈభంగిమము లన్నియునీలకంఠుడిందు చూపియున్నాడు.

ఈకావ్యము నేనెఱిగినంతలో దెనుగులోనికి రాలేదు. వక్రోక్తిప్రధానకావ్యములుగూడం దెనుగున మృగ్యములు. ఇది ప్రవేశపరీక్షకు పాఠ్యముగ 1928 లో నుండుటచే నేను దీనిలోనికొంతభాగము చదువుట తటస్థించినది. ఇందలియితివృత్తము మిగుల ప్రాచీనతమమైనను రచన క్రొత్తగ నుండుటంబట్టియు, నీలకంఠదీక్షితునికవితామాధుర్యము నాస్వాదించియున్నవాడనగుటను దీని నాంధ్రీకరింపవలెననుకుతూహలము నాకుం గలిగినది. నాకుంగలసంస్కారలేశము నాధారముగం గొని యనువాదము సాగించితిని. రెండువత్సరములు కృషిచేసి యీయనువాదము ముగించితిని.

పెక్కుతావుల నవగాహనముగాని విషయములను పాఠము సరిగా లేనితావులను పెద్దలవలనం దెలిసి వ్యాఖ్యాసాహాయ్యమున వ్రాసి

తిని. నాయాంధ్రీకరణపద్ధతినిగూర్చి ఉపోద్ఘాతములో వివరించితిని ఆంధ్రములోనికి దింపవీలుకాని —

"గర్భస్థానేకమతరాజ-పాణినీయసూత్రవత్పరస్పైస్రపద ప్రతిపాదక-నిదాఘసూర్య ఇవ ఉత్తరంగత్వాతిభీషణ"

మొదలగు రెండు మూడక్కడక్కడ భావప్రదర్శనమాత్రముగావ్రాసి విడువవలసివచ్చినది. కొన్ని తావుల సంపూర్ణ మూలభావసంగ్రహార్థము రెండేసి పద్యములువ్రాసి యిందుఁ జేర్చితిని.

వివరణము పద్యములోకన్న గద్యములోనే యున్నచో మంచి దని తోఁచినయొక్కపట్టున వ్యాఖ్యానకారుని వివిధాభిప్రాయము లందుఁ గ్రోడీకరించి విపులముగ నట్టిదానిని వచనముగ వ్రాసితిని. శ్లోకాను వాదము పద్యముగూడ వ్రాసితిని. చూడుఁడు.

ఏకం తద్ద్వివిభూతి స్త్రిధామ నిహితం చతుర్వ్యూహం,
పంచాయుధం ప్రపద్యే షడ్గుణసంపన్న మశరణశ్శరణమ్.

ద్వితీయాశ్వాసము.

వ. చరాచరాత్మకమై ........
గీ॥ ఏకమై ద్వివిభూతియై ........

వ్యాఖ్యానకర్తయే నాలుగైదురీతుల వ్యాఖ్యానించినచోట నందు ప్రశస్తముగనున్న భావము గ్రహించితిని. కొన్నిగద్యముల నాయామత భేదముల నన్నిటిని జూపితిని.

పరమశివునివర్ణన మాద్యంత్యప్రాసములతో నిర్వహించినదగుట తద్భావము విశదీకరించుచు మూలముఁగూడ నిందు చేర్చితిని. అభి

ప్రాయముకొంటకు నా తెనుఁగును, కవితానందమునకు మూలమును జదివి యానందింతురుగాక. ఇందు పరిశిష్ట పాద్యము తత్త్వమునకు సంబంధించిన దగుటచే పెక్కుతావుల ఝడితి యర్థస్ఫూర్తి దుర్లభమగుచుండును. కొంచె మాలోచించినచో నదియు సుగమ మగునని నావిశ్వాసము.

గద్యభాగములందు మూలమున దూరాన్వయములు మెండు. వానిలోనిభావమునే దీసి వివరించుచో నందలికల్పనములు, అలంకారములు, పోవునని కొంతదండాన్వయఫక్కి ననుసరింపక తప్పినదిగాదు. అద్దైనను దెనుఁగునుడికారములసమ్మేళనముతోనే యొాపినంతవఱకు వ్రాసితిని. దీని బాగోగు లిట్టివని నిర్ణయింప దక్షము రసికపండితకవి లోకముకదా! ఆభారము దానికే విడిచితిని.

ఇట్లీకృతి నల్పజ్ఞుఁడనై యుపాధ్యాయవృత్తిలో నున్న నేను రచించి నంతనే నాకృషి సూర్యాలోకనమునకుఁ దెచ్చి ముద్రణవ్యయమంతయు భరించిన M. S. N. C. పాఠశాలాధర్మకర్తలు వంద్యులు. దీనిని 'మహాదాత' శ్రీసత్యలింగనాయకరుగారికి కృతిగా గ్రహించుట ధర్మకర్తల మహౌదార్యమును సూచించు ననుటలో నతిశయోక్తి లేదు.

ఈరచనము నాముఖముగా విని నన్నాశీర్వదించినకవులకుఁ బండితులకును నాకృతజ్ఞతావందనశతము లర్పించుచున్నాను.

దీని ద్వితీయముద్రణమునకు శ్రీశ్రీతిరుమలతిరుపతి దేవస్థానము వారు అయిదువేల రూ. లొసంగి ప్రోత్సహించినందులకు శ్రీ దేవస్థాన కార్యకర్తలకు నాకృతజ్ఞతాభివందనములు.

[రచయిత]



# పండితాభిప్రాయములు

## నీలకంఠవిజయము

చిరంజీవి దువ్వూరి సూర్యనారాయణశాస్త్రికి
వాగ్దేవీప్రసాదసిద్ధికై ఆశీస్సులు.

నీవు రచించిన నీలకంఠవిజయము ఆంధ్రీకృతిని స్థాలీపులాకముగా నీవలననే వింటిని. విద్వాంసుల సాహిత్యపటిమకు నికషోపలము వంటి యీ నీలకంఠచంపువునకు, అదే సంప్రదాయములో గద్యపద్యాత్మకముగా సాగిన నీరచన పరిశీలించినంతవరకు ఎట్టిలోపములు లేక సరళముగా సాగినదని నాకుఁ దోఁచినమాట.

ఈ గ్రంథము ఉన్నతవిద్యాసంస్థల సమాదరము పొందఁదగినదని నావిశ్వాసము.

ఇట్లు,

ది 7-6-1959, ఉప్పులూరి గణపతిశాస్త్రి,
కాకినాడ. వేదభాష్యవిశారద.

---

ఈ చంపువు నీలకంఠదీక్షితవిరచితము. ఈ దీక్షితులు A.D. 17వ శతాబ్దివాఁడు. శతాధికగ్రంథకర్త యగు అప్పయదీక్షితుల వంశములోనివాడు.

అమృతముకొఱకయి దేవదానవులు సముద్రమును మథించుట, హాలాహలము పుట్టుట, శివుడు దానిని మ్రింగుట, మున్నగు విషయములతో నిండిన పురాణగాథ యీ చంపువునందలి యితివృత్తము - ఇందలి వర్ణనములంబట్టి కవి విశిష్టపాండితీమహితుఁడని తప్పక చెప్పవచ్చును.- కాశీఖండమువోలె నీకృతి సకలగీర్వాణవాణీవిలాసముల కాటపట్టయి ప్రౌఢతరకావ్యముగా నెన్నఁబడుచున్నది.-

నీలకంఠదీక్షితులు నైసర్గికముగ వక్రోక్తిప్రియుడు. 'నీలకణ్ఠస్య వక్రోక్తిః సా ముగ్ధేందుకళానిభా" అని ప్రతీతి.- ఆవక్రోక్తిని బ్రధానముగ నెంచుకొనియే యీతఁడీకావ్యము నిర్మించినాఁడు. ఈయంశము

"వన్దే వాఞ్ఛితలాభాయ కర్మ కిం తన్న కథ్యతే
కిం దమ్పతి మితి బ్రూయా ముతాహో దమ్పతీ ఇతి"

అను ప్రథమ ప్రార్థనాపద్యముననే గోచరించుచున్నది.- సుకుమార వక్రోక్తి లలితమై, కోమలకవితావిలాసబంధురమై సహృదయాకర్షకమయిన యీగ్రంథ మింతదనుక నాంధ్రమున ననువదింపఁబడి యుండ లేదనుట సునిశ్చితము.

ఇపు డీకావ్యమును శ్రీ॥ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి యనువదించెను.

ఈతని కవితాకోమలత, ఆంధ్రపాఠకులకు, అపరిచితము కాదు.- జీమూతవాహనుఁడు, జడభరతుఁడు, అహల్య, భక్తశబరి, మున్నగు నీతనిపద్యకృతులు ప్రచారము నందియున్నవి.-

ఈ యనువాదము సరళముగా సాగినది. ప్రాచీనాంధ్రకవుల పద్ధతుల నుజ్జగింపలేదు. మూలమునందలి యున్నతభావముల విడువలేదు. శ్లేషమున్నను శ్లేషాదుల నుపేక్షింపలేదు.- అనువాదనిర్బంధమున్నను, కవితామార్దవము తప్పనీయలేదు. ఏ దీర్ఘసమాసమును బ్రసన్నతను వీడలేదు-మచ్చునకీక్రిందితావులు పరికింపఁదగినవి.-

ప్రథమాశ్వాసము :-

| | | |
|---|---|---|
| దేవానామపిదైవతమ్ | గురువులకెల్ల సద్గురు | (8.ప) |
| చాతుర్యేణపణయేన | బ్రముచ్చిలిమో | (10.ప) |

ద్వితీయాశ్వాసము :-

| | | |
|---|---|---|
| చేతోయద్భవతః | అస్తమితప్రపంచ | ( 4.ప) |
| వాగ్దేవీవదనారవింద | వాణీసద్వదనా | ( 8.ప) |
| పశ్యజ్ఞాన | జ్ఞానక్రియేచ్ఛా | (34.ప) |
| జయజయజగదంబ | జయజయహాటకాంబుజ | (39.ప) |

తృతీయాశ్వాసము:-

| | | |
|---|---|---|
| సురాసురకర | అమరుల్ దైత్యులు | (50.ప) |
| యుగవిగమ | ప్రళయోద్భిన్న | (35.ప) |

మరియు, బ్రహ్మవిష్ణులోకములవర్ణనము, సురాసుర గురుసంభాషణము స్వర్గాక్రమణము మున్నగుపట్టులు రసవంతముగ వక్రోక్తులతో నడచినవి. ఈ యనువాదము తప్పక పెద్దలమెప్పు నొందగల దని నా విశ్వాసము.- ఈసరసకృతి నాంధ్రమునకుఁ దెచ్చినయనువాదకుని పరిశ్రమకు సహృదయుల సంమోదమే సఫలతాపాదకము.-

ది 5-5-1959

దువ్వూరి వేంకటరమణశాస్త్రి,
ఆంధ్రవిశ్వవిద్యాలయము, వాల్తేరు.



నామిత్రులు బ్రహ్మశ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు జీమూతవాహన, శబరి, అహల్య మున్నగు ఖండకావ్యముల రచించుటయు, కళాశాలలయం దందుఁ గొన్ని ఇంటరు, బి. ఏ. తరగతులకు పాఠ్యగ్రంథము లగుటయును, వారికవితతోఁ బరిచయము గలవారిలో నేనొకండను. అవియన్నియు స్వతంత్రగ్రంథములేకాని యనువాదములు కావు. అం దాయనకవిత స్వేచ్ఛముగా నడుచునవకాశ ముండుటచే నంతధారాళముగా నడచిన దనుకొనువాఁడను.

నేఁటివీరిరచన మగు నీలకంఠవిజయచంపువు నాంధ్రీకరణము వారివలననే విని యచ్చెరువొందితిని. సంస్కృతవాఙ్మయమున వక్రోక్తి కవితకుఁ బ్రసిద్ధి కెక్కిననీలకంఠదీక్షితునికావ్యము నాంధ్రమునఁ బరివర్తనమొనర్చుటయన్న యసాధ్య మని కవి యగువాఁ డెవ్వఁడెఱుఁగఁడు? అట్టియనన్యసాధ్యకృతికిఁ బూని సహజముగా వెలువడినరీతి నామూలచూడము నేకాకార మగుశయ్యతో వీరు రచించిరన నత్యద్భుతవిషయ మని నాయభిప్రాయము.

“శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణకార్యకలన ముఖ్యత వహించిన పండితులలో వీ రొకరు” అనిన వీరియుభయభాషాపాండితిని గూర్చి వేఱ చెప్పనక్కఱ లేదుగదా! ఇఁక కవితావిషయమున నందుమా! ప్రసన్నమై నిర్దుష్టభాషతో మనోహరరచనతో నలరారువెనుకటికావ్యములు నిదర్శనములు. అంతకంటెను వ్యంగ్యములతో, వక్రోక్తులతో నిబిడమై, అలంకారాలంకృతమై, శ్లేషసమేతమై, యనువాదమున కసాధ్య మనిపించు నీనీలకంఠవిజయాంధ్రీకరణము కవితారంగమున వీరి కొకవిశిష్టస్థాన మొసంగుచున్నది.

అపూర్వ మగునియ్యనువాద మాంధ్రశారద కొకనూతనాలంకారమై సహృదయహృదయావర్జన మొనర్చుకొని తీఱునని నానిశ్చితాభిప్రాయము.

ఇట్లు,
శ్రేయోఽభిలాషి,
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి,
శ్రీకోనసీమా భానోజీరామర్సు కళాశాల.

అమలాపురము,
10-5-59.



శ్రీరస్తు

శివచంపూకృతి యాంధ్రవాఙ్మయసుధీచేతోహరోదారవా
క్కవితావర్ణితముం బఠింప వినువాఁకన్ మున్కులై భావనో
త్సవరత్నద్యుతితళ్కులై యెడఁద ముగ్ధం బయ్యె సాహిత్యబం
ధువుగా నీకృతి తెన్గునేల నిలుచున్ దుర్వారవిద్వత్కవీ!

మూలము నీలకంఠకృతి మోహనకాంతవసంతపేశలాం
ధ్రీలలితానువాదసరణిం గనఁగాఁ గలకంఠగీతిగాఁ
బోలుచుకొంటి; వేల్పుతలపువ్వయి సొంపిలువక్రరేఖగాఁ
దేలుచుకొంటి నెంతని నుతింతును నీకవితాసుధాప్లుతిన్.

డెందంపుందమిదొన్నితో రసనిరూఢిన్ జంద్రమశ్శేఖర
స్పందవ్యాపృతి నందుకోఁగలుగునీభాగ్యంబు భావించి, యా
నందాశ్రూదకణంబు లడ్డుతగిలెన్ గావ్యమ్ముఁ జూడంగ; నే
మందున్ దిన్ననిమందు చెప్పఁగదవే! యాత్రేయగోత్రోదయా!

జతగా సాఁగినవేల్పుతెల్గునుడులున్, జాత్యంబు, వక్రోక్తిభా
షితమున్, వ్యాకృతిసాధువాక్సమరసశ్రీఁ జూడఁ బ్రత్యగ్రపు
ష్పితమా నొండొకతెల్గుకబ్బముగ భావింపంబడెన్; నీవు దీ
క్షితుఁడై నాఁడవు సత్కవిత్వమున శాస్త్రీ! సూర్యనారాయణా!

తొలిగృహస్థుననుగ్రహఫలము వెంటఁ
గబ్బ మది నీకుఁ బండితకవియశమ్ము
నందియిచ్చును; తీర్థము స్వార్థ మిటులు
కలసివచ్చిన చరితార్థకవివి నీవు.

ఆంధ్రపురాణకర్త,

31-12-'68 మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

# శ్రీ వేంకటేశ్వరస్తుతి



పొంకము మీఱఁ దిర్మల నపూర్వమహాప్రభుతోజ్జ్వలన్నిరా
తంకమహఃప్రపూర్ణ పరధామము, దివ్యకిరీటకోటి ర
త్నాంక, మనాథనాథము, సమస్తజగచ్ఛరణైకదక్షమున్
వేంకటనాథనామ, మరవిందదళాక్షము భక్తిఁ గొల్చెదన్.

కాంతము, సర్వనైగమశిఖాంత, మతాంతము, భక్తసూచ్యయ
స్కాంతము, వాంఛితార్థసురకల్పకపుల్లలతాంత, మజ్ఞతా
ధ్వాంతమహావికర్తన, మపారకృపామహిమాంత, మంబికా
కాంతము, వేంకటేశ్వర మగణ్య మనుత్తరతత్త్వ మెన్నెదన్.

లాలితదివ్యమూర్తి ! దినలక్షులు రాఁబడి గల్గుసామి ! ఉ
ద్వేలకృపాతరంగితమతిన్ మహి సాకెడి దేవ ! కష్టకా
లాల జనాల నాదుకొని లాలనఁ బ్రోచెడి వేల్పుఱేఁడ ! లో
కాల కనంతరీతుల సుఖాలొడఁగూర్చెడి ప్రోడ ! మన్నతుల్.



# నీ ల కం ఠ వి జ య ము

## ఉ పో ద్ఘా త ము



౧

శ్రీమహారాజ్ఞి ! వాంఛితదాత్రి ! గాయత్రి !
సవితృ దేవత! విష్ణుసదయహృదయ !
శ్వేతవర్ణ ! కపర్దిశిఖ ! పృథివీయోని !
పంచశీర్ష ! మహాప్రభానుభావ !
షట్కుక్షి ! త్రిపద ! విశ్వామిత్రఋషి ! చతు
ర్వింశతివర్ణ ! వరేణ్యమూర్తి !
అమలాగ్నిసుముఖ ! బ్రహ్మశిరస్క ! ప్రాణాది
సప్రాణ ! పద్మవిశాలనయన !

సారసాంఖ్యాయనసగోత్ర ! సర్వలోక
ధీప్రచోదిని ! వేదమాతృక ! నమోస్తు
నాదబిందుకళామయి ! భేదరహిత !
మునిజనోపాస్య ! అంబ ! నమోనమోస్తు.

౨

త్రయిని మూర్తిత్రయిని మునిత్రయిని బోలి
సారవిజ్ఞానభిక్ష నొసంగి యుద్ధ
రించి నన్నొకపాటిఁ గావించియున్న
నాగురుత్రయమునకు వందన మొనర్తు.

3

గౌతమిదరిని మస్కరిపల్లిని వసించి
పావనత్వము గన్న బాపఁ డెవఁడు
అచటిమల్లేశ్వరు నఖిలేశుఁ గేశవు
నిత్యసేవలఁ దన్పి నెగడె నెవఁడు
వారాణసీహరిద్వారగయాది ది
వ్యక్షేత్రముల మెట్టి యలరె నెవఁడు
బహుకుటుంబియుఁ గష్టభాజనుం డయ్యును
నిత్యకర్మకలాపనిరతుఁ డెవఁడు

అట్టిదువ్వూరి పెదశేషయార్యునకును
శేషమాంబకు నుద్భవించినసుతుండు
నీలకంఠవిజయచంపు వోలి నిట్టు
లాంధ్రముం జేసె సూర్యనారాయణుండు.

౪

సాహోదారపురాకృతాత్తకవితాసామ్రాజ్యభోగోల్లసత్
ధౌరంధర్యము నూని, యుత్తమగుణాధారంబుగా సత్కృతి
ప్రారంభంబున నేయుదాత్తునిచరిత్రంబో కృతిం గూర్ప క
ల్పారంభంబులఁ గాలయాపనము లేలా భుక్తికా ముక్తికా?

౫

వ. అన్నయొక్క ప్రేరణంబులో నుదయింపఁ దద్భావభావితాంతఃకరణుండనై యుండ —

౬

నవ్యకవిత్వతత్త్వరచనాపరిపూర్ణతగన్నవాఁడు మం
తవ్యుఁడు సిద్ధహస్తుఁడుగదా గొటుముక్కలరామకృష్ణుఁ డీ
కావ్యము తెల్గొనర్పఁ గడఁగన్ దుదినెగ్గద; కాన నద్దిక
ర్తవ్య మటంచుఁ బూనితి నిరంతరదీక్ష జయంబుఁ గాంచితిన్.

౭

కేవలమర్త్యుఁ డౌచు నపకీర్తియొ కీర్తియొ తా గడించి పుం
భావనతో నొకింతప్రజఁ బాలనసేయుప్రదేశనాయకున్
భావనచేయుటా యిది? శివంకరు నాజగదేకనాయకున్
స్థావరజంగమాత్మకు నిపాదు విపాదు నుతింప శక్యమే ?

౮

కవితాలంక్రియఁ గాళిదాసుఁ డుపమం గాంక్షించెఁ దా నర్థగౌ
రవమున్ భారవి చూపెఁ దా మృదుపదప్రారంభుఁ డాదండి, యి
య్యవిమూఁడున్ సమకూరె మాఘునకు నాహా! నీలకంఠాఖ్యచం
పువునం దట్టిసమస్తకావ్యగుణముల్ పొల్పొంది మిన్నందవే ?

౯

అది ముగ్ధేందుకళానిభం బగుచు నాహ్లాదోక్తివైచిత్రిన
భ్యుదితం బైనదికావ్యజీవితముగాఁ బొల్పొందువక్రోక్తి, త
త్పదముం ద్రొక్కెను నీలకంఠుఁడు నుదాత్తం బైనతత్కావ్యసం
పద నెన్నం దరమే ? తదర్థపరిరంభం బన్న సామాన్యమే?

౧౦

వ. ఐనను నాయోపినటులు మూలమును దిరస్కరింపక వ్యా
ఖ్యానాధారంబుగొని నాకుగలసంస్కారానుసారముగా నిద్దాని రచింప
నెంచినాఁడ నేతద్రచనావిధానమున-

౧౧

వ్యంగ్యార్థములను నర్థాలంకృతులనెల్ల
మూలానుసరణిగ మేలవించి
వర్ణనాత్తనిగూఢభావమ్ము లౌచితి
చెడకుండునట్లు యోజించి నించి
మధురదీర్ఘసమాసమంజులరీతుల
నందంబుగాఁ గొన్ని యటులె దించి
తెనుఁగున రచియింప దీప్తైన శాబ్దిక
చిత్రముల్ శ్రుతికి వాసింప నుంచి

మూలకారుని సిద్ధాంతములకుఁగాని
యతని కల్పనలకుఁగాని హానిఁ దేక
యెట్టి స్వాతంత్ర్యముం జూప కేను సంత
రించితిని దీని బుధు లాదరింపవలయు.

౧౨

రఱలకు నణలకు నటనట
నెఱిఁగియె ప్రాసంబు నిలుపనెంచితిఁ దెనుఁగుం
దెరువులఁ బెద్దలు పెట్టిన
యొఱవడులం దిద్దికొంటి నోపినభంగిన్.

౧౩

మానితాచారధర్మగ్లాని దేశానఁ
దలమునుకలై యున్నతరుణమందు
పరమాస్తికత మించు భరతఖండంబెల్ల
నాస్తికాగ్నిజ్వాల నవయునాఁడు

కోటిపాదము లానుకొని శ్యామ దేవత
యవనిపైఁ దాండవ మాడునాఁడు
దేశభాషాయోష దిగనాడి మ్లేచ్ఛహూ
ణాదిభాషల నల్లలాడునాఁడు

ఇట్టిచంపువుల్ గింపువు లిహముఁ బరము
నీశ్వరుఁడు గీశ్వరుఁడు ప్రాఁత వేల యనకు
మకట! లోకము సువిశాల మైనది గద!
పరిభువులు ననంతు లేది యెప్పటికిఁ దగునొ?

౧౩

పడుచుంబ్రాయపుఁబాలపొంగు లవి, చప్పం జల్లనారన్ వయ
స్సిడదే మా, ర్పులనాఁటికేని రుచినీవే యిట్టికావ్యాలు, క
న్పడఁడే యెన్నటికేని మత్సముఁ డనంతం బౌఁగదా కాల మ
ల్పుఁడలోఁ బెన్నక నాయెడన్ దయను నిల్పుండో మహాపండితుల్,

౧౪

పుబ్బయందుఁ బుట్టిపుట్టక మఖయందె
మాఁడనున్న కృతుల మాట లెత్తి
క్షుద్రకల్పనముల శూన్యవాదంబుల
నిడిన మనసు నడుసుఁ దొడుసుఁ గాదె?

౧౫

నిలుకడతోడుతన్ విషయనిర్ణయదృష్టిని, జొచ్చి లోనికిన్
దెలిసినయాస్తికాళి కిది తెల్లము, కాకటు మత్సరత్వసం
విలసితులై పదార్థసువివేచన సల్పక ప్రాఁత ప్రాఁత యం
చులికెడిదుర్విదగ్ధుల దురూహల కందని వీపదార్థముల్.

౧౭

మనసు శిరసు వయస్సు వంగనియవేళఁ
గ్రొత్త క్రొత్త కొమ్మగ, దోఁచి కొనలుసాఁగు
మనసు శిరసు వయస్సు పండినతరానఁ
బ్రాఁత బంగార మగుచుండు భావనమున.

౧౮

నన్నయతిక్కనాది కవినాథులు త్రొక్కనివాక్పథమ్ము లే
మున్నవి తెన్గుబాసను? సముజ్జ్వల సత్కవితాప్రభావ సం
పన్ను లురుప్రబంధపరభాగు లిటీవలివారు, వారికన్
సన్నలఁ బోయి సుస్థిరయశంబు భృశంబు గడింపరై రొకో?

౧౯

కాన నేనును వారిమార్గములఁ ద్రొక్కి
కొని జనిం ధన్యముం జేసికొనెడివాఁడ,
కావ్యసుస్థితి కాశితికంఠుఁ డుండె
నవల లోకమ్ముగల దేమియైన నేమి ?

౨౦

గద్యానుబంధిరసవత్
పద్యోక్తు లుదారభావబంధురఫణితిన్
వాద్యకలితగీతం బటు
హృద్యములై సకలసుకవిహితములు గావే ?

౨౧

పద్యంబు లేని గద్యము
గద్యము లేనట్టిపద్యగణ మింపగునే?
స్వాద్యము ద్రాక్షాఫల మా
స్వాద్యం బగుమధువుఁ గూడఁ జవిగానిదొకో?

౨౨

వ. అని చంపువులరచించిన మహాకవులవాదంబుగాదె?

౨౩

చూడన్ లేఁడు వినంగఁబోఁడు పరమేశుం డొక్కఁ డెందేని యు
న్నాఁడా లేఁడ? యటన్నసంశయముతో నాశంబు గానేల? యు
న్నాఁ డంచుం గృపిసల్పు, మున్న నతఁ డానందించు, లేకున్న లేఁ
డేడన్ లేఁ డనుకొన్నఁ జచ్చెదవుసుమ్మీ యాతఁడే యున్నచో.

౨౪

ఇట్టిదైవము పరశివుండే యటంచు
నాతని జగద్ధితైకకథాకలితము
నైనయీకృతిఁ దెనిగింపఁ బూనినాఁడ
నతనిదయచేతఁ గృతకృత్యుఁ డైనవాఁడ.

౨౫

శివ యనురెం డక్కరమలె
యవకరము లణంపఁ గావ్యమంతయు, ఆశం
భువునిదె యవుచుండఁగ నా
భవపాపము లణఁగకున్నె పరశివుకరుణన్.

వాక్యాను వ్యాకరింపఁగలవాఁడు, షడంగపరీతవేదస
మ్యక్కలనానుషంగుఁడు, పురారిపదార్పితచిత్తుఁ, డుత్తమ
ప్రాక్కవిమార్గగామి, యనుభావము నన్నుఁగుఱించి చాటు న
ర్వాక్కుల కంచు నీకృతిని వ్రాసితి: భార మదంత దానిదే.

[నీలకంఠదీక్షితుఁడు]

# కృతజ్ఞత

నేమము నిష్ఠ గల్గినమనీషి, వినీతుఁడు, సంస్కృతాంధ్రభా
షామహితుండు, నీకృతిని జక్కఁ బరిష్కృతి చేసినట్టియు
ద్దామసుపాండితీవిభవధన్యుఁడు నైతగు సామవేదశ్రీ
రామశిరోమణిన్ శివనిరంతరసత్కృప ప్రోచుఁగావుతన్.

ఈ గ్రంథముద్రణమునిమిత్తమై విశేషముగ ఆర్థికసహకారము నందిచ్చి నన్ను ప్రోత్సహించిన శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానపు కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్. గారికిని తదితరసంఘసభ్యులకును నా కృతజ్ఞతాభివందనములు.

(గ్రంథకర్త)



# నీలకంఠవిజయము

## ప్రథమాశ్వాసము.

~~~~~~~~

వాంఛితార్థసిద్ధికి నమోవాక మిడుదు
నెవరికో యన వారి నే నెంచి యనను,
మతి ననేకత పొసఁగు దంపతుల కనిన
దంపతి కటన్న దుష్టశబ్దత ఘటిల్లు.

అచ్చరపిండుఁ గౌస్తుభము నారసి యాశల వాదులాడుకో
వచ్చుసుపర్వు లెందఱో దివంబునఁ గల్గిరి భారభూతులై
తెచ్చఁగ దుర్విష, మ్మపు డుటింబడ లోకము, పర్వఁగా సురల్
చెచ్చెఱ నేవిభుం డభయసిద్ధి నొసంగెనొ వానిఁ గొల్చెదన్.

అతిలోకాద్భుత వేదవాదములు వ్యత్యస్తమ్ముగాఁ బల్కు దు
ర్మతపాషండు లెసంగఁగాఁ గలిని, దన్మాభర్త కల్క్యాత్మ సు
స్థితిఁ దా నిల్పినరీతి, శంకరుఁడె నిల్చెంగాదె యప్పయ్య దీ
క్షితుఁడై, శాంకరవిద్యకుం గురుఁడు నిక్షేపింప సద్ధర్మమున్.

“వేదోపనిషదర్థవేదియై పరశివ
మూర్తి యన్నఖ్యాతి పొందె నెవఁడు
శాంకరమతప్రతిష్ఠాపనాచార్యత
వాదీభసింహుఁడై వరలె నెవఁడు
~~~~~~~~

చతురధికశతప్రశస్తప్రబంధని
ర్వాహకత్వసమజ్ఞ వడసె నెవఁడు
శ్రీకంఠవిద్యావిశిష్టగురుండు మ
హావ్రతయాజి నా నలరె నెవఁడు

జలధిపరివేష్టితక్షితితలమునుండి
గగనకల్లోలినీతరంగములు దనుక
వెన్నెలలు కాచె నెవ్వనివిమలకీర్తి
యట్టియప్పయదీక్షితు నభినుతింతు"

కృతిని రచింపనెంచు కుకవీంద్రులయత్న మదె ట్లభేద్యమో
మతి సుపదాళి నెన్నఁగ సమంచితదీక్షలు దాని కెంతలో
అతులితకావ్య సద్రచనయందుఁ గనీసము ముద్దినంబు లా
స్థితి కవులందు నిల్చిన నిసీ కవితాసతి కిట్టియోగమా ?

సకలభువనైకమంగళశంకరగుణ
వర్ణన మొనర్ప నెంచినవాఁడ నగుటఁ
గలితసువ్రతస్థునకు లోకాయతికుల
కరణిఁ గుకవులు స్మరియింపఁ గానివారె.

ఎన్నికృతు లెన్ని నిలిచిన
వెన్ని నశించినవో యెందఱెందఱో కవు, లై
న న్నను శంకరగుణకథ
నోన్నతలోభంబు మిగులఁ బ్రోత్సాహించున్.

గురువులకెల్ల సద్గురు నకుంఠిత తేజుని దేవదేవునిన్
స్మరహారు లోకరక్షకుఁ బ్రశంస లొనర్పఁదలంతు, నిందుఁ దొం
దర గలిగించి నన్నుఁ గుపథంబుల నీడిచి ప్రాసబాధలన్
సరగున నొవ్వఁజేసినఁ బ్రసాదము వీడకుమమ్మ భారతీ !

నంతవ్యుల్ కవులున్ ధరిత్రి బహుమంతవ్యుల్ రసజ్ఞుల్ కలా
రింతే నే నలసుండఁ జేయుదును, వా రెగ్గింపనీ యెన్ననీ !
అంతుల్ గానక కామతంత్ర విషయాద్యామ్నాయ శీర్షాంగ ప
ర్యంతోక్తుల్ జనియించె నేయమకు నాయమ్మన్ బ్రశంసించెదన్.

మ్రుచ్చిలియో మహాప్రణయమును బచరించియొ వెన్నముద్దలం
దెచ్చిన కృష్ణగాథలు కథించిరి వేలకొలంది సత్కవుల్
పెచ్చిన కాలకూటకబళీకరణమ్మును ముందు నెవ్వరేన్
మెచ్చఁగ నెంచిరే ? యిపుడు మెచ్చఁగ దూరము మాకు నర్హతల్.

నాల్గువేలపై నేఁడువందలకు మించి
ముప్పదెన్మిది కలివర్షములు గతింప
నీలకంఠవిజయ మనుమేలికృతి, ర
చింపఁబడె నీలకంఠదీక్షితునివలన.

పదితొమ్మిదివందల యేఁ
బదితొమ్మిది యైన క్రీస్తు వర్షంబున వ
భ్యుదితం బీ యాంధ్రీకృతి
విదితంబుగ నీలకంఠ విజయంబునకున్.

## ప్రథమాశ్వాసము

1

వ. తొల్లి యమరావతి యను నగరం బుండు; నయ్యది సమస్త దేవతల కారాధ్యం డగు మహేంద్రునికి స్థానమై, యమృతాశనుల కాస్థానమై, యాశ్చర్యములకు నెలవై నవరత్నములకుం గనియై, విష యానందముల కవధియై, వాచాతీతమై యుండె.

ఆధారము లేనియాకాశపథమ్మున నుండుటం బట్టియు, నన్ని వైపులకును ద్వారములు కలదాటను, దానికిఁ బునాదులు వేయను, ద్వారపాలకుల నియమింపను, బురుజుల నెత్తింపను, పరిఖలు త్రవ్వింపను నక్కఱ లేకుండె. కేవల మాచార మనిమాత్ర మందొక క్రొత్త కోట నిర్మింపఁబడె; నందు భూరహితంబై నిశ్శ్రేణికోపయోగంబు లేని వైజయంతం బను ప్రాసాద మొక్కండు గలదు. స్వేచ్ఛాసంచారములు గలిగి యమృతపానమే యొనర్చునచటి పౌరులకు శాల్యన్నములతోఁ బనేమి? వారలకు గావలసినన్ని మణులు, బంగారము, భూషణంబులు, వస్త్రములును నడిగినమాత్రన యొసంగెడిమందారాదివృక్షంబు లుండుటం గొనవలసినదిగాని విక్రయింపవలసినదిగాని లేదు. తత్కారణంబున నచటివిపణివీథులు నామమాత్రంబుగ నుండె.

నిరంతరశివధ్యానమునఁ బవిత్రులై, మహాతపస్సు లొనరించి కృశించి, రాగభయక్రోధమాత్సర్యంబులు దిగఁద్రావి, విషయసుఖముల నపేక్షింపక, భూలోకమునఁ బరమర్షులని పేరందినపండితప్రకాండులే యచటివారకాంతలకుం బ్రియతములు.

మే మశ్వమేధయాజకులము, మే మగ్నిచితులము. మేము మాసోపవాసులము. మాంసవర్జితులము. రాజసూయము లొనర్చినవారము. యుద్ధవీరులము నిరతాన్నదాతలము. మే మభయప్రదుల

మనుచుఁ దమతమసచ్చరిత్రలు చెప్పుకొనుచు నిటునటు దిరుగుచు, నొకప్పుడు భూలోకమున వసింప మొగమెఱుంగనిజనులు బలవంతముగ విమానములను గృహములను, నప్సరోగణంబుల నాక్రమింప నానగరవాసులు నాయిల్లు నావిమానము నావస్తువు నాభార్య యని యనుకొనవలసిన దేదియు లేకుండె.

మఱియు నచటిచతుష్పాజ్జంతువులు దేవత్వములేమి నమృతాశనములు గావు. అచట లభింపమిఁ దృణములు మేయఁజాలవు. గాలిచే భక్షించినను నచటిగోవులు కోరికల నొసంగును. మతంగజములు మహాపరాక్రమసంపన్నంబులు. అశ్వములు వాయువేగయుతంబులు. ఇట్టి నగరము సకలపురవిలక్షణ మైనలక్షణంబుల విరాజిల్లుచుండె.

ఇక్కడ భక్తితో ద్విజుల కిడ్డది యచ్చట నింటిమూల్య మా
నిక్కడి యజ్ఞదక్షిణ లహీనపణంబులు వేశ్యజాతి కా
చక్కని, నిందు యాత్రలు విశంకటమార్గము లాతలంబునం
దిక్కడిద్వారనిగ్రహ మదే యట ద్వారము మానవాళికిన్.

[భక్తితో నిచట బాపల కిడ్డ విత్తమే
యచట నిండ్లకు మూల్యమై యొసంగు
బలుజన్నముల ఋత్విజుల కిడ్డదక్షిణ
లట వేశ్యలకుఁ బణం బై యొసంగు

ఇటఁ దీర్థయాత్రల కేఁగుసన్మార్గమే
యట విశంకటమార్గమై యెసంగు
అల నిగ్రహీతేంద్రియద్వారమే యిట
నటఁ దెఱచిన ద్వారమై యెసంగు

నిచట దీనానాథదీనుల కెలమిఁ జేయు
ధర్మమే 'చీటి' యచటి సుధర్మచేర
నిచటి సద్గురుసుగ్రాహ్యమే మనుజుల
కచటిసద్గురుసాన్నిధ్యమై యెసంగు.]

కల దమృతంబు త్రావఁ గలకాలముఁ గట్టఁగఁ బెట్ట వస్త్రాభూ
షలు గల వైనమున్ మనఁగఁజాలెడిబుద్ధియె లోప మీసువ
ర్వ్యాలకు, సమృద్ధమై సుకృతభోజ్యము నైనపదంబు వట్టి స్వా
ము లనుచు సేవకాళి యని పో తలపోసెద రల్పబుద్ధులై.

వ. ఆనగరమం దిదియొక యద్భుతము చెప్పికొనందగినది. వివిధ తపశ్శక్తులను జేపట్టినవా రగుట లోకతంత్రములు మఱచి, చిరతర బ్రహ్మచర్య మొనర్చి, చివికి జీర్ణించినవా రగుటఁ గాముని పాలిటి కాల మృత్యువులై యచ్చరలతోఁ గ్రీడింప భూతలమునుండి వచ్చిన బ్రహ్మర్షి పాతకులు;—పర్ణశాలను బ్రవేశించుద మనుచుఁ గేళీగృహంబుల దూరుచుండిరి. జడలు విప్పు మనుచు వేణీబంధంబులఁ బట్టుచుండిరి. నారచీరలు తొలగింపు మనుచునే కుచదుకూలంబులఁ దొలగించు చుండిరి 'నలోహితం కుర్యాత్' అని యనుకొనుచు నఖక్షతంబుల నిషేధించుచుండిరి. అన్నన్నా! శిష్టజను లంగీకరింపరే యని చుంబన భేదప్రసంగములం జెవులు మూసికొనుచుండిరి.

షోడశముడులు సడలించుపట్టున జన్నిదమ్ములం బేరుగ ధరించు చుండిరి. రతికూజితము లొనరించుపట్టున మంత్రముల జపించు చుండిరి. అయ్యో! నేఁడు వ్యతీపాత మని క్రీడాసమయమున వెనుకకు మరలు చుండిరి. ఒట్టు పెట్టుకొని చెప్పుము. నీవు ఋతుమతివై యెన్నా ళ్లైన దని రంభాదుల నడుగుచుండిరి. గర్భధారణముహూర్తము దాటిపోవుచున్న దని బాహ్యసురతాదివిలంబమును బరిహరించు చుండిరి. ఉపరతిని నిరాకరించుచు బంధనవిశేషములను బరిత్యజించుచు వేళగానివేళల వీటికాసేవనమా యని తమ్ములమ్ము మానుచు, మహానందసమయమందు మంత్రలింగములను గట్టిగ ధ్యానించుచుఁ బరవశత్వమును గలిగించు రతాంతనిద్రాసమయమున బిందుపతనమువలనకే గాని తలువాత నిషిద్ధ మని యేకశయ్యను విడుచుచుండిరి. ద్వితీయ సురతోచితకాలమందే స్నానవేళ యైనది. గంగకుఁ బోవలెఁ గమ్మం డులువుం డెమ్మను చుండిరి. వీరిచర్యలు గాంచి రంభాదిదేవవారకాంతలు నవ్వుచు, వనరుచు, సిగ్గిలుచు, వింతపడుచుండిరి.

ఉత్సవంబు లూరేఁగింపు లొదవునపుడు
శకుంఁ డెడనెడ వాహ్యాళి సాగునపుడు
వాయుపథమాట బాటలఁ జల్లములను
బూని పూరింత్రు తాళవృంతానిలముల.

అది "దుఃఖక్షతి యుం చబోధహాతి యుం చానందవిస్ఫూర్తి యుం చుదితానల్పవికల్పవాగ్జటిల మై యొప్పారునిర్వాణసం పదకన్నం గడు మిన్న, సౌఖ్యలహరీప్రత్యగ్రసంపాత" మం చెదెదో యాడక మాన మూను టది యెంతే మేల్ కవీంద్రాళికిన్.

హరి పంపన్ మణికింకిణీకలకలం బావ్యోమయానంబునన్
ధరఁ బుణ్యాత్మకు లెక్కి యేఁగుచు నిరాధారాభ్రమార్గమ్మునన్
బరువుల్ వెట్టఁగఁ గన్నులుం దిరిగి నిల్వంగా దిగంగా మదిన్
స్థిరతల్ సాలక మానుషులై చకితులై చిత్రాకృతిం బొందెడిన్.

కమ్మనిపిల్ల తెమ్మెర లెగంబడి రాల్చిన లేఁజివుళ్ళతో
ముమ్మర మైన దేవతరుమూలనికుంజములంపు వేణిబం
ధమ్ముల రాలుపుష్పములు తత్పురవాసకసజ్జికాళికిన్
నెమ్మని సాయముం జలుప నేర్చె నలంకరణక్రియావిధిన్.

దైవతరుణులు విప్రలబ్ధలును ముగ్ధ
లమలసంతానపారిజాతములఁ దరిసి
పాడి, తన్నియుఁ, జాటూక్తి పలికి చూచి
కౌఁగిలించి దోహదము చక్కఁగ నొనర్త్రు.

వ. ఋతువులలో వసంతునివలెను, సర్పములలో వాసుకివలెను వృక్షములలోఁ జందనద్రుమమువలెను, రిక్కలలోఁ జంద్రునివలెను, దేవతలకును స్వర్గమునకును ముజ్జగములకును బ్రహ్మాండ మండలము నకును రాజై, నూఱశ్వమేధయాగంబులకుఁ గర్తయై, వృత్రాసుర సంహార మొనర్చి, రంభాదులుగూడ సహామహామికతో ననుభవింపఁ దగిన యౌవనలక్ష్మి గలిగి యమోఘసౌందర్యము గలశచీదేవికౌమా రము ననుభవించువాఁడై, కావ్యాగమభరతగాంధర్వరహస్యములందు సర్వంకషప్రజ్ఞ గలవిద్యాధరులు వీణానినాదములచేఁ దనమహాత్మ్య

ర్యములు నిరంతరము గాన మొనర్చుచుండఁ బులకితాంగుఁడై యా శ్లాఘాగీతికల విని యసూయపడి వ్రేలమొగంబులు వెట్టు దిక్పాలురం గాంచి తననేత్రసహస్రమును సార్థకపఱచుకొనువాఁడై, చతుర్ముఖుని ముఖములనుండి వెలువడు వేదభారతీసతికి వైతాళికాధికార మొసంగి, పక్షపాతము సహింపలేనివానివలెఁ బర్వతముల పక్షచ్ఛేద మొనరించి, చంద్రచూడచరణారవిందపరిచర్యాధురంధరుం డగు పురందరుఁ డనుఁ డానగరంబును బాలించుచుండె.

నాకవిభుస్వహస్తవలనంబుల నీవులు జాఱిపోవ న
స్తోక నవోఢలుం దమకరద్వయి నాతనివేయికన్నులన్
మేకొని మూయఁజాలక తమిన్ దమకన్నులజంటలన్ వడిన్
జేకొని మూసికొందు రట సిగ్గిలి తామె రహస్యవేళలన్.

అశ్రాంతవేదపాఠాశుష్కముఖులు వి
ప్రులు లభింతురు బ్రహ్మలోకమందు
ముదిరి శుష్కము లార్ద్రములు నైనతులసితోఁ
టలు లభించును విష్ణునిలయమందు
భూతబేతాళముల్ ప్రేతలు వేనవేల్
ప్రమథాధిపునియాటపట్టునందు
అమృతమ్ము మణులును నప్సరోగణములు
వలసినన్ని త్రివిష్టపమ్మునందు
"కామధేనువు కల్పవృక్షమ్ముఁ గూడి
యధివసించెడి నిచ్చో స్వర్ణైకభూమి
ముదిమియుం జావు లేనట్టి త్రిదశవరుల
కాశ్రయం బిది సర్వలోకాధికమ్ము"

ఆదిని స్వర్గసౌఖ్యఫల మైచనుజన్నములం బొనర్పఁగా
వేదము పల్కియున్ నడుమ వెఱ్ఱియసూయను గ్రుడ్డిదయ్యెనే ?
కా దన కందుపై సకలకర్మములున్ ఫలసక్తి లేక సం
పాదనచేయు నా విఫలపద్ధతి నెంబడి నెట్టు దెల్పెనో ?

ఆతనినూఱుజన్నములె యాతనిసంస్థికి కఱుమంబు లా
నాతనిరాణులం గన నసర్హ్వము లాతనివేయికన్నులున్
ఆతనిలోకభోగముల నాతనిసద్గురుఁ డెన్న లేఁడు, నా
చేతములోనియద్భుతముఁ జెప్పఁగఁ జాలవు నాదువాక్కులున్.

వ. అతఁ డొకనాఁడు నిద్రింపకున్నను నాచారప్రకారము దేవవందిమాగధులచే మేల్కొలుపఁబడి, నిర్మల మగుశచీకపోలతల మనెడి దర్పణమ్మునఁ జూచుకొని, కామధేనువును బూజించి, వివిధవిద్యాధరవిలాసములకు సూచకమైనపుష్పశయ్యలతో నాకర్షకముగ నున్నలతామండపప్రాంతములు గలిగి, క్రిందిభాగమునఁ దిరుగు సూర్యభగవానుఁడు పైఁబైకి వ్యాపింపఁజేయు తనకిరణములచే నుడుకెత్తింప లోలోపల వెచ్చగిల్లి మీఁదమీఁద జల్లఁగ నున్నట్టియు, భూసంబంధము లేకున్నను బురాణపురుషునిచరణస్పర్శంబుకతన భువనపావనంబైన గంగకుఁబోయి యందు మునింగి, సిద్ధచారణగంధర్వులు సేవించుసైకతతలమ్ముల పై హృదయాకాశమం దర్చించు దివ్యలింగాకృతి గలచింతామణిమయమైనపరమేశ్వరుం బ్రతిష్ఠాపించి,

అందు నఖరేఖం బోలుశరచ్చంద్రునిచంద్రికాసారమున మనోహరుం డగుమదనాంతకు ననుసంధించి, యాగంగోదకమున నభిషేకించి

కస్తూరికామిశ్రితహరిచందనమ్మును బూసి యాగంగయందలి సువర్ణ కమలముల నర్చించి, కామధేనుఘృతమ్మున ధూపమ్ము వెట్టి, చకచ్చకిత కిరణజాలమ్ముల నొప్పురత్నదీపమున హారతు లిచ్చి, తక్షణమే పట్టి తెచ్చి పిండిన చంద్రకిరణములనుండి జాఱునవద్యుపీతామృతములను, సాంగుఁడై సాయుధుఁడై సపరివారుఁడైఁ సాభరణుఁడై నయతనికి నివేదించి, ప్రదక్షిణనమస్కారంబు లొనర్చి, మైమఱపుష్పాంజలులఁ బ్రసన్నుఁ గావించికొని యుపనిషత్తులచే సంస్తవించి యుద్యాపనము చెప్పి హృదయమునఁ జిరంతనుని ధ్యానించి వాహ్యాళి వెడలవలె నను తలంపున నాచోటు విడిచి వెలికివచ్చెను.

అంత గుమిగూడి యాశీర్వదించు గీర్వాణమునులతో నిండి, యతికోమలాంగుళుల మ్రోయించుమద్దెలసద్దులు, పెదవులయందుంచి తొలగించినవేణువులును, సూటిగ మాటిమాటికిని మీటుపీణాగుణం బులు, వంగుచు చాగుచు నటించుబొమ్మముడులు, నుబ్బుచుఁ దగ్గుచున్న కంఠనాళములు, సగములోనే మాధుర్యమొలికించు గీతాలాపములును మృదుమధురముగ ధ్వనించుమంజీరములు గలయచ్చరల నృత్తగీత వాద్యములును, భటుల బెత్తపుదెబ్బలకు భయపడి పాయపాయ లగు చున్న దేవజనమును, కనులకుఁ గట్టినటులు దగ్గఱగ నిలిపిన కరితురగ వాహనాదులుం గలసేనాముఖముం గాంచి, యింగిత మెఱింగిన యా ధోరణుల చెప్పుచేతలం దుండి సంభ్రమునం దణఁగినమైనాకుని ఱెక్క లనుభేదింపవల దనిప్రార్థింప వచ్చినహిమాద్రివలె నున్నతమై తెల్ల నైనయొకమతంగజము నెక్కి, తాంబూలకరండముం బూని రూపెత్తి వచ్చిన మదనసామ్రాజ్యసౌభాగ్యదేవతం బోలినమేనకయు, మదన జ్వరకదుష్ణము లగుస్వర్గకామినుల క్రేఁగంటిచూపుల నివారించుటకుఁ

లోని మహేంద్రాదిముఖ్యులు పూని యత్యాదరముగ నిలువ రంభయు నచట నిలుచుండెను.

గొప్పచిక్కుబలములతోఁ బురస్సరంబు లగు కరితురగసంఘముల కోలాహలమునుండి ఎత్తుకొలుపు దేవసైన్యముల మొదలనుండి తెగి జాఱి వెలుఁగిన మౌక్తికహారాగ్రసంబంధమునఁబోలెఁ దెల్లనై, దేవకాంని మలఁ గల్పమందారకుసుమముల మకరందధారలను నిరసించుటకువలెఁ గిరీటంబుపై ధరింపఁబడి, యల్లెసల ముత్తెపుజాలులు వ్రేలుచుండుట వలనఁ గోపించిన రాహువు పెక్కుచోటులఁ గాటులు వేయఁగాఁ దద్రంధ్రములనుండి స్రవించునమృతధారాసహస్రములు గలచంద్రమండలమో యనఁదగు బ్రున్న శ్వేతచ్ఛత్రముం దాల్చి, బ్రహ్మదేవుని యనిమేషసృష్టికల్పనమును సాఫల్య మొనర్చుచు, గంధర్వుల వివిధవాద్యఘోషంబుల నిండినయాకాశావకాశములతోపాటు సంకులముగఁ జలించు దేవసమూహము సింహనాదము లొలర్చుచుండ నయ్యంతరిక్షమున వాహ్యాళి వెడలెను.

మసలం గొల్చి నటించువారవనితామంజీరనాదాలఁ గి
న్నరహస్తమ్ముల మ్రోఁగుమద్దెలల మంద్రస్నిగ్ధరావమ్ములన్
గరిమన్ బాడెడిసిద్ధచారణుల శ్లాఘాశ్లోకశబ్దంబులన్
హరిసేనాముఖసీమ నాదమయుబ్రహ్మాక్రాంత మయ్యెన్ దివిన్.

వెనుకను ముందుఁ బార్శ్వముల వీక్షణవృత్తి నలోకపద్ధతిన్
గనుఁగొనుచుండ నల్గడలుఁ గన్నులఁ గట్టఁగ; దేవరాజు వే
గములను రెప్పలార్పుటలఁ గన్బొమలన్ నవుమోములం గనన్
మునుకొని ప్రోవుప్రోవుగను ముందుకు వచ్చిరి దేవనాయకుల్.

వ. అట్లాకాశమార్గంబున నేఁగుచు నామహేంద్రుఁడు:- విభూతిపూఁతతో నిండిన దేహకాంతివలన వర్ణోత్కర్ష మొంది, హృదయమునిండి పై నుబుకుచున్న కోపానలజ్వాలలవలెఁ బాటలవర్ణము గలజటలవలన మెఱపులతోఁ గూడినశరత్కాలమేఘమును దిరస్కరించుచు, ముల్లోకములందలిమునులకంటె విలక్షణంబుగ శాపాభివర్ధితతపశ్శక్తి కలవాఁడనుకీర్తి నాఁగ నొసటఁ ద్రిపుండ్రరేఖ గలిగి, యతితీవ్రతపోనలజ్వాలలతాఁకున మలినమ్ములై ప్రతిశాపాంకురములవలె నున్నరుదురాక పూసలమాలిక ధరించి, సోదరుం డగుచంద్రునిసందేశమును జెప్ప వచ్చినరిక్కలవలెఁ జెవిని వేలుస్ఫటికాక్షగుళికలు గలిగి, యుత్తరాసంగంబు లేక కౌపీనమాత్రశరణుఁడై యనుక్షణము చిటికెలు వేయుచు దారి నెదురుపడినసిద్ధకాంతల నడ్డుచు, భీతులను భయపెట్టుచున్నటులు నింద్రభటులనుగూడ జడిపించుచున్నటులు పాడుచు నాడుచుఁ దొట్రిల్లుచు నట్టహాస మొనర్చుచు, హృదయకమలకుహరమున విహరించు నున్మత్తశేఖరుని నిరంతరము భావించుటచే నున్మత్తునివలె నుండి, తాను సర్వవాంఛలుఁ దీఱినవాఁ డగుట లోకతంత్రములం దనాదరముం జూపుచుఁ, ద్రిలోచనావతారుఁడైనను నత్రిలోచనావతారసోదరుండై యనసూయాగర్భసంభవుం డైనను మిగులఁ గోపనుండై, కష్టతరతపస్సొనరించి గౌరీప్రసాదముగ నొక విద్యాధరకన్య కొనిపోవుకాంచన చంపకమాలిక నడిగి శాపభయంబున నామె యొసంగఁ బుచ్చుకొని, యభిమంత్రించి విడువఁగ నపార తేజంబున మీఁదికి వచ్చిపడుపాశుపతాస్త్రంబువలె నున్నదుర్వాసోమునిం గాంచెను

మహాతేజశ్శాలి యగునతని దుర్వాసుఁ డనియు, నఖిలలోకముల నస్తినాస్తి శబ్దభావముల నూఁగులాడింపఁగలబాపం డని యెఱిం

గీయు, మహామునుల దిరస్కరించిన నహుషునంతటివానిదుస్థితి గుర్తె ఱింగియు, బృహస్పతిశిష్యుం డయ్యును, ధర్మశాస్త్రమర్మంబుల శీలించినవాఁడయ్యు, బ్రాహ్మణసేవలయం దనురక్తుఁ డయ్యుఁ, బిపీలికాది బ్రహ్మపర్యంత మేకర్మమునకు బద్ధమైనదో తద్విలాసమువలనిత్రిభువనాధికారమదమునఁ గనులు గానక, బుద్ధిమదగ్రేసరుండైనను నాసహస్రాక్షుండు తనవాహనమ్మునవరోహింపలేదు. మాటవరుసకైన నతని గౌరవింప మానె. చివరికొక్కనమస్కారమునేని చేయకుండుటయే గాక యాతఁ డందించినపూలదండ నొంటిచేత సగర్వముగ నంది దానిని కంఠమున ధరింపక యొక్కపరి కనుల కద్దుకొని మూర్కొనక యా ముని గాంచుచుండఁగనే తనయైరావతమ్మునఱుత దానిం దగిలించెను. తోడనే యది స్వభావచంచల మగుతనతొండంబున దానిం దెగలాగి యిటునటు నూపి పాదాగ్రహతి భగ్నంబు గావించెను.

చండికసత్ప్రసాద మగుసంపెఁగమాలిక నాబిడౌజు ను
ద్దండగజంబు పాదములఁ దన్నుట నల్పుటఁ గాంచి మించి యా
చండతరప్రకోపుఁ డటు చఱ్ఱున రేఁగుచు దండ తట్టుచున్
గండలమొందు గ్రొక్కదలఁగాఁ గనుగోనలఁ గెంపుఁ దాలిచెన్.

పరమమాహేశ్వరుండు దుర్వాసుఁ డిటులు
క్రుద్ధుఁడై వీరభద్రుని కొమరుఁ జూపఁ
జేయునది లేకఁ దా విన్నఁబోయి యున్న
వృషుని గాంచిరి బుధులు సిర్విణ్ణు లగుచు.

ఏకంబై బుధు లెంతలో హరినిఁ దా వీక్షింప మందీభవ
త్కాకువ్యాకులగద్గదస్తుతిపురస్కారమ్ముగాఁ జేరిరో
కాఁకం ద్రిప్పుచుఁ దారకల్ బొమలు లోక మ్మాఁక వెట్టంగఁ జాల్
శ్రీకంఠాంశుఁడు మౌని యింద్రుని శపించెన్ గ్రుద్ధుఁడై యంతలోన్.

ఏత్రిలోకాధిరాజ్య మహీనవృద్ధి
నీదునాలంబనంబున నెగడునదియొ
యది సమస్తమ్ము వుడె నీదునహితకోటి
వశము కావుత మనుచు దుర్వాసుఁ డనియె.

దైన్య మంది పల్మాఱు పాదమ్ము లంటి
ప్రార్థన మొనర్ప నింద్రుఁ డాపరమమునియు
లోఁగి శాపాంత మొసఁగెను, లోకరీతి
క్షేమములను గోవిందుఁడే చేయు ననుచు.

వ. అట్లతండు హుంకారటంకారం బొనరించి తనత్రోవం బట్టఁగా నంత మహావైభవముగ సాఁగుచున్నను నయత్నముగఁ దగిలిన శాపముకలన నుత్సాహముడక్కి సంపూర్ణమండలుండై రాహుముఖంబునఁ బడుచంద్రునివలె నింద్రుండు త్రపారోషవిషాదములఁ గ్రుంగి, తన వేయిచూపులచే భేరీపటహవీణాదివాద్యములను, కిన్నరీగానమును, రంభాదులనృత్యమును, వైతాళికుల కోలాహలమును, వేత్రధారుల హాహారవములను, భటసింహనాదములను, పీఠమర్దవిదూషకపరస్పరాలాపములనెల్ల నిలిపివైచి, గుఱ్ఱము సకిలించినను, బదచలన మైనను, చీకాకుపడుచు, గజకంఠాలంబిఘంటికలను దొలఁగించి, బంధింపఁబడి

నటులు, మూకీభూత మైనటులు, బధిర మైనటులు, ముగ్ధ మైనటులు, చిత్రిచిత్ర స్తంభటులు, దనసైన్యము నరికట్టి నగరుచేరి యేతద్వృత్తాంతంబు గురుదేవుల కెఱిగించి యంతఃపురము ప్రవేశించి మహావిచారమున మునింగి యారాత్రి శయనాగారంబునే జాగరమొనర్చె.

పిదప మునిశాపసందర్భంబు చారముఖంబున రహస్యముగ విని మంత్రి యగుభార్గవునాజ్ఞ వడసి చిరకాలమున కవకాశము లభించుకతనఁ దమతమయుద్ధకౌశలముల నెఱవుచు, మహాస్త్రసిద్ధులను ఫలయుక్తముగ నొనర్చుచు, విరోధముం దీర్చికొనుపద్ధతుల నుగ్గడించుచుఁ జిరతరనిరూఢ మైనయపకీర్తిని దొలగింపఁదలఁచి దుర్వాసు నభినందించుచు, తత్కాలంబున నగుశుభశకునములను జెప్పికొని యుబ్బితబ్బిబ్బు లగుచు, వీరవాదము లాడుచు, బలములను సంఘసంఘములుగ వేఱొనర్చుచు, చారసంచారంబు నడ్డుచు, గంతవ్యప్రదేశములఁగూర్చి యాప్తులకే యెఱింగించుచు, నేనుఁగులమెడగంటలను, నశ్వములహేషాణంబులను, భటులతూర్యరవములను, యోధవరులయట్టహాసములను, నిషేధించి, పురోహితునకు నమస్కరించి, యోధముఖ్యులను గౌరవించి గురుజనుల రావించి, జ్యోతిర్వేత్తలను రప్పించి, తమ పూర్వదైతేయులను, వారివారి వేదాపహరణాదిప్రచండకృత్యములఁ దలఁచి పఠించుచు దానవు లొక్కపెట్టున బయలుదేరిరి,

అందుఁ గొందఱు మితిమీఱినభుజకండూతి కలవా రగుటను, గాలగతివలనఁ బరిపక్వ మైనశక్తిసామర్థ్యంబు లున్నవా రగుటను గొండలను గోట మీటను, సప్తసాగరములను ముఖమారుతమున నూఁదివేయను, బాతాళము నొక్కబెల్లుగఁ బెల్లగింపను, నాకసమును

పైపైకి నెట్టివేయను, బ్రహ్మాండముం దలక్రిం దొనర్పను, జంద్రార్క దీపముల నార్పివేయను, దహను నిదగ్ధ మొనర్పను, బ్రభంజనుని భంజింపను, పాశినిసైతము పాశబద్ధు నొనర్పను, దుర్దాంతుఁ డగునంతకునిం గూడ నంత మొందింపను బూనికి గలవారై, చేయవలసిన దెఱుంగనివారగుట మహామంత్రుల కరసంజ్ఞల ననుసరించి నడచుచు, గగవమే నిత్యనివాస మగుట నెన్నండును దనయొద్దకు రానిగంగను గౌరవింప వచ్చిపడు సముద్రునివలె వెల్లివిరియు మహాసైన్యముతో నమరావతి పొలిమేరం బ్రవేశించి కరిబృంహితములతో వివిధమహావాద్యమ్ము లొక్కపెట్టున మ్రోయించుచు భటులసింహనాదకోలాహలము దిగ్భిత్తికలఁ బగిలించుచుండ హాయిగఁ బరుండిన దేవతలను మేల్కొల్పిరి.

ఆనాఁ డాదివి రుష్టదానవకరవ్యామర్ద భీమధ్వన
న్నానాతోద్య నినాదకాతరిత దిఙ్నాగప్రలాపమ్ముగన్
దానై లో ననుకోక నచ్చిననిరాతంకప్రసంగార్తికిన్
లోనై క్షుబ్ధసుపర్వసైన్యముగ నెంతో సాంద్రమయ్యె న్వడిన్.

అదిగో స్వర్గము నాక్రమించి రదదే యాదారులం ద్రొక్కర
ల్లదె ప్రాకారములోనికిం దిగి రహాహా! దారుణం బయ్యెడుం
గదనం బిప్పుడు, శత్రువుల్ హరిని బిగ్గంగట్టి రం జెల్లెడన్
చద లంటెన్ బహులప్రవాదములు వాచాటూఢిఁ గ్రొంగ్రొత్తలై.

వ. వెంబడినే ప్రలయసమయమున నుప్పొంగు సప్తసాగర భయంకరఘోషంబునా రేఁగిన నాగరకులకోలాహలమువలన శత్రువుల యాక్రమణ మెఱింగి, యప్రతిహత మగుమునిశాపమున నుత్సాహము

చెడినను గరిబృంహితమునకుఁ గంఠీరవంబుపోలిక మండిపడుచు మహేంద్రుఁడు తనశయ్యనుండి దిగ్గన లేచెను.

సమరము సంభవించు ననుభయమ్మును, దొందరయు, స్నేహము గలుగ శచీదేవి యాతని సమీపించి స్త్రీసులభ మగుకాతర్యమున "ఓమానాధికా! యిట్టి సాహసము వలదు. తగినవారలనంపుము" అని ప్రార్థించుచున్నను నామెను లక్ష్యముసేయక, బుజమ్మునుండి జారునుత్తరీయమును సేవకురాండ్రందించుచుండఁ దొందరవలన నడుగులు తడంబడ మిగుల భయసంభ్రమములతో దౌవారికులు తలుపులు దెఱువ దూతలమాటలం దెలుపఁ బోరిగుపడిన కుబ్జవామనులు గల తనయంతఃపురద్వారమును జేరి, సేవకులచేయూఁతలు లేక, మణిపాదుకలవైపు చూడక, సేనల గానవెట్టక, రథాదుల నపేక్షింపక, కాలి నడలఁ బోవుచు, నెదురైనసైనికుల 'తమరు మరలుఁడు, అని చేయు విజ్ఞాపనములను వినక, బొమముడులు చిట్లించుచు, శిరము పంకించుచు, చారవచనము లాకర్ణించుచు, నాప్తులనిషేధవచనము లవకర్ణించుచు,

మహాయుద్ధ సంరంభంబునఁ దన యెట్టయెదుట నటునిటు తిరుగు జయంతుని శపథపూర్వకముగ నాఁపుచు, నంతఃపురరక్షణార్థ మాతని నియోగించుచు, నాప్రదేశమునుండి కొంతముందున కేఁగుచు గృహబహిర్ద్వారమువఱకుఁ దెచ్చిన మొలపట్టికను దొందరగ ధరించి, యుద్ధమార్గమం దందిచ్చిన కంచుకమును దొడిగి, వీధిమొగదనుక వచ్చి యందిచ్చిన వజ్రాయుధము నందికొని, మాతలితోఁ గూడిన రథమును గోపురప్రాంతమున నధిరోహించి, సమ్మర్దముగఁ దిరుగు దేవభటులతో దుర్గమం బగుగోపురద్వారము నుత్తరించి సేనాముఖము నతిక్రమించి

రాక్షససాహసిం జొచ్చి, యలంఘనీయవచను లగు దిక్పతు లెదురై మేమే ముందుగ నీవిజయమును సాధింతు మని యుద్ఘగింపఁ జంద్రోదయమ్మున నుప్పొంగుసముద్రము చెలియలికట్టకుఁ గట్టువడిన ట్లాగి, మొక్కవోని సమరదురాగ్రహమ్మున దేహమాత్రముతో సేనాముఖమందు నిలిచెను.

భీమ మగుసురసైన్యము భీమ మైన
శత్రుసైన్యము నెదిరించి సాగు టరయ
కనలి కల్పాంతమందు సాగరము, సాగ
రమ్ము నెదిరించి నట్టులు రహి వహించె.

ఎక్కులువెట్టి నారి మొరయించుచుఁ గ్రూరముగా మహాభటుల్
మిక్కుట మూచు నెంతవడి పేరలు విడాటిరొ యంతలోనె తా
నెక్కడ దేవరా జచట? నెక్కడ దానవరా? జటంచుఁ బెం
పెక్కిన యోధవర్గముల కెచ్చెను సంగరసంభ్రమార్భటుల్.

వ. పిమ్మట సునాసీరుండు తన సేనాముఖంబును బ్రవేశింపఁ జిరకాలమునుండి పెరిగియున్న ప్రభుఋణముం దీర్పవలసినయక్కఱ కలుగుటవలన నుత్సాహవంతులై శత్రుబలంబులనువలెఁ దమజీవితంబులు తృణప్రాయముగ నెంచుచు, నొఱలు దుస్సినశస్త్రాస్త్రములను వలె యుద్ధభయమ్మును దులిపివైచి, పుత్త్రదార పరిభవములనుబోలె నెడనెడ సంభవించిన ప్రభువుల కోపతిరస్కారములను మఱచి, వచ్చి పడుచున్న మిత్త్రసైన్యములనువలె విజయలక్ష్మిని సరకుగొనక, శరా

గ్నులందుఁ దమతమ దేహములను వ్రేల్వ నుంకించుచు, శరత్కాల చంద్రికామనోహరంబు లగు కీర్తికందలంబుల వృద్ధి నొందించుచు, మతంగజమ్ములను దున్నలవలెను, గుఱ్ఱములఁ గుక్కలరీతిని, పదాతిగణమ్ములను బరాగకణమ్ములపగిది మహారథికులను మశకమ్ములట్లును, కుంతతోమరాద్యాయుధాఘాతంబులఁ బూలచెండ్ల తాఁకుడులమాదిరి, బాణవర్షమును బుక్కాముఁ జల్లుకొనుటవలెఁ దలఁచుచు, దెబ్బలు తినియు హర్షాట్టహాసంబులే యొనర్చుచు, లేడిపిల్లలపై సింగంబులవలెను జలసర్పములపై గ్రద్దలవలెను, ననంటితోఁటలపై మదగజయూథంబు నట్లు, శుష్కశాల్మలీవృక్షంబులపై దావాగ్నులరీతి దానవులమీఁదికి నిశ్శంకముగ నుఱుకుచు,

బరశ్వధముల బాదుచుఁ, గుంతమ్ముల నెదురుఱొమ్ములం గ్రుమ్ముచుఁ, గత్తులఁ గుత్తుకల నుత్తరించుచు, శతఘ్నులఁజిల్చి చెండాడుచు, భిండివాలమ్ములఁ జండగతి ఖండించుచు, శరజాలములఁ జిత్తజల్లులుగఁ జిమ్ముచు, శక్తిశూలాదులతో మట్టివేయుచుఁ, ద్రెడ్డులం బొడిచివేయుచుఁ, బాశంబుల బంధించుచుఁ, బరిఘులచే బాదుచు, లాంగలమ్ముల నాకర్షించుచు, ముసలాయుధమ్ముల దంచివేయుచు, విజయధ్వజంబుల భగ్నమొనర్చుచుఁ, గవచములఁ దుత్తుమురొనర్చుచు, ధనుర్గుణమ్ములను ఖండించుచు, సారథులను గూల్చుచు, నెత్తురుటేరులం బ్రవహింపఁజేయుచుఁ, గటపూతనాదిపిశాచగణములఁ దృప్తిపఱుచుచు, రుధిరమ్ము నొడళ్లకు వీరగంధములు వెట్టుచు, హస్తములకుఁ బేగులం జుట్టుకొనుచుఁ, దెగిపడి దొరలుతలపండులం దాఁటుచు, దండిగ నుండినమొండెమ్ములపైఁబడి తొట్రిగిలుచుఁ, బొలికలనఁ జచ్చి పడియున్న కొమరులనేని గాంచక, శత్రుభటులను యూథయూథ

ములుగఁ బడఁగొట్టి తృప్తి సెందక, యఱవాయి గొనని దేవభటు లమర పతి వేయికన్నులను సఫలపఱచిరి.

పిదప దేవరాజు యముని సేనాగ్రిభాగమం దుండున ట్లాజ్ఞా పించి యతని కిరుపార్శ్యములఁ బవనపావకులను, వెనుక నైర్ఋతిని, యుద్ధ శూరులను గారవించుటకు దగ్గఱగఁ గుబేరుని, శత్రుమార్గమందు వరు ణుని, క్షతగాత్రులకుఁ జికిత్స సేయుటకు శిబిరములం దశ్వినీదేవతలను, రాత్రించరులకు రాత్రిసమయము బలవత్తరం బగుట రేయి పడకుండ సర్వదా ప్రకాశింపు మని మార్తాండు నియమించి, విజయలక్ష్మిని గోరుచున్నను, నాకస్మికముగ వచ్చిపడిన తాపసశాపపరిపాకంబునకు మానసమ్మున నుమ్మలిక గొనుచు, పట్టిబట్టబయ లగు నభోవిభాగాధి పత్య మనెడిలక్ష్మి నపేక్షించి కలహించు దేవదానవుల యజ్ఞానవిలసిత ముం గాంచి పకపక నవ్వుకమలాసనుని యట్టహాసంబువలె మేఘ రహితం బగునొక మహాగర్జను వినెను.

సేనాముఖంబున జరుగువిశేషంబు లెప్పటికప్పుడు నివేదించు టకై వాయుదేవు నంపఁగా నతనియాగమనముచే ప్రతికూలవాతములై యిందుద్రిని కపశకున మయ్యెను. యాతనిచేతినుండి దంభోళి జాఱెను. అయ్యదియు నాయుధభ్రంశము నశనిపాతమునునై రెండు తెఱంగుల దుశ్శకునమయ్యెను.

అంత మందిన యుభయసైన్యములయోధ
వరులచే భిన్నమండలత్వమును గనియు,
దానవోగ్రనారాచ విదారితత్వ
మందియును, సూర్యుఁ డల్లల నస్తమించె.

అసమయమ్మున మార్తాండుఁ డస్తమింప
బాణవర్షము ప్రబలమై పరగుకతన
భాగ్యముల పంటవోలెను బరుల కపుడు
గాఢతిమిరంబు జయద మై కప్పుకొనియె.

వ. అప్పుడు క్షణక్షణపరివర్ధమాన మగు దేవసైన్యమును, క్షీణించు తనసైన్యమును జూడంజాలక క్షుధార్తములగు తరక్షువుల కరణి, దండతాడిత భుజంగంబులమాడ్కి, బలిబాణశంబర నముచివిరోచనాదులు కవచములు దొడిగి, యంగుళిత్రాణంబులు సుట్టి, యక్షయ శరములు గలయంపపొదులను భుజంబులకు బంధించి, ఖరతురగంబులు పూన్చినయరదంబు లెక్కి, వికటభ్రుకుటీకుటిలాననులై వీరపాణ మొనర్చి, జయంబు చేకొనక వెనుదిరుగ మనుపూన్కితోఁ బరస్పరముఁ బ్రతిన లొనర్చుకొని, ధనుష్టాంకారములచే దిక్కులు పిక్కటిల్లఁ జేయుచు, నట్టహాసంబుల నాకసమునుండి రిక్కల నొక్కుమ్మడి రాల్చుచుఁ గాంచవచ్చిన సిద్ధచారణగణములను గత్తివిసరుల నిశ్చేతనుల నొనర్చుచుఁ, దమయుద్ధోత్సాహముచేఁ గలహాశనముని నాశ్చర్యచకితు నొనర్చుచుఁ, బదాతిగణంబులఁ బాఱఁద్రోలుచు,

పరిఘాఘాతంబులచే రథంబులఁ జూర్ణ మొనర్చుచుఁ, జప్పటులచే గుఱ్ఱంబుల బెదరించుచుఁ, జిటికెలచే మదపుటేనుగుల నదలించుచుఁ, బ్రళయవాతమువలన నేర్పడిన సముద్రపుసుడివలె నున్న ముఖగహ్వరమున, లోకముల నాకివేయుదు నన్నటులు చలించుజిహ్వాపల్లవము నల్లార్చుచుఁ జూపఱుగుండెలు కూల్పుయముని గాంచి

వానియమోఘ మగు కాలదండమును లాగికొని దానితోనే వానివి మోఁది మొదటివిజయ మందఁగలిగిరి.

కాలదండహాతుం డగుకాలునసువు
లపహరింపఁగ వేఱొక్క యముఁడు లేమిఁ
గొసకుఁ గూలిన, నాతని గొంతులోనె
గుఱగుఱం బ్రాణములు గొట్టుకొనుచు నుండె.

వ. మున్ను తారకాదుల నిరోధమువలన వర్ధిల్లు మహాకోపమున మంటలు వెలిగ్రక్కు నగ్నిని చుట్టుముట్టి, పరుషహుంకార ఫూత్కారములచే నాతని నార్పివైచి, తద్వాహన మైనమేఁకను ముందుకాళ్లను బట్టి లాగివైచి, యతని యొద్దనుండి బలవంతముగ నతని 'శక్తి' అను నాయుధము నాకర్షించి, 'ఒరోరి! దేవతల కన్నము మోసికొనిపోవు హవ్యవాహుఁ డనునిర్జరాధముఁడు దొరకినాఁడురా! కుండలతో నీరు గ్రుమ్మరించి వీని నార్పివేయుఁడు. వంటవానికి వీని నర్పింపుఁడు.

వలదు వలదురా! ముఖమారుతముల వీని నూఁది మండించి నచో నమరావతిం దగ్ధమొనర్ప నుపయోగించును. ఓ మూర్ఖులారా! వీఁడు బాడబుఁడు విడువుఁడు, శిఖను జూపుచున్నాఁడు. అని పరిహాస మొనర్చుచు, గెంటుచు, భయపెట్టుచుఁ, గొట్టుచుఁ, దన్నుచు, రక్కసు లా యగ్నిని బరువెత్తించిరి.

యుద్ధమున మిత్రునికిం గలిగిన యత్యాహితమును గాంచి యొక త్రుటిలో సన్నద్ధుఁడై సవ్యాపసవ్యములుగ సుడులు వెట్టుచుఁ, బ్రచండలాఘవమున మహావృక్షముల నెగురంగొట్టుచు, రాళ్లనుగూడ నుద్దండముగఁ దూలించుచు, మహావేగముతో నెగిరి గిరగిరం దిరుగు

నెండుగాదముతో పాటు చుట్టుకొని కంక కాకగృధ్రములు దిరుగుచుండ, విస్తృత మగు శంకర శిరమందలి వికటజటాజూటమునఁ దిరుగు గంగా ప్రవాహఘూళంఘుళ భీకరధ్వనితో నాకాశమును ముఖరిత మొనర్చుచు, ప్రళయకాలోచితరూపమును దాల్చి రాక్షసబలముపైఁ బడుచు, గుఱ్ఱపుదడముల నెండుటాకులవలె దిగంతముల కెగురంగొట్టుచు, రథ షండము నడవిమ్రాఁకులవలెఁ జూర్ణ మొనర్చుచు, మదపుటేనుఁగుల నిట్టికలవలె విసరికొట్టుచుఁ, బదాతిగణము నంధప్రాయ మొనర్చుచు, సేనాధిపతుల నడ్డుకొనుచు, నస్త్రశస్త్రములను వెనుకకుఁ ద్రిప్పి వేయుచు జయపతాకలను బెళపెళ విఱుచుచు, మహాసురులనుగూడఁ దొట్రుపడఁజేయుచు, సంవర్తమారుతమురీతి యుద్ధభూమి నంతయు నక్రమముగ సంచరించెను.

వాయు విట్లు చెలరేఁగునంతలో విరోచనుని లోచనములు దిరిగె. శంబరుఁడు యుద్ధాడంబరంబును బ్రకటించె. జంభుఁడు స్తంభుఁ డయ్యె. బాణుఁడు సంగ్రామమదోల్బణుఁ డయ్యె. నముచి సమరరుచి గలవాఁ డయ్యె. బలి యతిబలి యయ్యె. వీరంద ఱొకరి మోము నొక్కరు చూచికొని చిఱునవ్వులు నవ్వుచు, దేవతల పౌరుషముం గాంచి యబ్బురపడుచు నిట్లనిరి. "ఆహా! దేవతలుగూడఁ బరాక్రమముం జూపుచున్నారే! అందును దూతగ నుండవలసిన యీ గాలిగాఁడును బరాక్రమించుచున్నాఁడే!!

ప్రాణాయామము పట్టి బాప లెవనిన్ బంధింతురో లోన, నె
వ్వానిం బువ్వఁగ గీటసర్పతతి కాపాదించిరో పెద్ద, లే
దీనుం డిట్టటు చింకిచేటలను నెంతేవీవఁగా బుట్టు నా
మానం బేదినగంధవాహుఁ డెటు సమ్మాన్యుండు నోజస్వియా?

వ. పోనిండు. ఈగాలిగాని బాధింపకుండు. ఇతఁ డీ యగ్గిగాని మండింపఁజేయుటకుఁ దోడ్పడఁగలఁడు.

ఎవ్వాఁడు బిలములందున
సవ్వడి లేకుండఁ దూఱి చక్కఁగ మెలఁగున్
అవ్వాని వానిభృత్యులఁ
గ్రొవ్వఱ శరపంజరమునఁ గ్రుక్కుద మింకన్.

దితిజుల్ డగ్గఱి యెంతలోఁ బవను బంధింపం బ్రవర్తించుచున్
గుతుకం బొప్ప ధనుర్గుణంబులను నెక్కుంబెట్టిరో దిట్టలై
యతిధిక్కారవిరోధిముక్తపటుబాణాదుల్ జగత్ప్రాణుప్రా
ణతతిం ద్రుంపఁగ వచ్చి నాఁటుకొనె నంతన్ భీకరప్రక్రియన్.

అర్కశశాప్రసలాంకమ్ము లై సుపర్వ
వరులచే నభిమంత్రింపఁబడినయస్త్ర
తతులు మోఘమ్ము లయ్యె నాదనుజులందు
నవనిపై భ్రష్టపదునాజ్ఞయట్టు లపుడు.

బలముకొలంది లాగి విడువంగ నొడళ్లను గాఁడవచ్చుచున్
జ్వలదనలప్రభల్ నెఱపఁజాలుచు రక్కసు లేయునారస
మ్ములు ప్రళయోగ్రశూలి గళభూషణభీమభుజంగపూత్క్రియా
నిలముల మించె నం చెద గణించి కలంగిరి దేవనాయకుల్.

ప. ప్రచండమైనవాతము వీచుచుండ, మేఘములు దూది పింజలమ్మాడ్కితూలిపోవుచుండ, సముద్రములు నింకింపఁజేయు నతనిసామీ

స్యమునకు జలజంతువులు చేర లేని కారణంబునఁ దనబొందెతో మాత్రము మిగిలి మనసు కుదురు లేక వరుణుండు సామాన్యజనునివలె సేనాముఖంబు వెలుపల నిలువంబడెను. శత్రువులు కురియించు శరవర్షమునకుఁ గవచములు తుత్తునియ లగుటఁ జర్మములు పగిలి కర్మదేవతలు, మనకీబుద్ధివికార మెందులకుఁ గలుగవలెను? ఎవరికొఱకు మన మసురలతోఁ గలహింపవలెను? ఏ కారణంబునఁ బగర వధింతుము? ఈ యాయాస మెందులకో తెలియకున్నది. మనకు దేవత లెవరు? దానవులనఁగా నెవరు? ఎన్నో తపస్సు లొనర్చి మన మీతావు నొందఁ గల్గితిమి. ఎవఁడు మనల నిగ్రహించును? ఎవఁ డనుగ్రహించును? నాకలోకం బెవ్వఁ డేలుకొనునో యాతనికే మన మతిథులము. అని తమలోఁ దా మాలోచించికొని రణభూమినుండి తొలంగిరి.

యుద్ధయజ్ఞమున దేహములు వేల్చుటచే దేవత్వము నంది స్వర్గ మలంకరించిన కొందఱు రాక్షసవీరులు రహస్యాలోచనము నొనర్చుచుఁ గొంతసేపు సహృదయులై కొంతసే పహృదయులై సంచరించి గుట్టుమట్టు లెఱింగి హఠాత్తుగ దేవబలముం బరిమార్చిరి. వెడలిపోవు కర్మదేవతలను, గొట్టుచున్న దైత్యదేవతలను, జూపులందు విషముగలిగి వచ్చిపడుసర్పతుల్యంబు లగు బాణంబులను, గట్టులను ముంచు మహాసముద్రకల్లోలంబుకరణి విశృంఖలముగఁ జెలరేఁగిన రాక్షసభటులను, నసమర్థు లగు సేనాధిపతులను, మూర్ఛమునింగిన తమస్వామిని గాంచుచు, రక్షకునిం గానక దుర్వాసశ్శాపబలము హృదయంబులందుఁ బ్రవేశించుటవలన వశముదప్పి బాధలను నొందువారై, స్తబ్ధులై, ముగ్ధులై, విషాగ్నులం గాల్పఁబడినవారివలె, మత్తుమందులఁ బూయఁబడినటులు, జీవితలోలుపులై కొంచెపాటి వివేకమున జిరకాలమునకుఁ గలిగినలక్ష్మిని

క్షణిక మగుదురాలోచనమ్మునఁ బోఁగొట్టుకొనువారై, కాంచుచున్నను గుడ్డివారివలె, వినుచున్నను జెవుటివారికరణి, గ్రహించుచున్నను జడులపోలె, నపకీర్తితో నిండినవారివలెను, దురదృష్టదేవతచేఁ గాఁగిలింపఁబడినవారిపగిది, కులశీలములు మఱచి సిగ్గుమాలి, తూణీరమ్ములను దింపి, యరిబలమునకు వెన్నిచ్చి, జయాయుధములవీడి, భిక్షాకపాలములఁ జేపట్టి, సృష్టి మొదలు ప్రలయపర్యంతము బ్రాహ్మణదత్తయజ్ఞభాగముల వలనఁ బరిపుష్టి నందుటంబోలె యుద్ధము సిద్ధమైనంతనే తమయాయుధవాహనాదులతో నిసుకవంతెనలు విరిసినట్లు దేవభటులు పికాపికలైరి.

పాఱెడి దేవయోధులను బాటల నడ్డులుగొట్టి పట్టఁగా
జేరెడి శత్రుసైన్యములచేఁ దెగమోఁదుట నుద్భవిల్లి, యా
భేరులభాంకృతుల్ త్రిదివ విప్లవసూచకముల్ వినంబడం
గా, రణ ముజ్జగించుచు దిగంతము లంటిరి భ్రాంతదిక్పతుల్.

[పరువుల్ పెట్టెడి దేవయోధవరులన్ భర్జించి పట్టంగ సం
బరముం జూపెడివైరిసైన్యములచేఁ బల్మాఱు మ్రోయింపఁగా
సురలోక ప్రళయమ్ముఁ దన్ముఖముగా సూచించు దైవజ్ఞులై
మొరసెన్ భేరులు కాహళుల్ డమరుకమ్ముల్ నిర్జరాశాతతిన్.]

వ. అంత యుద్ధాశలు వీడి దిగీశులు దిక్కులు పట్టిరి.

గట్టులు పుట్ట లబ్ధులును గందరముల్ వనముల్ సమస్తమున్
నట్టులు వాయుభుక్కు లగునాగమునీంద్రుల కీదివమ్మునున్
జుట్టిరి రక్కసుల్ నిలువఁ జోటులు లేవని యేమిఁదోఁపకే
గుట్టుగ నాశుగుండు నడఁగున్ విమతప్రహితాశుగంబులన్.

వ. పిదప నాకస్మికముగ నాకసము విఱిగి భూమింబడి చెదరినట్టులును, హద్దులు మీఱి సంద్రములు ప్రవహించినటులును, వ్యాపించు నసురసైన్యమును, మైత్రివిషయమునఁ బెక్కు పరీక్ష లందినను, యుద్ధములం దపారవిజయము గాంచినను, కత్తి పట్టు టెఱుంగనివారి వలెను, యుద్ధకథలు విననివారివగిది, కాకులమూఁకలంబోలెఁ, గోతుల గుంపుల కరణిఁ, గేరళ సేవలమాదిరి, గ్రామపాలకజాలమ్మునట్లు, చప్పటులకు భయ మందు దేవసైనికులను దనయక్షిసహస్రమున నిరీక్షించుచు, మహేంద్రుఁడు తనలో నిట్లాలోచన మొనర్చెను.

ఆహా! యేమి యీ దుర్వాసుని బ్రాహ్మణత్వము! నిగమాగమముల ప్రామాణ్య మెంతగొప్పది! ఓహో! శివభక్తులమాహాత్మ్య మెంత గొప్పది! దుశ్శకునమ్ములయథార్థత యెంతటిది! కర్మబల మెంత యలంఘ్యము! దేవతలయందు లక్ష్మీచాంచల్య మెంతటిది! పురుషకార మెంతదుర్బలమైనది! పరమేష్ఠికౌశల మెట్టిది! ఈసంగ్రామ మెంతటిది! ఈరాత్రించరు లెంతవారు! ఎం తెంతవారు కాందిశీకు లగుచున్నారు! ఎంతలేసియల్పులు పరాక్రమించుచున్నారు! ఈ బందుగుల వలన నేమిఫలము! ఈమహామంత్రు లెందులకు! ఈబలములు, ధనాదు లెందులకు! ఈ వజ్రాయుధ మేల! తుదకు నేనుమాత్ర మెందులకు! ఈ భార్యలను రక్షించుకొను టెట్లు? ఈ పౌరులఁ గాపాడుకొను టేరీతి? ఈ నిస్సారజీవితమువలన నేమిప్రయోజనము? దైవవైపరీత్య మింకను నేమిచేయఁగలదో; ఈస్వర్గాధిపత్యమును నేను నిర్వహింపఁజాల. ఈ క్రవ్యాదుల యౌద్ధత్యమును నే నడ్డుకొన నొల్ల. ఈ నైచ్య మెవ్వారి కంటను బడకుండ నీరణముననే నాతనువుం జాలించెదను. అని పురుహూతుం డనుకొనుచుండ నొక యశరీరవాణి యాతని వీనులం బడెను.

నీమది నీ వ్యామోహం
బే మిది ? వేటొక్కరీతి యేర్పడనుండన్
నామాట వినుచు నీరణ
భూమిన్ విడనాడి వెడలిపొమ్ము సురేంద్రా !

తనమూఢబుద్ధికతనన్
దనకినయాకాశభాషితమ్ములకతనన్
మనమున డోలాయితుఁడై
పౌసరం గురుఁ డంత వచ్చి బోధించె నిటుల్.

వ. ఇంద్రా! బుద్ధిమంతుఁడవైనను నీదుర్వ్యవసాయమునుగూర్చి విచారించుచుంటిని. నీ వెఱుంగనిది లేదు. నీకు గురుబోధలు లోటా ? కాఁబోవున దెఱుంగవా? జయలక్ష్మిచాంచల్య మనవగతవిషయమా ? మాలిసుమాలియుద్ధ మతిఘోరముగ జరుగునపుడు గరుత్మంతుఁడు నిలువంజాలక వెనుదీయఁగా భగవానుఁడుగూడ మరలినట్లు నీవు పురాణములందు వినలేదా ? అంధకాసురుఁ డీముల్లోకముల నాక్రమింపలేదా ? తారకాసురుఁ డీబ్రహ్మాండమండలంబును జయింపలేదా ? అమ్మహాముని శాపాంతవచనరచనలను స్మరింపుము. ఒక్కొకవేళమహేశ్వరుని వచనములు వమ్ములగునేమోగాని మాహేశ్వరులమాట లెన్నఁడేని పొల్లుపోయెనే? గోవిందుఁడే కుశలములను జేయఁగలఁ డని వెనుక మహర్షి యనినదానినే ముందు వేఱొక్కరీతి యేర్పడ నున్న దని విరించి యాకాశవాక్కున ననువదించినాఁడు. కాన రమ్ము, కొంతకాల మజ్ఞాతవాస మొనర్పవలెను. అని శిష్యుని శాసించి తనయోగమాయాబలమ్మున నాతని నంతర్హితుంజేసి గురుండు మాయమయ్యె.

పరుఁగుడు దాఁటి నగ్ని వసివాడి తొలంగ రయముండు మూర్ఛితెన్
హారియు రథమ్ములతోడుత మహాహవభూమి నదృశ్యుఁ డయ్యె నీ
తరుణమునన్ మహాప్రళయదారుణ సప్తసముద్రఘోష నా
అరులమహాట్టహాసరవ మగ్గలమై దివిఁ బర్వె నెంతయున్.

పరుఁగిడువారలం జకితభావుల మూర్ఛితులన్ క్షతాంగులై
మొరఁగెడివారలం, దరుమ నొల్లనిసద్రథికాళి కేకలున్
బరుల జయించు, వీడు, పరిపాలనసేయుము, నిగ్రహింపుమీ
హరణ మొనర్పు, మన్రవము లాసురసైన్యమునం గడల్కొనెన్.

తురగములన్ గజమ్ములను దోలుచు నడ్డుచు రత్నభూషలన్
దర మిడి దోఁచుకొంచును బదంపడి యాయుధముల్ హరించుచున్
ఎరగొని ముక్తకేశుల దిగీశులఁ గొట్టుచు ధిక్కరించుచున్
దరిఁబడి పిల్చుచున్ నగిరి దానవు లెల్లెడ నిర్విశంకతన్.

రణరంగంబునఁ గూలి యున్నపతిపుత్త్రవ్రాతదేహంబులన్
గని శోకించెడియంగనల్, విమతవిశ్రాంతిన్ బడల్వడ్డయా
పణముల్, యుద్ధయథార్థగాథ లెఱుఁగన్ బర్వెత్తుపౌరాళి, గా
ననిలోల్లోలితసింధువై త్రిదివ మష్టావిగ్నమయ్యెం గడున్.

వ. అంతలో దుర్వాసునికోపానలవిస్ఫులింగములు మూర్తి
వంతములై వచ్చుచున్నటులు బలి మొదలైనపుణ్యజనులు మహాశౌర
త్వమునఁ బరిక్రమించుచు, ముందే తిరోధాన మందినయింద్రునిగూర్చి
కాందిశీకత గాంచె ననియు, మరణించె ననియు, నమరావతికిం బోయె

ననియు సత్య మెఱుంగక యప్పటికిఁ దోఁచినది పలుకువారై "కానిమ్ము మన మమరావతిని హాయిగఁ బ్రవేశించి యాక్రమింతము. కోశాగారములఁ గొల్లగొట్టుదము. దేవసభ నధిష్ఠింతము. త్రిలోకము నాక్రమింతము" అని యనుకొని కల్పవృక్షము లీబలివి. కామధేను వీబాణునిది. గజబల మీనముచిది. అశ్వబలము శంబరునిది. విరోచనున కీవిలాసినీగణము. వరుణస్థాన మీతనికి. వాయుస్థాన మాతనికి. కుబేరపద మితనిది. అగ్నిస్థాన మాతనిది. ఎవరుప్రవేశించినచోటు వారిదే. దొంగిలి సంపాదించినవస్తువాహనము లాదొంగవే. కొట్టి తెచ్చికొన్నవస్తువు కొట్టినవానిదే. కన్నవానదే కనినవస్తువు. ఉపాయము సూచించినవానికందు సగము. చెప్పినటులు చేయువానికి దానిలో సగము. ఇరువురు నొకేసారిగఁ జేకొన్నవస్తువు వా రిరువురదే. అని యొకరితో నొకరు కూడఁబలుకుకొని శపథపూర్వకముగ సేనలను నెలకొల్పి మదగజముల నెక్కి నగరసీమలను బరిశీలించుచుఁ, బ్రాకారదుర్గంబులఁ గొనియాడుచు, శత్రువుల తేలికబుద్ధులను బరిహసించుచుఁ, గర్మదేవతలను బిట్టు మట్టుచు, దుర్గసేనాసమూహములందు నిర్భీకులై రమణీమణుల స్వభార్యలవలె నాకర్షించి పురుషులనువలెఁ బ్రహరించుచు, శత్రురోదనములను గర్ణరసాయనముగ వినుచు, దిక్కులేనిదేవతలనుఁ గాంచి నవ్వుచు, దయామయులఁ గోపించుచుఁ గఠినాత్ముల మెచ్చుచుఁ, దమ జాతివారిని విడుచుచు, నట్టహాస మొనర్చి కర్మదేవతలఁ బరువు లెత్తించుచు, గోపురద్వారములఁ బెకలించుచుఁ, బ్రాకారముల దాఁటుచు, శరణాగతులను జూడక దేవర్షిగణములప్రార్థనములను వినక, దేవవైతాళికుల నాలుకలు గోయించుచు, చారులపాదములను నఱకించుచు, దేవదైవజ్ఞుల లెంపలు గొట్టుచు, నక్షత్రములువ్రాయువారివ్రేళ్ళను నఱ

కుచు, దేవమంత్రిలముఖవిదారణం బొనర్చుచు, దేవతావిగ్రహములం
బగులనేయుచు, బొమ్మలలో వ్రాసిన దేవపరాక్రమంబులఁ దుడుచుచు,
హతులైనవారి రక్తధారలతోఁ దడుపఁబడి, కూలిన దేవమునులదేహముల
యీడ్పులతోఁ దుడువఁబడి, దగ్ధ మగుమహాభవనములధూమములతో
ధూపితమై, భంగపడిన వనితామణులముఖతాడనములనెడివాద్యములు
గలిగి, తమసర్వస్వముం గోల్పోయినదీనులయాక్రోశము లనెడి
యాశీస్సులతో ముఖరిత మై, యొక్కమ్మడి ప్రేల్చఁబడినయశనిఘో
షము లనెడిమంగళవాద్యములతోడను, నుల్కాపాతము లనెడిదీపమా
లికలతోడను, నలంకరింపఁబడిననాకంబు నాక్రమించి తమపురో
హితునికి నమస్కరించి సింహాము లేని మేరుగుహవలె నున్నసుధర్మయం
దాసీనులైరి.

అట్లమరసభలోఁ గలసి యొకరి నొకరు గాఁగిలించికొని
వందిమాగధులు కొనియాడుచుండ భార్గవుఁ డనుగ్రహించుచుండఁ
గొంతసే పుండి వెలుపలికి వచ్చి తత్క్షణలబ్ధ మగువిజయలక్ష్మీపరిష్వం
గంబువలన నంటినకుంకుమవలె సేనాధూళిచేఁ గప్పఁబడి, నిర్భయముగాఁ
జొచ్చుకొనివచ్చురక్కసులబాధలచే రేఁగినహాహాకారములు గలనగర
మును గాంచి సముద్రకల్లోలహల్లోహలరవమును దీరభూమి యణఁచు
నట్లు 'ఆగుఁడు' అనునొక్కమాట చే నగరమును బ్రశాంతపఱచి, కౌణ
పులు తమస్వర్గనగరాక్రమణము పూర్తి యైనట్లు జయభేరి మ్రోయిం
చిరి. పిదప దిక్పాలస్థానములందు నియుక్తు లగునసురులు దమగురుం డగు
శుక్రునిధర్మపద్ధతి ననుసరించి, బలిశాసనముం ద్రోసిపుచ్చక, హిరణ్యా
క్షుఁడు సూచించినదారితప్పక, వైదికాచారములను దుడిచివేయుచు, నప్ర
మత్తులై తమతమయధికారంబులను దిగ్విజయముగా సాఁగించుచుండిరి.

నరకకూపనిమగ్నదానవులఁ దెచ్చి
దైవతపద్మములన్ వారి దయను నిల్పి
యలమి రక్షోఘ్నమంత్రికుశలుల మునుల
నిరయములఁ ద్రోతు రానిశాచరులు బలిమి.

అచట బలిసభఁ జేరి బ్రిహ్మర్షులెల్ల
ధాతృమఖవాది పదమంత్రితలములందు
నూహమున దానవపద్మము లుంచి పలుక
నసురరాట్పురోధసులు సంతసము గనిరి.

పండితు లాదిగంబరులు, బౌద్ధులు సభ్యజనాళి, యల్లపా
షండులు వేదశాస్త్రిసువిచారులు, నాస్తికు లొజ్జలై దివిన్
నిండి బలీంద్రిపాలనము నిర్భరభీతిని సాఁగుచుండ ను
ద్దండత ముజ్జగాలఁ గలిధర్మము సుస్థిరమై ప్రివర్తిలెన్.

వ. బిడౌజుఁ డారీతిఁ దిరోహితుఁడై దేవతలతోఁ గూడి బృహ
స్పతి చెప్పినచొప్పునఁ ద్రిభువనసుందర మైనమందరముం జేరి పరుల
కంటఁ బడకుండఁ గొన్నివత్సరంబు లటఁ గడపెను.

ఇది:—శ్రీమ దాత్రేయసగోత్ర, దుప్పూరి గృహనామకపవిత్రి,
పెదశేషయార్యశేషమాంబాద్వితీయపుత్త్రి,
మహాగాయత్రీశరణ్యా, గురువేంకటరమణకారుణ్యా,
సూర్యనారాయణశాస్త్రిప్రిణీతం బైన
ఆంధ్రినీలకంఠవిజయ చంపూమహాకావ్యంబున
ప్రిథమాశ్వాసము, సంపూర్ణము.

# నీలకంఠవిజయము

## ద్వితీయాశ్వాసము.



ఇంద్రుఁడు మున్నుగా దివిజులెల్లరు శత్రుగతస్వరాజ్యమున్
పొందఁ జిరత్నరత్నపరిపూరితకందరసుందరమ్ము, త
న్మందర మందియందు నసమానతపంబు తపించుచుండి ని
ష్పందత వేయియేండ్లు నిముసంబుగ నెట్టిరి శాపబద్ధులై.

వ. అందు నివసించుతపోధను లందిచ్చునట్టి యజ్ఞభాగంబులను దూతల నంపి, యాతుధాను లపహరించుచుండ నకాలమందుఁ గాని, యజ్ఞము లొనర్పక కాని, రహస్యముగాఁ గాని, హవ్యము లిండని కోరి నను శాస్త్రీకశరణ్యు లగుమును లందుల కంగీకరింపరైరి. తత్కారణమున క్షుధార్తులై తామే యగ్నిముఖములం దుంచినహవ్యములను మరల నాతఁ డొసంగ భుజించుచుఁ, జిరకాలము గడపిరి. మఱికొందఱు కర్మఠు లగుమూర్ఖుల సమీపించి మీకును మీయాప్తులకును సశరీరస్వర్గస్థితి నొసంగెదము. సురసుందరుల నిచటికే రప్పించెదము. అని లోభ పెట్టుచుఁ బశువులను, బక్షులను, సురను, బాయసమును, నపూపములను గానుకలుగా నందుచుండిరి.

మఱియు క్షీణపుణ్యులై స్వర్గమునుండి వచ్చినకర్మదేవతలను గొందఱు దేవతలు చుట్టి దానవు లేమిచేయుచున్నారు? మమ్ములను గూర్చి యేమనుకొనుచున్నారు? పితామహుండు మావృత్తాంత మంగీకరించెనా? లేక యతనివఱకీవిషయము పోనేలేదా? రాక్షసద్వై

లేమనుచున్నారు? శుక్రుని వ్యవహార మెట్లున్నది? మా యింద్రునిసౌధ మెట్లున్నది? నందనవన మెవరియధీనమునం దున్నది? ఐరావతము నిర్మూద మైన దని వింటిమి. ఉచ్చైశ్శ్రవం బుండెనా? యూడెనా? అని యడుగుచు బెదరుచూపుల నలువైపులంగాంచుచు, మరణించి బ్రహ్మలోకమున కేఁగు మహర్షులను బరివేష్టించి వరదానములవలన వారిప్రాణప్రయాణక్లేశమును మాన్పించుచుఁ, బరమేష్టికిఁ దాము మాకష్టదశలు విన్నవింపుఁడు. మీ తత్త్వవిచారప్రసంగములసందడిని మమ్ము మరువవలదని మనవిచేయుఁడు. అని బోధించుచుఁ, దాము నిద్రలేనివారగుట, నిద్రలుండి కలలు కనెడి తపోధనులను మునిశాపపర్యవసానముంగూర్చి యడుగుచుఁ దమతమ జన్మంబులను నిందించుకొనుచు, వేడినిట్టూర్పుల నిగుడించుచుఁ, జాతక పక్షులు మేఘునిగాంచునటులు తమగురువు రాకలకై యెదురుతెన్నులు గాంచుండిరి.

అంతలోన బృహస్పతి యాసుపర్వ
దురిత మేఘ్రావశిష్టమై తోఁపఁ బ్రణిధిఁ
జేరి నిర్జరులెల్లఁ బూజింప సత్స
భాంతరమ్మున వారి కిట్లనుచుఁ బలికె.

వ. దైవయోగంబున గుశలముగ నున్న మిమ్ముఁ గాంచితి. ఈ యాపత్సముద్రమును దైవవశమున దాఁటినట్లే. అదృష్టవశమున దుర్లభ మగు సీతపోవనము నందఁగలిగితిరి. భరతవర్షమందుఁ గాశికవలె నిలా వృతవర్షమందు శంకరుని కీమందరాద్రియే ముఖ్యస్థానము. పాతాలంబు మొదలాకాశంబువఱకు వందల మించి పరమేశ్వరస్థానంబు లున్నవని

శాస్త్రప్రసిద్ధి. కాని యీచంద్రశేఖరునకు సుందర మంతటి సుందర స్థానము వేఱొకటి కానరాదు. ఇతరస్థలములం బంచతపస్సుం జైన మహార్షికంటెను శాంభవక్షేత్రములందు స్వేచ్ఛాచారి విశిష్టుండగు చున్నాఁడు. ఈవిషయము వృద్ధులవలన మీరును వినియుందురు. ఈ గిరి మాకుంబోలె మీకును నమృతప్రాప్తి హేతువు. పెక్కు మాటలేల?

అసుభహేతుకాలం బది యస్తమించె
నిపుడు శుభకాల మిది యని యెంతు నేను
లెండు కదలుండు పరమేష్టిదండ కిప్పు
డిట్టియుష్ట్రాసికల ఫలం బేమి మనకు?

వ. భావికాలమున మహాప్రయత్నప్రాప్య మైనను వెంటనే స్వతఃప్రాప్తం బైనసుధవంటి యీ గురువచనమున వృద్ధశ్రవుండు పరితృప్తి నందియిట్లనెను. గురుదేవా! మీ రాకచే నీ తపోవనంబు పావనం బయ్యె. మాతపస్సులు ఫలించినవి. మా కలుషము లడంగినవి. శుభములు చేకూరినట్లే. కనుక నే మీశాసనాక్షరమ్ములకుం బాత్రుల మైతిమి.

అస్తమితప్రపంచమలినావలి నై, పరవేదమౌళి వి
న్యస్తము నైనవస్తువునయందు రమించెడిమీమనమ్ము వి
త్రస్తులమై యబోధపరితప్తులమై పసు లైన మాపయిన్
నిస్తులకీర్తి నొక్కపరి నిల్చుట ధన్యుల మైతి మోప్రభూ।

వ. విశేషించి వచించున దేమి? నేఁడు మీ దయావిశేషంబునఁ గల్గిన యానందమునకు మితి లేమిం జేసి మా యానందముకన్న మీయా

నందము నూఱురె ట్లని వచించిన వేదమునుంగూడ మేము నమ్మవలసిన పనిలేదు. పుట్టినదిమొదలుగాఁ బరిపాలకులు శత్రువులను జయించుచునే యున్నారు. అరివర్గముచే జయింపఁబడుచును నున్నారు. ఈచక్రనేమి క్రమము సార్వజనీనమే. ఐనను మీవారు విరోధులం జయించుటయే గాని జయింపఁబడుట లేదు. ఈకారణముననే మేము మిగుల సిగ్గుపడు చున్నాము.

సంకల్పమాత్రముననే కార్యమును సాధింపఁ గలతమరు మమ్ముఁ గనికరించుటొక యల్పకృత్యము. ఎట్లన మీవంటి మునులే భూచరులను నాకముం జేర్చుటకును,నాకస్థుల ధరాభాగంబునకు దింపుటకును, గంగను ద్రావుటకును, సప్తసముద్రములం బీల్చుటకును, మహాస్త్రములనేని వమ్ముసేయుటకును,ముజ్జగంబుల స్తంభింపఁజేయుటకును,సమర్థులగుచున్నారు. అట్లే వేదశతముచే నంగీకృతమై సత్యతమంబైన మీమాహాత్మ్యము విరాజిల్లుచుండ మారక్షణము దండాపూపికా న్యాయము. పెక్కుమాట లేల? భక్తుల శ్రమలం గాంచలేనివాఁడవేని మమ్ముఁ గనికరింపుము. మీజాత్యభిమానముచే దుర్వాసు శాపమునే నెగ్గింపఁదలంచినచో నిన్ను వెన్నాడెద మెచటికేని కొంపోమ్ము. ఎవరిచే మ మ్ముద్ధరింపఁదలఁచితివో వారే మ మ్ముద్ధరింతురు. మా తనువులను భవచ్చరణంబుల కర్పించుకొంటిమి. హస్తపాదముల విషయమున వానివాని యభిమతమే మనుజజ్ఞాన మెన్నఁ డేని గలుగునా? మా దృశ కింకరవర్గము నట్లుగనే భావించి నడపుకొనవలెను. అని కృతనిశ్చయుండైన శతక్రతునిపలుకులకుఁ జిత్రింపదువాచస్పతి యిందాదులతో గూడి బ్రహ్మలోకమునకుఁ బ్రయాణమయ్యెను.

దేవతలును దదనుయాయులై విమానమార్గముగా దైత్య
దానవయాతుధాను లాక్రమించిన సిద్ధచారణవిద్యాధర భవనమ్ముల
కడచి,యచటి కనతిదూరమున గంధర్వకిన్నరగానములు లేక, కర్మదేవ
తలసమ్మర్ద ముడిగి, బ్రహ్మర్షి సంచారశూన్యమై నీచాతినీచము లగుపిశా
చము లుమిసినమద్యవసాదులవలన దూషితమై యున్న గంగాతీరవృక్ష
షండమ్ములో రహస్యముగ నున్న దేవర్షిగణములతో హృదయమును
వేధించు స్వర్గసీమలం గాంచుచు,మున్ను రాయంచ లలంకరించిన విమా
నములపై నచ్చరలనృత్తగీతాదులతో సంచరించుట, నాయా ప్రదేశ
ముల యందచందము లెఱుంగక, దూరభారములు తెలియక, నేఁడు
కాలినడలఁ బోవుచుండుటఁ దత్తద్విశేషంబులం బరికించుచు, మర్త్య
మార్గమున నడుగడుగున నాయాసపడుచు, గూఢసంచారవశమున
బాటసారులవలె నాయాస్థలంబుల నాతిథ్యం బందఁజాలక,రాత్రించరులు
తిరుగులాడు కొన్నిరహస్యస్వర్గమార్గంబులను బహుక్లేశంబున నతిక్ర
మించి, మహాతపస్సులవలననేని యలభ్యం బైనతపోలోకంబు నందిరి.
వారట్లు ప్రవేశించినంతనే రజస్తమోగుణరహితములై సాత్త్వికపరిణామ
మందిన యచటివస్తువులందు, మహేంద్రభోగంబులందు మానవులవలె
నిదివఱకుఁ గానని వింతలు వీక్షించుచు నబ్బురపడిరి.

మఱియు నాత్మజ్ఞానమువలన నావరణలు తొలంగి, నిరంత
రము వెలింగెడియకృత్రిమజ్యోతులతో నధికారమాలిన్యనాశనమునకు
సాటి లేనియోగైశ్వర్య మనుభవించు సనకసనందనసనత్కుమారాది
యోగులదృష్టులు:—

వక్తలకు మూఁగవారియందువలెను, ధీమంతులకు మూర్ఖు
యందుఁబోలె, దృష్టిబల మున్నవారి కంధజనులందుఁబోల్కి, మహే

శ్వరులకు నిర్ధనులయందువలెను, కాములకుఁ బుర్వులయందుఁ,జతుష్పా జ్జంతువులకుఁ బాములయందు, మానవులకుఁ బశువులయందు, రాజులకు మానవులందు, దేవతలకు తేఁడులందు,నింద్రునికి దేవతలందువలె నింద్రు నంతటివానియందు సావజ్ఞముగఁ బ్రసరించుట గాంచిరి.

అయ్యో! నూ అశ్వమేధంబు లొనర్చి శూలపాణిం దృప్తి పఱచి దానవులకు భోగ్యంబగుస్వర్గమును గోరినకృపణుం డగుమఘవుం డితఁడేనా? సంసారపాశవిమోచకం బగుపాశుపతవ్రతంబునఁ బరమే శ్వరు సేవించి యనన్యలభ్య మగుపరమేశ్వరసఖ్య మందినను బిశాచము కరణి ధనపాలతను గోరినకుబేరుం డితఁడేనా? వీక్షింపుఁడు. తనయిష్ట మూర్తు లం దొక్కం డగునీయగ్ని వివేకము పోఁగొట్టుకొని చిరతరము మృత్యుంజయు నుపాసించి హవ్యవాహతను బొంది దేవతలకు నేనే యన్నమును దెచ్చువాఁడ నని తన్నుఁ గృతకృత్యునిగఁ దలంచుకొను చున్నాఁడు. ఆహా! ఎంతకాలమున కీదేవపశువుల వీక్షింపగలిగితిమి?

ఎందఱు జితేంద్రియులు గల
రెందఱు శివభక్తులుండి రిందఱు ఫలలి
ప్సం దనరి కామవశతం
గుందుచు మోక్షంబు లేక గూలుట లేదే!

వ. అనునట్టిపరిహాసవచనములను వారిముఖములనుండి వినుచు, నైశ్వర్యములందుఁ దరతమభావములం గాంచుచు, స్వర్గాధిరాజగర్వ మును విడుచుచు, సిగ్గును దిగఁద్రావి, మనయాధిపత్యములకన్న నిష్ప డిచోట్చట బిచ్చమెత్తుకొనుట మంచిదని యెంచిరి.

శిష్యసంఘంబుతోడ వేంచేసియున్న
గురుని బ్రహ్మకుమారుండు గురుతుపట్టి
పరమసుజ్ఞానులు మహాప్రభావులైన
ఛాత్త్రులను నిల్పె వారల సత్కరింప.

వ. సనత్కుమారుని శిష్యులు వెడలుచుఁ బరస్పరాలాపంబులందు అంగిరసుని యథర్వశిఖోపనిషత్ప్రవర్తకత్వమునుగూర్చియు, ఆంగిరస యోగరహస్యప్రచారకత్వముంగూర్చియు, నాతని ఋగ్యజుష ప్రసిద్ధ ప్రభావముంగూర్చియుఁ దలపోయుచు, నవధూతయు నతని జ్యేష్ఠపుత్త్రుఁడు నగుసంవర్త శివాచార్యుని బ్రశంసించుచు, మరుత్తుఁ డనురాజునకుయాజ కత్వము వహించుట, కాశీనివాసవ్రత మాచరించుట మున్నగు నాతని కృత్యంబులం గొనియాడుచుఁ, దదనుజుం డగుబృహస్పతియొక్క సర్వ తంత్రప్రవచన మండలిశక్తిని, నాతని ప్రబంధనిర్మాణపద్ధతిని, బ్రతిభా వ్యవహారకౌశలము నుద్ఘాటించుచు, వేదవిరుద్ధము లగులోకాయతికాది తంత్రముల ప్రణేతృత్వమువలనిన్యూనతను నాస్తికతంత్రప్రవర్తకుఁ డగుపరమేశ్వరుని దృష్టాంతీకరించి తొలగించుచు, యథావిధిగ బృహ స్పతినిం గలసి గురుభావముతో వినయవినమ్రులై శిష్యయుతుఁడైన యతని సనత్కుమారునికడకుఁ దీసికొనివచ్చిరి.

గురుఁడును సనత్కుమారుఁడున్ గూడినపుడు
చెలఁగువివిధార్హణములు వీక్షించి తమిని
దేవగురువాదచాతురిం దెలిసికొనుచు
నతనికి విశేషముగ నమ్రులైరి సురలు.

వ. బ్రహ్మతుల్యుం డైనసనత్కుమారుని బృహస్పతి భక్తి ప్రపత్తులొలుక నమస్కరించి దేవకార్యమును గూర్చియుఁ, బురుహూతునింగూర్చియు, నాతనికి నివేదించి యాతని గాఢోపగూహనంబులు వడసి విరించి యొద్ద కేఁగి నిర్వర్తింపవలసిన యద్దాని గ్రహించి, సెలవు పుచ్చుకొని కనుచూపుమేర మీఁఱువఱకు సిరసునందంజలిఘటించి యుంచి, మహాయోగ మనుసంధానించి ప్రణవోచ్చారణం బొనర్చుచు సావధానుండై దేవతలం గూడి బ్రహ్మలోకమును బొందెను. పోవుచు

వాణీసద్వదనారవింద గళితబ్రహ్మాద్యవిద్యాశతా
నూనగ్రంథి విభేదజాతకుతుక ప్రోక్తర్షి హర్షస్తుతుల్
వీనుల్ సోఁకఁగ, సన్నివృత్త నిఖిలక్లేశాత్ములై దిక్పతుల్
పూనంబోవ రబాధకం బయిన, స్వర్లోకంబు చేరన్ మదిన్.

[సంధానించుచు వాక్సతీముఖగలత్సంవేద్యవిద్యాశత
గ్రంథగ్రంథి విభేదజాతకుతుక బ్రహ్మర్షి సంప్రార్థనల్;
బంధంబుల్ దెగఁ క్లేశముల్ మఱచి యుల్లాసంబునన్ స్వర్గసం
బంధం బొల్ల రబాధకం బయిన, దిక్పాలాది బృందారకుల్]

వ. పిమ్మటవారు:—రజస్తమోగుణములను జయించినవాఁడగుట నిర్మల మగుసాత్వికప్రకాశరాశి వలెను, నిష్కలంకము లగుబాలచంద్రబింబము లనెడియిటికలచేఁ గట్టంబడినటులును, నిరంతరముగ మండుబడబాగ్ని జ్వాలలు చుట్టుకొనుటవలన ఘనీభవించిన క్షీరసముద్రతరంగములవలన నిర్మింపఁబడినట్టులును, చిరకాలమునుండి సంతతధారగఁ బడుచు తారూపుదాల్చిన శరత్కాలచంద్రికలతో నిండిననీహారముచే

సృజింపఁబడినట్లులును, త్రివిక్రముని పాదాక్రాంతిచేఁ బగిలిన బ్రహ్మాండ
కపాలమునుండి తెలిపిలేక జాఱునలకనందాప్రవాహముచేఁ బ్రక్షా
ళిత మైనట్లును, స్వచ్ఛ మైనకాంతిచే నొప్పారుగగనమువలెను, నిష్క
లంక మగుటచేఁబోలె ధూమాదిమార్గసంచారమువలనఁ బంకిల మైన
పాదములు గలపామరులకు సమీపింపరాక, సకలజగత్సృష్టి యైన
పిమ్మట నవశిష్టము లైనసారములో యన నొప్పువిజాతీయములగుశబ్దాది
విషయములతోడను, నభ్యుదయైకప్రయోజనము లైనయుపాసనము
లనెడిగోపురములతోడను, నాత్మోపాసనారూప మగుకక్ష్యలతోడను,
బ్రణవరూప మైనయాస్థానమండపముతోడను బ్రకాశించుచుఁ, దమ
తమకార్యవిశేషములను నివేదింప వేఁచియున్నతత్తల్లోకాధిపతుల
సంఘములతో నిండినబహిర్ద్వారవితర్దికలు గలిగి, యాగంతుకు లై వచ్చి
నృత్తగీతాదులను బ్రదర్శించు గంధర్వకిన్నరాప్సరోగణములతో నిండిన
ప్రథమకక్ష్యయు:—

నిష్కామకర్మయోగమువలన బరిశుద్ధు లగుపరివ్రాజకులతో
విరాజిల్లు ద్వితీయకక్ష్యయు, మిగుల గహనము లగున్యాయసాంఖ్య
యోగాదిదర్శనములరత్యమును గ్రహింపఁ గ్లేశమందు కణాదకపిలపతం
జలిప్రముఖవిద్వద్గేసరుల ప్రసంగసంగతులతోఁ గలకలలాడుతృతీ
యకక్ష్యయు, విచిత్రతరము లై యుపనిషత్ప్రోక్తంబు లగు నుపాసన
భేదవాసనలు గలమునులసంఘములతోఁ గూడిననాల్గవకక్ష్యయు, న
రహస్యము లైనవై శ్వానరదహరాది విద్యలయం దారితేఱి యుపాసన
క్రమముల సూచించు మహర్షులతో నిండిన పంచమకక్ష్యయు, వేదప్రో
క్తంబు లగు విషయంబులందు నిరీహు లగుపరమహంసలతోఁ గిక్కి
సినయాఱవకక్ష్యయుఁ, దమపాండితీప్రకర్షమువలన వేదభావపర్యాలో

నం బొనర్చి విపరీతార్థాన్వయ కళంకములం దొలఁగించు నిరంకుశులతో నిబిడ మైనసప్తమకత్యయుఁ, గలిగి నిర్వికల్పసమాధినిష్ఠు లగుభృగ్వంగిరోవసిష్ఠాదిమునులతో మండిత మైనయాస్థానమండపము గలిగి:—

ఆపదల కనాస్పదమై, వాక్ప్రపంచమున కగోచరమై, నీచులకు భావింపరానిదై. యాచారమంత్రశతంబుల కగమ్యమై, యజ్ఞముల కసాధ్యమై, మహాతపస్సులచే దురాపమై, దానధర్మముల కందరానిదై, యూహాతీత మగుస్వాయంభువునిభవనంబును దగ్గఱఁగఁ గాంచి రచ్చట:-

తొలిపలుకుల్ పఠించుకొనుతొందరలో విధి చూడకుండుటన్
తొలఁగిన భోగలాలసతతో నట సభ్యులు దవ్వ నెట్టుటన్
కళలవిశిష్టకౌశల మఖండసుఖస్థలియందె రిత్తగా
నలఘుమనోవ్యథం బడెద రాడెడిపాడెడి నాకసుందరుల్.

ద్వారసాల విహారవితర్దికలకు
మూలముల నున్న యాహారినీలమణులు
రాజిలె, యుగాంతధూమ సంక్రాంతికలన
నమరుసాంద్ర మషీవిలేపములపగిది.

వ. అట్టిభవనముం బ్రవేశించి "అయ్యా, యీయుదయమున వచ్చినపురుహూతాభిధానుం డగునింద్రనకీపురందరుఁ డెన్నవవాఁడు" అని దౌవారికుఁ లడుగఁగా దేవతలు మిగులఁ బ్రసాపనన్నము లైరి. చేర వలసినస్థానమును జేరి సుఖించుచున్న బ్రహ్మలోకవాసు లగు మహర్షులు లోలోనికివచ్చుదివిజులను వారి దీనదశలను గాంచి, మన మొక

ప్పటి దేవతల సాలోక్యసామీప్యసారూప్యసిద్ధిఁ బ్రాకులాడి, చిర తరము పెక్కుతపస్సులు వ్యర్థముగ నొనర్చితిమిగదా యని తమ్ముఁ దాము నిందించికొనుచుండ, నప్పలుకులు విని వారు మఱింత సిగ్గుపడిరి.

పిదప భగవంతుఁ డగునాంగిరసు నముగడుగునను నారదాది మునులు పరిరంభణం బొనరించుచుండఁ, బతంజలిప్రముఖపండితులు ప్రత్యుత్థానంబు గావించుచుండ. సిద్ధవిద్యాధరులు చేమోడ్పు లొనర్చు చుండఁ, జటురాననుని యిష్టభృత్యులు గౌరవపురస్సరంబుగఁ దీసికొని పోవుచుండ, నబ్బురపాటు నెందుచు దేవతలాతనిం జుట్టుకొనిరి.

అప్పు డన్యోన్యసంశ్లేషవిశ్లేషములచే నానావిధము లై ప్రకృతిగుణము లగు సత్త్వరజస్తమోగుణంబులవలెనున్న వివిధమణులచే బ్రకాశించుచు, నుపరిభాగమునఁ బరువఁబడినహంసతూలికాతల్పమును, నం దమర్పఁబడిన మహార్హోపధానంబులుఁగలిగి, హింసాఘాతుకతలు లేక విన్నపూసలవంటివై శమదమాదులతో నిండిన మహాయోగుల యంతః కరణమువలె నుండి తాళవృంతములు, వింజామరలు, తాంబూలకరండ ములుఁగలాచికలుమున్నగు నుపచారపరికరములతో సేవలొనర్చు పరి జనుల వామహస్తములు పెనఁగియుండుటవలన వికసించిన యష్టదళా త్మకపద్మాసనతను సూచించుచు, ముప్పరుసలు దిరిగి యున్నతముగ నుండుటచే ధర్మార్థకామము లనెడిత్రివర్గము నతిక్రమించునట్లును శోభిల్లు మంగళకర మగుభద్రాసనము నధిష్ఠించియున్నవాఁడును;

ఒక్కసారిగ నుదయించిన సహస్రార్కులకాంతితో వెలు గుచు, సూర్యుఁడు చంద్రుఁడు మెఱుపు నగ్ని యను నాల్గుతేజస్సు నాపుటకుఁబోలె నాలుగువైపులకుఁ బ్రసరించు తేజఃపుంజములచే దే తల దివ్యదృష్టినిసైతము మిఱుమిట్లు గొలుపుచున్నవాఁడును;

చతుర్వేదాక్షరముల నిరంతరోచ్చారణమందు బయల్పడు దంతచంద్రికా విలాసంబులచే సంసారాంధకారంబును నశింపఁ జేయుచుండి, యపాంగములనుండి జాఱుచున్న యపారకరుణాతరంగములచే నుపాసనావిషయరాజ్యమున మహాయోగులను బట్టాభిషేక మొనర్చుచున్నట్లుండి, భార్యలైననాలుగు వేదములకు నాలుగంతిపురములైన స్వీయముఖపంకజములచే నలుకెలంకులవారి ననుగ్రహించువాఁడును;

ఈశ్వరశిరోదర్శనార్థము తాను రాజహంసమైనపుడు గడించికొనిన సరోజకాండవలయమువలెనుండి సుకుమారమై శ్వేతతంతురూపమైనయజ్ఞోపవీతముచేఁ దన సూత్రాత్మకతను సూచించుచున్నట్లున్నవాఁడును;

శస్త్రాస్త్రవిద్యాపారంగతు లగుక్షత్త్రియుల నిర్మించుటవలనఁ దృప్తి చెందెనో యనునటులు శస్త్రగ్రహణమున విముఖమై, ప్రకృతి మొదలుగాఁ పృథివ్యంత మున్న పంచవింశతితత్వములను ద్రిప్పుటయే వ్యాపారమని తెలియఁ జేయుటకుంబోలె దక్షిణహస్తమున జపమాలికం ద్రిప్పుచున్నవాఁడును;

ఉషఃకాలమున ముందుగ నుదకము సృజింపనెంచియో తన కిసలయమువంటివామహస్తమున స్ఫటికకమండులువుధరించినవాఁడును;

ఉపనిషత్సిద్ధాంతముల యధ్యయనాధ్యాపనంబులు శ్రద్ధగ సాగించు సనకసనందనాదులు నడుమ నడుమ వెల్లడించు దుర్భేదశంకాతంకమ్ములం దీర్చుసమయమున జిజ్ఞాసతో సమీపించు సరస్వతిని గాంచువాఁడునై గురులకుఁగూడ గురువై తెలియఁదగినవారికిం దెలియఁదగి, పరమానందతుందిలుఁడై నను శరణాగతరక్షణవ్యసనాంచితుఁడై,

భూతసంఘమునకు సమష్టిరూపుండై సమస్తలోకములకు జనకుండై యుపాసనాఫలమ్ములకు విశ్రామస్థలమై, వాగ్విభూతుల కందనివాండై దురాశయులకు దూరుండై, యాత్మవేత్తల కదూరుండైనభగవంతు డగుపితామహునిం జేరి, మహాశ్చర్య మొదవించు సభాసభానాథ సందర్శనంబువలన బృహస్పతి జడతవహించి, సరస్వతినిం గాంచుటవలన మిగుల భయసంభ్రమంబు లందుచు, నోట మాట రాక క్షణకాలము తలవంచుకొని, యా దివ్యతేజస్సును గనులెత్తి కాంచ నేరక స్తబ్ధునివలెఁ గొంతతడ వుండెను.

అంతలో జగన్నాథునికృపాపూరితదృష్టి చేతను, ఓబిడ్డా! రమ్మ్మ, అను నమృతసారసుందర మగువాణీవాణిచేతను మిగులఁ దృప్తి నంది, హృదయమును జిక్కఁబట్టి యోంకారమును స్మరించుకొనుచు, ఆగమోక్తబ్రహ్మసూత్రములను వల్లెపెట్టుచు, భక్తివినమ్రుండై యమరులతోపాటు వేలకొలఁది నమస్సు లొనర్చుచు,నాపరబ్రహ్మ దివ్యాను గ్రహమ్మున మెల్లఁగ భాషింప మొదలిడెను.

అందవు తర్కవాదముల కందవు వేల్ క్రతువుల్ ఘొనర్చుచో
నందవు దానధర్మముల కందఁగరావు మహాతపస్సులన్
అందితి మట్టిశోకహరు నాద్యు నినున్, జని ధన్య మయ్యె మే
మందరమున్ గృతార్థసుకృతార్థుల మైతిమిగా పితామహా!

ఏచాతుర్యముచేఁ జతుర్విధమహాసృష్టిం బ్రవర్తించెదో
యేచాతుర్యముతోఁ జతుశ్రుతుల కీవే భాష్యముల్ గట్టెదో
యాచాతుర్యము నీభుజంబుల ముఖాలం దిప్డు దర్శింప నీ
ధీచాతుర్యముఁగూర్చి మా కెడలె సందేహంబు లోకేశ్వరా!

వ. అనంతరమున నతఁడు 'బాగురా బిడ్డా' బాగు. సామగానతత్ప రులు నిన్ను వాక్కులకుఁ బతి వగుట బృహస్పతి వని కొనియాడి రని శ్లాఘించి, యాయిందుఁడు వాఁడినట్టు లున్నవాఁడే! కారణ మే మని బ్రహ్మ ప్రశ్నింప గురుం డిట్లనియె.

అపగతవేశ్ములై విగతిహర్షులు నొచును వాఁడి వత్తులై
విపులను దిక్కు మొఱ్ఱక్కటినభిక్షుకు లట్లుచరించువారలై
యిపు డొకకష్టముం దెలుప నీడకుఁ జేరిరి వీరు, కాని నీ
సుపద మబోధవర్జితముఁ జూచినయంతఁ దలంప రావ్యధన్.

అస్తమితప్రపంచము ననన్యమునున్ సకలార్ధసాక్షియున్
శస్త్రశమైకసార మునిసత్తమభావ్యము ప్రత్యగాత్మమున్
నిస్తులరీతి భావనల నిల్పుచుఁ గుల్కెడిసీ కబోధ వి
న్యస్తవిచేష్టితార్థముల నాడఁగ సిగ్గిలు మాదుజిహ్వయున్.

వ. అయినను దా మడిగినదానికి సమాధాన మీయక తప్పదు గదా! అదిగో! కరుణామూర్తివలె మీయెదుట నధివసించి శమదమ ముల సారాంశమువలె విరాజిల్లుదుర్వాసుఁడు శమధనులలో నగ్ర స్థాన మలంకరించియున్నాఁడు. అతండే మాకుఁ గలిగినయీసర్వాపద లకు మూలకందము.

అకట! యనిమిత్తకోపోగ్రుఁడై నమాని
కడఁగి సురలోకలక్ష్మిని వెడలనడఁచె,
నామె దానవగృహముల నంటి యుండి
క్షుద్రనరదుర్దశలు మాకుఁ గూర్చెనిపుడు.

వ. నీవు కల్పించిన మాయఁజ్ఞహావిర్భాగజీవనంబు సైతము నేఁ(డ) రాక్షసులే యుపహరించిరి. బాపలుగూడ జన్నము లొనర్పరైరి. భూజనులవల నాఁకలి కింత యన్నము సంపాదించుకొను నేర్పుగూడ వీరికిఁ బూజ్యముగదా! కాఁబట్టి స్వర్గరాజ్యసాధనేచ్ఛను నీదయవల్ల(న) విడిచి దివ్యసుఖములందుఁ గుతూహలంబు మాని, నిరంతరము భుక్తి(కై) తిరుగుచు, ననిమిషు లగుటచే శ్రమవలనం గలిగినమూర్ఛానిద్రలు గూడ లేనివారై యభిమానములు చంపికొని, యీస్వర్గవాసులెల్ల రన్నార్తులై దుర్భరులై యాచనావైఫల్యభయంబున మనోవ్యాధులతోఁ గృంగి కుమిలిపోవుచు నరులతోఁ దుల్యు లగుచున్నారు. వేయేల?

దేవగణ మింతదనుకను
జీవించుట కీ వొసంగు జీవితమున నే,
యీవట్టిమాంసలతయును
నావంతయుఁ గూడు లేమి నగుశోషమె గా.

ధరణిలో బుద్ధిశాలు లీవరుస నున్న
యింద్రవైశ్వానరాదుల నెల్లఁ గాంచి
తత్సమత గూర్చునట్టివేదమ్ములకును
స్వస్తి చెప్పి కర్మావజ్ఞ సలుపు చుండ్రు.

నాకము నీశిరస్థలిగ నాడును వేదము లట్టిదాని న
ఱ్ఱాఁకలు వెట్టుచుండిరి దురాశయులై దితిపుత్త్రు, లైననున్
జేకొని వేదశీర్ష పరిశీలన దానిఁ దలంపవేని మా
ప్రాకటపూర్వదుష్కృతఫలం బని యూరటఁ గాంతు మోప్రభూ!

ఇది తత్త్వం బీ మేమిటు
లిది మాలోకప్రకార మిది మాస్థితి, యిం
కెది కర్తవ్యము నీనె
మ్మది( దల(పుమ, యీవెగా ప్రమాణము మాకున్.

వ. అని వచించి గురుం డూరకున్న దేవత లొక్కుమ్మడి నమస్కరింప(గా( గమలాసనుండు దయామయుండై యిట్లనియె. ఎఱి(గి యెఱి(గి మీరు దుర్వాసునిపై దోషారోపణంబు సేయరాదు. ఇత(డు కరుణామయమూర్తి. కనుక నే యీ సూక్ష్మశాపంబున మఘవు ననుగ్రహించె. కానిచో నిఖిలజగన్మాతయగు నంబిక దైవనిర్మాల్యమును దిరస్కరించిన మహాపాతకము వేలకొలంది యబ్దంబు లాతం డెట్లు వహింప(గల(డు? ఇట్టి మహాపరాధకిల్బిషము మీకు( దొలంగునందాక మిమ్ము( దలంచుటయు( దప్పని మేమింతవఱ కూరకుంటిమి. ఈకల్మషము గొప్పదైనను మందరపరిసరనివాసమున నది పూర్తిగ( దొలంగినట్లే. జగజ్జనని చరణాపరాధసంపర్కమువలన మిమ్మనుగ్రహించుటా మానుటా యను సందేహమున నూగులాడుచు నే యుపాయాంతరము చింతించితిని. నారాయణీప్రసాదతిరస్కృతిరూప మగు నపరాధము నారాయణానుగ్రహంబువలన నే పాపికొన(దగినదిగదా!

క. మహీయస్తనకేశపాశ జఘనాక్రాంతేశవామాంగమే
కమలాకౌస్తుభధారి యొక్కొకవు డా( గాకేమి; యేమాతయుం
దమ కేశుం డపరాధియై మెల(గెనో యామాత యాదేవు(డే
సమదృష్టిం దిలకించి యాదొస(గు నుత్సారింప(గా దక్షు(డా.

వ. కాఁబట్టి క్షీరసాగరమునకుం గదలుఁడు. భగవంతునిం జూపగలము. అని వచించుచు బ్రహ్మ తనయాసనమందుండి లేచి యంతర్ధానమందెను.

మురువున దానవేశ్వరులు మోదమునన్ భయ ముజ్జగించి స
ద్గురుకరుణావిశేషకలితుల్ పరమాభ్యుదయానుషంగులై
యరయిఁక బ్రాణిమానసగుహాశయుఁ డయ్యును నంబురాశిపై
నురుతరభోగతల్పమున నుండెడిమాధవుఁ జేర నెల్లరున్.

అరుగుచు దిక్పతులెల్లరు
గరుడధ్వజుఁ డెక్కె మైనగరుడిం గనియా
హరికరుణ కలుగఁగల దని
గురుతుగఁ దద్దర్శనంబుఁ గొని చని రెలమిన్.

వ. సత్యలోకమునుండి దిగుదేవతలు పెక్కువేలయోజనంబులు గడచినను యోజనమాత్రింబుగ భావించుచు, విరించివచనములు సంభావించుచు, బృహస్పతిచే నాకర్షింపఁబడినవారివలె శీఘ్రముగ దిగియుచటిమందవాయువుల సేదదేరి మేఘమండల మార్గమున విశ్రమించిరి.

అచట వారు, పురాణపురుషునికి నిద్రాభంగ మగునేమో యను శంకచే దుర్నివారధ్వనులను గావించుకల్లోలములను బవడపుదీవ లనుబెత్తములతోఁ గొట్టుచున్నటు లున్నసముద్రిని గాంచుచుండిరి.

బడబాగ్నిసంబంధమునఁ బొంగుచున్నట్లు తత్తరంగములు సహస్రముఖంబులఁ బై కెగయుచుండెను. పరిపూర్ణముగఁ శానమైనర్చినదుగ్ధాబ్ధిక్షీరములవలనఁ గడుపులు బూరటిల్లిన తెల్లని మేఘములు పైఁబై నావరించుటవలన మీఁగడచేఁ గప్పఁబడినట్లామహాబ్ధి విరాజిల్లుచుండెను.

యుగయుగములనుండి యున్నతనపయోవికారత పోఁగొట్టుటకై పరమేష్ఠి, వేళ్ళతోఁగూడఁ గొన్నియోషధుల నచటఁ జల్లెనేమో యన్నటులు నాఁచుతో నాజలధి యొప్పుచుండె. పాలమేఘములనుండి జాలుతుషారములను ద్రావుట కలవాటుపడినచాతకములు నీటిమేఘంబులు వర్షించుతుహినము చప్పగ నుండుటచేఁ దిరస్కారభావమున దాని నుమియుచుండెను.

గోవిందదర్శనార్థము వేంచేసిన దేవతల విమానములందలి హంసలు నీరక్షీరంబుల భేదించుచుండ నన్నిదెసలనుండి వచ్చిపడు వేలకొలఁదినదులజలమే భుక్తిగా నందలిబడబాగ్ని వృద్ధినందుచుండెను.

ప్రాంతము లందలికొండలపైఁ దిరుగుమదగజములు పాలకరళ్ళచేఁ గొంతకాలము తెల్లగ నుండుటవలన నైరావతభ్రాంతి నొదవించుచుండెను. అది క్షీరసాగర మగుటచేఁ బర్వకాలము స్నానార్థమేఁగుదెంచుమహర్షు లఘమర్షణబుుక్కులందలి యప్పదముల స్థానంబులందు క్షీరపదములను జొనుపుటయా మానుటయాయని చేయుసద్దులు తరంగఘోషణము నణంచివేయుచుండెను.

క్షీరాహారమువలనఁ బరమనిర్మలము లైనయుందలి మత్స్యకూర్మములు దేవునిమూఁడవయవతార మగు శ్వేతవరాహము యొక్క స్వచ్ఛత ననుకరించుచుండెను. పరమేశ్వరుండు వైకుంఠముం జూడరాఁగలఁ డని యాతని గౌరవింప నిలిచినకైలాసగిరులవలెఁ దనగర్భమందలి శైలములు పయస్తరంగసంపర్కంబుకలనఁ దెల్లఁగ నుండెను.

మఱియుఁ గాలచక్రమువలెఁ గర్కటమకరమీనములతో నిండి, గంగాతీర్థముపోలె గర్భమునఁ బెక్కుకూర్మరాజులుగలిగి, యాత్మతత్త్వంబుకరణి వచింపరానిగుణప్రపంచముగలిగి, కైలాసశిఖరము నాఁగ శైవలక్షణలక్షిత మైనద్విజసమూహముతో నిండి, యాకసమంట నుప్పొంగునూర్మిమాలికలవలన మిగుల భీషణంబై యొప్పె.

ఇట్లు క్షీరసృష్టికి సమూహమై, నిర్మలతకుఁ బ్రోవై, చంద్రనక్షత్రాది స్వచ్ఛవస్తువులనిర్మాణమునకై సృష్టికర్త కఱఁగించిపోసిన రజితాచలమా యనునటు లుండి, భూదేవికి దుకూలావగుంఠన మై, స్ఫటికమణులచేఁ గప్పఁబడినపద్మనాభుని శయనాగారవిశాలకుట్టిమమ్ము భాతి కవివాక్కుల కందనిదై, యాశ్చర్యముల కాశ్చర్యమును, కనుల కార్తిహారమును, నంతఃకరణమున కానందమును, విష్ణుభక్తిహీనులకుఁ బొందరానిదియు నై దుగ్ధోద మనునారత్నాకరము కరము విరాజిల్లుచుండెను.

తాను జగత్పతిత్వపరధాముఁడు ము న్నొకఘోషమందునన్
మానవుఁ డౌచు దొంగిలియొ మంచిగనో కొనఁడే పయస్సు, నా
న్యూనత పాయఁబెట్టఁగ మహోగ్రతరోర్ములఁ బెక్కుఘోషముల్
వాని, మహాపయస్సున విలాసముగా రవళిల్లు నిచ్చలున్.

ఎట ధన్వంతరి రోగహారి యమృతం బెచ్చోట రాజిల్లెనో
యెట దేవుం డగునచ్యుతుం డెలమి నెంతే హాయి నిద్రించునో
యట క్షీరార్ణవగర్భలీన సుమహాహాలాహలోష్మాహతిన్
బటుచాంచల్యము నొంది యప్పతియు నిల్వన్నేర కల్లాడెడిన్.

వ. ఆయర్ణవముం దాదివరాహమూర్తి ప్రవేశించి కవ్వముల వంటి తనకోరలచేఁ జిలుకుటవలన నందలిక్షీరములనుండి పుట్టిన వెన్నముద్దవలెను, నీఁదులాడుతిమి తిమింగిలముల యువలోడనము వలన నుద్భవిల్లి, గాలికిఁ బ్రోగుపడిన ఫేనసంతతివలెను, బంకజనాభుని శయన మగు నాదిశేషుండు నెలనెలకు విడిచిన కుప్పసంపుఁదిప్పలవలెను, గాలపరిపాకమున మృద్భావ మంది నిర్మలమైనట్టి భూసతిపట్టుకోక పోఁకముడివలెను, వెనుకటికల్పమున మందరగిరిని జుట్టుటచేఁ గలిగినక్లేశమువలన జుట్టలుచుట్టలై మూర్ఛపడియున్న వాసుకిదేహమువలెను, బ్రకాశించు నొక తెల్లనిదీవిం గాంచిరి.

దేనిం గాంచిన బ్రహ్మలోకమునకుం ధిక్కారమే దక్కునో
దేనిం బొందిన నింక నందఁ గలయుత్కృష్టస్థలం బుండదో
దేనిం గూర్చి యతీంద్రు లుద్దవిడి నెంతేఁ గూర్తురో యత్న, మ
ద్దానిన్ విష్ణుపదంబు నొందియు సురల్ స్తంభించి రం దడ్గిడన్.

అందఱును విష్ణుధామము
నంద నుపాయము దలంప, నాదివిజుల కా
నందము గూర్పఁ బితామహు
డుం దరియుట గాంచి రటఁ గడుంగడు వేడ్కన్.

వ. సౌధ మధిరోహించు కుతూహలం బగ్గలించినను నిరుత్సాహముం గొను పంగువులకరణి నున్నమహేంద్రాదులను దయదలంచి నా వెనుక రం డని చెప్పుచు నాపరమేష్ఠి ముందు నడచెను.

పరమసిద్ధ పురాతనుల్ విగళితబ్రహ్మాధికారుల్ రమే
శ్వరసారూప్యము గన్నబ్రహ్మల విశిష్టం బైనసద్భక్తి నం
దటినిం గూడి నమస్కరింప నురుఖేదస్నేహవాత్సల్యముల్
గురుకో వారలు సత్యలోకవిధి వాకోఁబూని రొక్కొక్కరున్.

వ. నాయనా! నీవిప్పటికిని బ్రబుద్ధుఁడవు కాలేదా?

వల్లభుఁడవు వాగ్దేవికి
నెల్ల జగంబులకుఁ దాత వీ వాశ్రితులన్
దెల్లముగఁ దాల్తు మోముల
జెల్లెంబో! నీకు నెవఁడు శిక్షకుఁ డనఘా!

వ. నీవే స్వయముగ నాలోచింపుము.

కొనగొని వీరియాయు వది కొంచెము తక్కువగా ముహూర్తమై
యనువగు, నీక్షణార్థమునకై యొకసంపదయున్ విపత్తియా?
విను, వినువీధిలోఁ దిరుగువీరల వీడుము క్షుద్రజంతులన్,
మనన మొనర్పు బాలక! రమాపతి నన్యము లేలఁ గోరఁగన్.

వ. అని బోధింపఁగా సురజ్యేష్ఠుం డిట్లనియె. ఓ పూజ్యులార నే నెఱుంగుదు నెఱుంగుదును.

ఎందఱో విశ్వసృష్టలిఁ
కెందఱో లోకేశు లెందఱో నింద్రులు గాఁ
నిందునిశ్వాసములం బడు
చుం దఱచుగ వారు పుట్టుచుం గిట్టుదురో!

వ. అన నొకపనియందు నియమితుండ నగు నేను దాని కనుగుణముగ యత్నింపవలెను. కాన మీ రిప్పుడు చూపినభగవంతుని సమీపించి మీరిచ్చినయక్షరములనే పల్కెదనని సవినయంబుగ ననుచుండఁ బారిషదులు ప్రసన్నులై యాతనిచేయి పట్టి కొంపోయి యుపనిషద్రహస్యభూతుఁ డైన శ్రీమహావిష్ణువుం జూపిరి.

సర్వదా సర్వకార్యార్థసాధనముల
ముందుగా నేఁగూఱిచి మ్రొక్కు లిడెదో
యచ్యుతునిసైన్యనాయకుం డైనయా మ
హాత్ముఁ దలఁపు, విష్వక్సేను హరిసరూపు.

వ. విష్ణువాహనం బైనయా వైనతేయుం గాంచుఁడు. మున్నాతఁ డమృతకలశమును హరింపఁబోయి విజృంభించి ఱెక్క లల్లార్చుటవలన నందన మందలివృక్షములెల్ల దిక్కులకుఁ దూలి పడినవి. అతిప్రయత్నమునఁ బారిజాతము నాహరించిన భగవంతుండుగూడ నాసమయమున సిగ్గుపడి నటులు వినుచున్నాము.

రణములందు జిగీషతో రాణ నేఁగు
శౌరిఘంద మెట్టెట్టులు సాఁగుచుండు
నట్టిటు ప్రవర్తిలుటఁ జేసి యామహాత్ముఁ
డౌనర ఛందోమయుం డన నొప్పుచుండు.

కాళులవేగ్రిలిగోళ్ల గజకచ్ఛపముల్ గొని వ్రాల, ఫెళ్లునన్
గూలినమఱ్ఱికొమ్మ, నెటకో తనముక్కునఁ బట్టి పైకిఁ బో
వ్రేలుపురాణవానులకు లీలగఁ దా సశరీర నాకపు
న్యాలయయాన మబ్బె ననుహర్షము నీగరుడుండు గూర్చెఁడే!

వ. ఈతనికి యజ్ఞోపవీత మైనవాఁడని యూహాడ వెటింగియే మేరుధనుస్సునకు మౌర్విగా వాసుకిని దేవతలు నియమించి రని వైతిహాసికు లనుచున్నారు.

జ్ఞానక్రియేచ్ఛా విశాలవినిర్మల
మాణిక్యదర్పణ మండితమ్ము
అధ్యాత్మవిద్యా మహారత్నదీపప్ర
కాశాపహృత తమఃకాండయుతము
పరమభక్తి ద్వార భాసురగాఢ బో
ధాభావఘునకవా టాంచితమ్ము
అప్రకంప్యప్రభావావిద్ధ శమదమ
ద్వారపాలాభిగుప్తాంగణమ్ము

నిఖిలజగదవనక్రియానిర్విరోధ
యోగముద్రాత్తనిద్రానియుక్త మగుచు
దివ్య మోంకారరూప మై తేజరిల్లు
నామురారిశయ్యాగార మదియె కనుము.

వ. అని యువతివారెల్ల బ్రహ్మను దెలుపఁగా;—ఇట్టిట్టనరాని వైభవము గలిగి కనుల కగ్రాహ్యమై యాగమతాత్పర్యమై యనుశ్రవైకవేద్య మగుట నద్దానిం గ్రహించుటకుంబోలె, చక్షుశ్శ్రవస్త్వము నంది రెండువేలకన్నులతో ననుభవించుచున్నట్లున్నవాఁడును; ఆద్యంతములు లేని యుచ్ఛ్వాసనిశ్వాసములవలన నుప్పొంగుచు సన్నగిల్లు దేహము వలన నూర్ధ్వాధోభాగంబుల కూఁగులాడు విలక్షణమైన డోలాధిరోహణ సుఖముం గలిగించువాఁడును; యోగులకు గురువై వ్యాకరణ సిద్ధాంత ములకుఁ బ్రథమోపదేష్టయై చికిత్సాశాస్త్రమును బ్రవర్తింపఁ జేయుచుఁ బాతాళమున కలంకారభూతుఁడునగు భోగివర్యుని, శమధనుల భోగ విముఖమ్ములగు హృదయములందు నిరంతరనివాసమువలన విసివియో యనఁ దల్పముగ సమర్చి యుంచుఁ బరున్నట్టియు:—

మహాయోగులు శిరములువంచి నమస్కరించినపుడు చల్లిన పూలలో మృదువై నవఁగుట దేహము నంటినకల్పవృక్షపుష్పములవలెను నక్కడక్కడ సంసక్తమైనగంగానదీశీకరములవలె నున్న నఖములచేతను నిరాతంకముగ మోక్షము నొసంగుటను సూచించుట కెత్తఁబడినధ్వజ రేఖచేతను, సంసారారణ్యమున సంచరించుటచే నాయాసపడుచున్న జీవులకు నీడ నొసంగుటకై సంపాదించినఛత్రరేఖలచేతను నొప్పాఱు పాదకమలములతోడను బ్రథమమాత లగు శ్రీభూకాంతల యంకశయ్యల నలంకరించుచున్నట్టియు:—

కటితటమం దున్నస్వర్ణచేలాంచలకాంతిసంపదచే శ్రీదేవియు భూదేవియు బంగరుపసల మిసమిసలాడుచుండ నాయుభయులను బోల్చి

కొనలేక వారివారిపరిచారికలు తాఱుమాఱైన యుపచారములొనర్చుచుండఁ దద్భ్రాంతికిఁ బరిహసించుచున్నట్టియు:—

ప్రతికల్పమున జనింపనున్నబ్రహ్మాంకురము లనుమాణిక్యశతములతో నిండినకర్ణికతోఁ, బ్రతిసృష్టియందును దిరుగుప్రకృతిమొదలు భూమివఱకైనతత్త్వము లనెడికింజల్కపుంజములు గలిగి లోకములకుఁ బితామహుం డగుబ్రహ్మకుంగూడ జనకమైన శ్వేతపద్మముతో విరాజిల్లునాభీమండలము గలిగినట్టియు:—

నిర్మలమై చిద్రూపమైనదేహమందు సర్వదా ప్రతిబింబించులక్ష్మిమోమునందలి కస్తూరితిలకమువలె నున్నశ్రీవత్సముచేతను, మనసునుండి పుట్టినచంద్రునందలియీర్ష్యవలన స్వయముగ హృదయము నుండిజనించినబాలసూర్యునివలె నున్నకౌస్తుభమాణిక్యముచే నప్రాకృతము లగుకుండలాద్యలంకృతుల నలంకరించునట్టియు:—

దిగ్గజములతుండములవలెను, గల్పకముల ప్రకాండములవలెను నుండి, దుష్టమధుకైటభాదిజయజనితకీర్తివలె నున్నమౌక్తికహారముల వలన విజయలక్ష్మిచేఁ గౌఁగిలింపబడినట్లు విచిత్రము లగుకనకాంగదకంకణాద్యలంకృతులు గలచతుర్భుజములచేఁ జతుర్వ్యూహత్వమును సూచించుచున్నట్టియు:—

ఉషఃకాలమున జిగిమించుమామిడిచిగురువంటి యధరమందు సంధ్యారాగమిళితమైనవెన్నెల ననుకరించుమందస్మితము వ్యాపించుచుండఁ గలికలుషమలినులైనజీవులయాశయములను బరిశుద్ధిమొనర్చుటకుఁ గతకరేణువులై, మోక్షలక్ష్మిస్వయంవర పుష్పమాలికలవలె

జిత్రవర్ణములు గలిగి దయావర్షమును గురియు శీతలకటాక్షములచే ననన్యశరణులగు మునుల ననుగ్రహించుచున్నట్టియు: —

కుండలములతోఁ బ్రకాశించు ముఖారవిందసౌందర్యముంగాంచి ముగ్ధయగు లక్ష్మి ముద్దిడగా నంటినతాంబూలరాగమటు లున్న పద్మరాగమనెడి తిలకముతోఁ జెన్నెసలారులలాటపట్టము గలిగినట్టియు: —

స్వచ్ఛము లగుపడగలయందుఁ బ్రతిబింబించిన శేషుని ఫణామణులవలె నున్నకిరీటరత్నములచే రంజితమగు విశాలోపధానము గలిగినట్టియు —

పరులపైఁ బ్రసరింపనిచూపులతో వినయవినమితములై రూపెత్తి వచ్చి సేవ లొనర్చుపంచాయుధములతో విరాజిల్లుచుఁ, బ్రాకృత జీవులతోఁ బోల్పరాక, యున్నతస్థాన మధిగమింపలేని నీచపరిమాణముల కందరాక, యక్షోభ్య మగువిద్యాసాగరమై, యక్షయ మగుమహానందనిధియై, యవైదికులకు నుపనిషద్భావము భావింపలేనియశక్తుల కగోచరుఁడై నిర్వికల్పసమాధిమార్గహీనులకును, శోధింపరానికర్మపద్ధతులు గలవారికిని, నవిద్యామూలకము లైనతమో, మోహ, మహామోహ, తామిస్ర, అంధతామిస్రము లనెడిపంచపర్వము లతిక్రమింపనివారికి దుర్లభుండై, గురుపాదసేవాధురంధరులకు నపాయోపాయవృత్తులందుఁ బరాఙ్ముఖు లైనవారికిని, నచంచల మగువిశ్వాసబలము గలవారికిని, నాత్మార్పణ మొనర్చినతత్త్వవేత్త లగుమహాత్ములకును లభ్యుండై, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడై యఖిలలోకశరణ్యుండై సమస్తప్రమాణములకుఁ బరమప్రాప్య మైనభగవంతుఁ డగునారాయణు నుద్దేశించి యంజలులు ఘటించుచుఁ బ్రణవమును సర్వదా జపించుచుఁ బరతత్త్వ

మును స్మరించు, నీరునించినకనులతోఁ బులకించినయవయవములతో
నానందగద్గదము లగువాక్కులతో ని ట్లనుచు స్తుతింప మొదలిడెను.

తప్పులు సైఁచి ధీజనులదారులు దిద్ది జనాళియుజ్జ్వలల్
తుప్పునఁ దూల్చి, కౌస్తుభముతో నెదఁ దాల్చి రమన్, దయార్ద్రిలోఁ
జెప్పలు దేలుచూపులను, దే టగుసల్లనికల్వచాయతోఁ
జొప్పడు శాశ్వతున్ బరముఁ జూచితి నచ్యుతు బ్రహ్మ నిమ్మెడన్.

ఎందులకు వఃశ్రీతర్కము
లెందుల కితిహాసశకము లిట వేదమయున్
సుందరభుజంగతల్పము
నం దున్నరమేశుఁ గాంచుహర్షము గలుగన్.

వ. చరాచరాత్మకమై; లీలావిభూతి నిత్యవిభూతి నాఁ దనరి;
భూతభవిష్యద్వర్తమానంబులకును, జాగ్రత్స్వప్నసుషుప్తులకును, సాక్షి
భూతమై, సూర్యచంద్రాగ్నిరూపమై, సూర్యమండలక్షీరాబ్ధిపరమపదం
బులం దుండి; వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నామధేయంబుల
నలరారి, శంఖచక్రగదాశార్ఙ్గనందకధరంబై; జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య,
వీర్య, తేజస్సహితం బై, రతుకాంతరరహితమై యద్వితీయ మగు నా
పరబ్రహ్మమును నేను శరణము నందెదను.

[ఏకమై ద్వివిభూతి యై యెసఁగు చుండి
హరిఁ ద్రిధామంబునున్ జతుర్వ్యూహ మగుచు
వినతపంచాయుధంబు షడ్గుణపరీత
మై యశరణశరణ్య మాసాత్మఁ గొలుతు.]

వ. అని నమితుం డగుసంతలో నింద్రాదిదేవతలు బృహస్పతిని ముందిడుకొని పుష్పాంజలుల నొసంగి దూరమున నిల్చియే వేలకొలంది నమస్కృతు లర్పించి లేచి శిరములం దంజలులు ఘటించి యాశ్చర్యమున స్తంభీభూతు లైరి.

పరమపురుషునత్యద్భుతచరితములను
తిలిరి పొగడెడియాసురదేశికునకు
మామలను జూచుభీతిచే నేమొ వాణి
స్తబ్ధయై నోరు వెలువడఁ జాలకుండె.

వ. పిదప దయామయము లగుపద్మనాభునియపాంగప్రసారములచే నింగిత మెఱింగి పాదసన్నిధి నున్న లక్ష్మి స్వభావమధురము లైనను మహావాత్సల్యముచే మధురాతిమధురము లగునక్షరములతో నాయనా! చాలకాలమునకు వచ్చితివి. కుశలమా ? ఈప్రజ లెవరు ? కాందిశీకులవలె నున్నా రే! అని యడుగ బ్రహ్మ లోలోన మురియుచు నాపరదేవతకు సహస్రనమస్కృతు లొనర్చి యిట్లు పలికెను.

జయ జయ హాటకాంబుజలసన్మృకులప్రభ ! లోకమాతృకా !
జయ జయ విష్ణువత్స గురుసౌధనిరంతరకేలితత్పరా !
జయ జయ లోకనాథపరిమత్రపతిపాలితశీతలేక్షణా !
జయ జయ జన్మమార్గపరిషక్త జగజ్జనమోక్షదాయినీ !

బిడ్డ యటంచుఁ బిల్చితివి ప్రేమసుధారసధార చిల్కఁగా
దొడ్డగ నోరగంటఁ గనితో దయ చల్లఁగ నుప్పతిల్ల, నా
బిడ్డలు నేను ధన్యుల; ముపేంద్రుసికిన్ గల దొక్కవిన్నపం
బెడ్డము పుట్టఁ బల్క జననీ! తదుపక్రమ మానతీయవే!

వ. అని లక్ష్మిని బితామహుండు ప్రార్థించుచున్నంత గోవిందుండే యిట్లనుగ్రహించె.

కలితచరాచరాత్మకజగంబులకెల్లను స్రష్టవై తగన్
నలువగ నాల్గువేదముల నాలుగుమోములఁ దాల్చుచుండుటన్
జెలువుఁడ వైతి నాకుఁ బరిశిష్టజగమ్ములకెల్లఁ దాత ! నీ
తలఁ పెదో తెల్పుమీ యవితథంబుగ దాని ఫలింపఁజేసెదన్.

చేసితిని జేయుచున్నాను చేయఁగలుగు
దెందఱినో సృష్టికర్తల నింకమీఁద
భక్తియుక్తుఁడ వౌట నీపైని గలుగు
కరుణ నాకితరులపయిఁ గలుగ దెపుడు.

వ. అనురమాదేవినుడువులను దనయెనిమిదిచెవుల వినుచుఁ దన్మయుఁడై బ్రహ్మ చెప్పవలసినది మఱచి యెట్టకేల కిట్లని విన్నవించుకొనెను.

ఒక్క ముఖంబునన్ మనుజు లోలి ధరింపరె వేదవాదముల్
చక్క మృషార్థముల్ సృజన సల్పవె నిద్రయుఁ బిచ్చియున్ బ్రభూ!
మిక్కిలి వానిచేఁ గలుగు మేలది యేమి? భవత్కటాక్ష మీ
చక్కిని జేరి పొందితిని సర్వశుభంబులకున్ శుభం బిదే.

వాంఛితముల నెయ్యది ముఖ్యవాంఛితంబొ
దుర్లభముల నెయ్యది మహాదుర్లభంబొ
యట్టినీపాదపంకజ మంది యుంటి
నుచ్చితము లన్యము లవెల్లఁ గుచ్చితములు.

ఎవ్వ రీయమరులు ? దైత్యు లెవ్వ రకట ?
యేమిది జగత్తు చివరి కే నెవ్వఁ డగుదు ?
నీమహామోహ మణఁచి సామీ ! కృపాళు !
దాసదాసానుదాసుండ దయను గనుము.

వ. అని లక్ష్మీకటాక్షంబుచేతను దేవదేవునిదయావిశేషంబువలనను దత్త్వము నెఱింగి పద్మసంభవుండు మిన్నకుండఁ, బ్రపంచప్రజాపాంచాలికానటనసూత్రధారుం డగునప్పరమపురుషుండు సర్వమార్గములందు నిరాతంకముగ సంచరించుమాయచే నాతనిం గప్పి కర్తవ్య మాతని కుపదేశించె. ఇట్టిపనులు కుచ్చితము లన్నమాట సత్యమే. మే ముపదేశించునది జాగరూకుండవై విని దేవత లందఱ కద్దాని నానతిమ్ము.

దితిజులతోడ సంధించు టిప్పుడు మీకుఁ
బ్రథమకర్తవ్యంబు బుధులు ! వినుఁడు
మందరకుధరమున్ మంథానముగఁ జేసి
క్షీరార్ణవమునందుఁ జేర్చుఁ డవలఁ
గవ్వపుఁద్రాడుగాఁ గట్టి వాసుకిని వా
రును మీరలున్ మథించిన నమృతము
జనియించు; దాని నాస్వాదించి మీరెల్ల
రమరభావంబుల నందవలయు.

అట్టియజరామరత్వ మెట్లైన మీదు
శత్రువర్గము పొందఁగఁ జాలకుండుఁ
దోడనే వారిని జయింపఁ దొడరవలయుఁ
గార్యసంసిద్ధి కిదియె మార్గంబుసుండు.

వ. కాని యిక్కార్యమందు వారింపరానిమహావిఘ్న మొండు రానున్నయది. అది పరమేశ్వరానుగ్రహమ్ముకతనఁ దొలంగు. కాన నేఁటి నుండి మీరు విశేషించి యాపరమశివునే రక్షకునిగాఁ దలంపవలయును.

తెలియుదును నే నుమాకాంతుఁ; దెలియు దీవు
నాదుబోధలఁబట్టి; యింద్రాదులెల్ల
మూఢు లెఱుఁగుదురే మనవోలె? వారి
కెఱుఁగఁజెప్పు మటంచును హెచ్చరించె.

దివ్యకరుణామయుఁడు దేవదేశికుండు
దేవతల కిట్లు పరమోపదేశ మొసఁగి
శూలి నెదఁ దలంచుచు బ్రహ్మ చూచుచుండఁ
పద్మనాభుండు దాఁ దిరోభావ మందె.

వ. పిదప నిందిరాపతియానతిని దేవత లెల్లరకు నివేదించి పితామహుం డంతర్ధానమయ్యె. నిర్జరులును బూర్ణ మనోరథు లై పురహరుని సేవింపఁ దత్పరులై మరలి మందరాద్రిం జేరుకొనిరి.

ఇది :- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూరిగృహనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబాద్వితీయపుత్త్ర,
మహాగాయత్త్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య,
సూర్యనారాయణశాస్త్రిప్రణీతం బైన
ఆంధ్ర నీలకంఠవిజయచంపూ మహాకావ్యంబున
ద్వితీయాశ్వాసము, సంపూర్ణము.

# నీలకంఠవిజయము

## తృతీయాశ్వాసము.



వివిధమహోపచారముల విస్తృతతంత్రజపాదిచర్యలన్
దివిజులు లోకరక్షకు నుతించి భజించుచుఁ జంద్రమౌళిఁ, దా
రవగుణవక్రగామి దివిజారులఁ గూడ మృషార్థమైత్రిమైఁ
దివిరి విరించి తెల్పినవిధిన్ గురు నెన్నిరి దౌత్యవృత్తికై.

గురుఁడవు పురోధసుండవుఁ గూర్చుమంత్రి
వందలకుఁ బరాయణుండ వీ వౌటకతన
దారి గానక సాధనాంతరము గనక
యధమకృత్య మ్మొనర్ప మి మ్మడుగనయ్యె.

వ. అని దేవతలు ప్రార్థింప నాంగిరసుం డిట్లనియె. మీ రట్లన రాదు. రాజోపజీవుల కధమకృత్యము లనుమాట లేదు.

రాజకీయ పూరుషుని రారాజు లెట్టి
కృత్యము లొనర్పఁ బూన్తు రాక్రియలు వాని
క్లిష్టములుఁ గీర్తికరములై యెసఁగుచుండు
నట్టివానిని బడయుట యుబ్బరంబు.

వ. కాని కొంచెము మీరీ విషయమున నాలోచింపవలసియున్నది.

తమశక్తి తా మెఱుంగక
తమకపడుచుఁ గార్యగాధతను గానక యో
కుమతులు కృత్యములం దిగి
తమి మున్గుదు రతలవితలతల మంటంగన్.

వ. సంధియుఁ దిన్ననిదారి గలసజ్జనులతోడనే జరుగును గాని దుర్జనులతోఁ బొంది పొసంగ నేరదు. దురహంకారదూషితు లగు దానవులతో నది కుదుర నేకుదురదు. మఱియుఁ జమత్కారముగఁ బలుకునైపుణ్యము గలదూత లీసంధికార్యంబు సాధింప వలంతులు. దూతనే కన్నెత్తి చూడనివారితో సంధి గగనకుసుమంబుగాదె? పూర్వము కుబేరుఁడు దూత నంప రావణునిసభయం దాతఁడు సమయింపఁబడె నని విను చున్నాము మఱియును యుద్ధములలోఁ బ్రవర్తించువారు సర్వముం జెడియున్నపుడు విరోధితో సంధింతురు గాని, కావలసినది పొంది కడుపులోనిచల్ల కదలకున్నపు డున్నది పోఁగొట్టుకొనుటకై సంధింపరుగదా.

ఒకయుచ్చైఃపదమందు నిల్పఁ ద్రుటిలో నుడ్డాడఁ జేయంగ నే
సకల మ్మ్రుండెనుగాదె రక్కసులప్రస్తావంపుటర్ధోక్తిలో
నిఁక వా రేఁటికి బిచ్చ మెత్తికొను నీవృద్ధశ్రీవుం బట్టి సం
ధికినై దొర్లుట? యేమివాంఛ లిట సిద్ధిం బొందు మీపట్టునన్.

వనితలు వస్త్రశస్త్రములు వారణముల్ మణులుం దురంగముల్
దమసుతు లాహరించిరిగదా, యిఁక నెయ్యవి గాన్క వెట్టఁగన్?
చని చని రిత్తచేతుల నసారపుఁబల్కుల రాకసేంద్రు నే
యనువునఁ గాంచువాఁడ? వసుఁడా యిటులాతఁడు? తోఁచ దేమియున్.

వ. అని యుక్తియుక్తముగ సురాచార్యుండు వచింప నిర్జరులెల్ల నిరుత్సాహము సెందియుండ నిందురిం డిట్లనియె. గురుదేవా ! మీ రన్నది నిజమే కాని,

కలితాలంక్రియ నుత్తరోత్తరచమత్కార ప్రకారమ్ముగా
నలలోకత్రయవక్తృతాగరిమ నింద్యం బౌనటుల్ పల్కఁగా
వలఁతుల్, మీనుడులన్ వినన్ మదిని సంభావింప మాటాడ నీ
చుల మా మాకెటు లబ్బు? వాక్పతులటంచుం బేరు మీదేగదా!

వ. నారాయణుం డానాఁడు రక్కసులతో సంధి సలుపుఁ డని మన నాయకుం డగుపరమేష్ఠితో ననిన దానిని, అతఁడు తమతో ననిన దానిని దిరిగి జ్ఞాపకము చేయుచున్నాను.

చేయంగఁ దగిన దేదో
చేయంగా రాని దేదో చెప్పఁగలే మా
చేయునది విధియు వెన్నుఁడు
ధీయుత ! మీరలును జక్కఁ దెలియుదు రింతే.

దివిని నాకు మాఱుదిక్కు లే దని పల్క
నమరవిభునినుడువు లాదరించి
మాఱుమాట పల్క నోరాడ కయ్యెడఁ
దనమపజ్ఞ చూపఁదలఁచె గురుఁడు.

వ. అతఁడు పయన మొనర్చుచునే మార్గమధ్యమునఁ దాను బలుక వలసిన దంతయు భావించికొనెను, మఱియు,

ఎలమిఁ బుజ్జాబలము చూప నిదియె యదను,
అసుచాటూక్తి రచనకు నవసర మిదె,
పున్నమును గీర్తి నార్జింపఁబోలు నిప్పు
డనుచు దైత్యగురుని జేరె నమరగురుఁడు.

వ. అప్పుడనుకొనకుండ శిష్యులతో దయచేసిన దేవగురుని శుక్రుఁ డర్ఘ్యపాద్యాదులచే యథావిధిగ నర్చించి మణిమయాసనమునఁ గూర్చుండఁబెట్టి దానును గూర్చుండి యాతని సమ్మతి నిట్లనెను. నేఁడు నా జన్మము నాయగ్నిపూజలు, నాహావ్యకవ్యాతిథ్యాదులు, నాశాస్త్రాభ్యసము, నాగురుపూజలు, నాయాశ్రమము మున్నగునానర్వస్వములు ధన్యము లైనవి. గృహస్థులు కోరఁదగిన తమవంటిదైవమూర్తు లయాచితముగ వేంచేయుటంబట్టి మాభృగువంశము గౌరవపాత్ర మయ్యె. ఎన్ని తపస్సులొనరించిన నీ శ్రేయము లభించును? అని భార్గవుం డనుచుండ గురుం డిట్లనెను.

బ్రహ్మవంశమునందుఁ బ్రప్రథమజులగు
ప్రథితమానులు భృగ్వంగిరసు లిరువురు,
అట్టిభార్గవకుల మొందె నాంగిరసుఁడు
సోదరసమాగమం, బిందుఁ జోద్య మేమి?

పరమగృహస్థధర్మపరిపాలననిష్ఠయుఁ, గ్రూరమృత్యుసం
హరణము రాజకీయఘటనాఘటనప్రవిఘాతశక్తి, యీ
శ్వరవరభక్తి, మున్నగుభవద్గుణముల్ చెవులార వించు, న
బ్బురపడి చూడవచ్చితినిబో; మనయాత్మ లెఱుంగు సత్యమున్.

వ. అని గురుఁడు వచించుచు నాయుందుఁ జూపినయాయతిలాలనము, గౌరవముం జాలును తమతో నేకాంతికముగ మనవి చేయవలసినది గల దని యుక్తియుక్తము లగునుడినడలతో సర్వ మెఱింగిన మీకుఁ జెప్పవలసిన దేముఁడు? నైనను :—

జగ మొకయింద్రజాల మని స్వప్నసమం బని నీ వెఱుంగవో?
తగ నధికారదుర్విలసితంబులెగా మనసంస్కృతుల్ సదా,
అగణితగౌరవాదరము లాహరి కాదివిజాళి యన్న, నీ
ప్రగతి నెఱుంగవో? తెలియఁబల్కఁగ నింకిట నేమి యుండెడిన్?

వంచన లేనిజీవనము వావిరి జీవుల కిడ్డధాతయే
కొంచక దుష్టదానవులకున్ గురుగాఁగ విధించె నిన్ను, నే
మంచు విచింతు ధాతృహృదయంబును? దీనిని నీవు చక్క న
ప్పించుకొనంగ నాకసప్రవృత్తిఁ జరింపఁగఁజాలి తయ్యరే!

వ. అక్కారణంబున దేవాసురుల నేకీభవింపఁజేసి మన మిరువుర మేకాంతశీలుల మై యుండవలెను. ఈ విషయ మెఱింగించుటకే నారాక యని యున్న దున్నటులు వచించి మిన్నక యుండ, దానిని గూర్చి యాలోచించుచు భార్గవుం డిట్లనియె. స్వామి! యది నిజమే.

ఏమే మాడెనొ విష్టరశ్రవుఁడు లోకేశుండు నేమాడెనో?
యేమే మున్నదొ నీమెదం దెలియనే యేరీతి కానున్నదో?
మేము న్నీవును దీని గూర్పఁ జెరుపన్ మేకోదు, విశ్వాత్ముఁడే
తా మిమ్మున్ మముఁ గూర్చుఁబో పవనుచేతన్ గాద మట్లొక్కెడన్.

వ. ఆ కలయికం గూర్చిన యాలోచన ము టుండనిమ్ము, నే నేత్రా కలిని రక్కసులం దేర్చి వారిచే మిమ్ము గౌరవింపఁ జేసెద. మీ వాంఛిత మెట్టిదో తెలుపుఁడు. అని సంతోషపడిచి బలిసభ కాతనిఁ గొంపోయి వివిధోపచారముల గౌరవించి యాతనిపరిచయముం జేసెను.

అంత బలియు నో బృహస్పతీ! మిమ్ముఁ గాంచి చిరకాలమైనది. తమ రెందులకు వేంచేసితిరి? మాయనుజుఁ డింద్రుఁడు కుశలమా? ఆతం డేమిచేయుచు నెక్కడ నున్నాఁడు? నాఁటినుండి యాతనిపై రైన వినిపింపదే. అని యడుగుచుండఁగా సోల్లుంఠనంబుగ దేవగురుం డిట్లనియె.

ఎవనికి దేయమై యెసఁగె నీసచరాచర మాజగత్త్రియం
బెవనికి మాధవుండు జగదీశుఁ డెసంగెనో దానపాత్రమై
యెవనికి భార్గవుండు పరమేశ్వరశిష్యుఁడు సద్గురుండో, దా
నవపతి! యట్టినీయశ మనన్య మమేయము వాగతీతమున్.

వ. తత్కారణమున బహుదూరము వెడలినైనఁ బుణ్యపురుషుల దర్శించితీఱవలె ననివచ్చితిని. ఇఁక నీతమ్మునిసంగతి వినుము.

నిరతిన్ ముజ్జగ మేలుసత్ప్రభుఁడ వౌనీ వన్నవై యుండ న
ఖరుఁ డజ్ఞానతమిస్రభాస్కరుఁడు కృష్ణస్వామి సైదోడుగా
గిరిశుం త్ర్యంబకునిం ద్రిశుద్ధిగను భక్తి న్నమ్మి తా నుండ మా
హరికిన్ క్షేమముగాక యన్యమగునయ్యా దానవాధీశ్వరా?

వ. ఆయింద్రుఁడు యుద్ధ మొనర్ప సంగరరంగమున కుఱుకగనే యాతని నాపనినుండి మరలింపనెంచి మునిశాపరూపపాపపంకిలమున

దుడిచివేయుదలఁచి యతనికి మహాభ్యుదయముం గూర్చువాఁడై పరమే
శ్వరుండు, నీవు తపస్సు చేయవలసిన దని యశరీరవాణితో నియమించి
యున్నాఁడు.

గిరిజం గూడి మ హేశ్వరుం డెచట ర క్తిన్ హాయిఁ గ్రీడించు, నే
గిరి నజ్ఞానతమోమయాత్ములు నిరీక్షింపంగ లే, రట్టిమిం
దరమం దుండి శివున్ భజించెడిమరుత్వంతున్ గనన్ బల్కు, డ
గ్గఱ దేవాసురులందు శక్తుఁ డెవఁ డొక్కం డైన దై త్యేశ్వరా!

ఆదిన్ వైష్ణవతంత్రముల్ దెలుపఁ బ్రహ్లాదుండె యాచార్యుఁ డా
మీఁదన్ బ్రహ్మ విరోచనుం జలిపె నెమ్మిన్ దత్త్వసంవేత్త గా
మీఁదన్ బాణుఁడు శంభుకింకరులలో మేల్బంతి, పై చేయియున్
నీదే యార్యులలో; వినిర్మల మిటుల్ నీవంశ మోసత్ప్రభూ!

వ. కాన శుక్రాచార్యునంతవానిచేఁ బ్రబోధింపఁబడి మహాకులీ
నుఁడ వైననీకు మాబోం ట్లేమిచెప్పువారు? కాన నీకార్యవిషయమై
స్వయముగ నీ వాలోచింపవలయును.

అతిమూర్తులు మీకు వరాదు లిడుట
యిచ్చి యన్యథాచేయుట యెఱుఁగరొక్కొ?
బుధులనే నియతమ్ముగాఁ బ్రోవలేక
యుద్ధరింతురు మిమ్ము వా రొక్కొకపుడు.

కాన నిర్మలబుద్ధిసంకలితు లైన
హరిహరవిరించి దేవ దేహంబు లెల్ల
నఖశిఖాగ్రపర్యంత మెన్నఁగను, నింద్ర
జాలమై తోఁచుఁగాదె యోచక్రవర్తి.

వ. అందువలన నిందుఁ బరుల కవకాశ మొసంగక మీరెల్లఁ గలసిమెలసి వర్తించినచో —

ఎట్టినిర్విచారస్థితి! యెట్టిబలము!
ఎట్టియుత్సాహపటుశక్తి! యేప్రతాప
మేసుఖస్థితి! యేకీర్తి యెసఁగునో, య
దెల్ల నూహింపఁగాఁ బోలుఁ దెల్లముగను.

వ. అది యటుండనిండు. ఉభయులును యుద్ధంబునకు దిగినపుడు నేనుగాని మీగురుండుగాని ప్రకాశరహితులమై తటస్థముగ నుండవలసినదేగదా? లేనిచో మాసమాగమంబు జగదేకార్ణవత్వయోగకారణంబని వేఱ వచింపవలెనే?

అసురుసురుగొంచుఁ గొండంతయత్న మూని
దేవదానవుల్ కలసి సాధించినట్టి
యేపనుల్ సఫలంబులై యెసఁగఁగలవు?
మేము మాధ్యాన్వితుల మయి మెలఁగుచుండ.

వ. ఇంద్రునియుద్దేశముమాత్రము భిన్నముగ నున్నదిసుమా!

అనుజుఁడు జయించి నాకమం దమరుఁగాత
అలరుదురుగాక దివ మంది యగ్రజులును
నెట్లయిన భ్రాతృభాగ్యాన నెసక మొసఁగు
నాకు సంపూర్ణతుష్టి యేనాఁటికైన.

వ. మీరు సర్వజ్ఞుల రగుట నేను నిస్సంకోచముగఁ బలికితిని ఇవి తమమంత్రి పలికినభాషితమ్ము లనిగాని, విరోధులమంత్రి వచించిన మాట లనిగాని, గ్రహించుటయుఁ బరిహరించుటయుఁ దగదు. బుద్ధిమంతులకుఁ దమబుద్ధియే శాసకుం డగుమంత్రి. అని పలికి దేవగురుండు విరమించెను.

అంత బలి భార్గవు వీక్షింప నతఁడు సామాజికుల నొడం బఱుప నిట్లనెను. ఓయీ ! సకలరహస్యవేత్తలును, సంధివిగ్రహతత్త్వం బెఱింగిననీతికోవిదు లగుమీరే యీకార్యనిర్ణయమున దక్షులు :—

పరమదరిద్రులే గద సుపర్వులు, తాదృశనిర్ధనాళికిన్
గురుఁడుగదా యితం డిఁకను గోరెడి దేమగు వారిఁ గూడి, సా
గరమును ద్రిచ్చి క్రోలుదుముగా సుధ, యన్నగురూక్తి యొక్కఁడే
చిరము తలంచి యెంచి పరిశీలన సేయఁగఁబోలు నిమ్మెడన్.

వ. రాత్రించరు లప్పలుకులు విని వైష్ణవమాయచే మోహితులై యందుల కంగీకరించినవారై ప్రభువున కిట్లనిరి.

గురుఁ డనినట్లుగా సురలఁ గూడుద మాపయి దుగ్ధవారిధిన్
దఱచుద, మందుఁ బుట్టునమృతం బుభయుల్ దగ నాస్వదింత, మీ
సరణికిఁ దప్పి దేవత లసాధువు లౌదురె ? పోకాలనే
తరుగనియుస్మదీయభుజదర్ప మ దేమగు ? నష్ట మేమిటన్ ?

వ. పిమ్మట యుక్తముగ నే యున్న దని తమమంత్రి నంగీకరింపఁ జేసి సురగురునిం బ్రియాణంబు చేయించి, దానవులు సంధికై మందర

ముం జేరవచ్చిరి. సురాచార్యుండును దనవాంఛితము నెఱవేఱుటక్తె నచటు గదలి మందిరముం జేరి;

సంతతశివధ్యానమువలనఁ బాపరహితులై, శివార్చనాసక్త యుతులై, శివార్పితప్రాణులై శివనామోచ్చారణ మొనర్చుచు, శివకథ లను జదువువారై, శివమయులము మేమే యనిభావించువారై, శివాద్వైత మునే నమ్మి భజించువారై, భస్మోద్ధూళితదేహులై, జటాజూటముల గులాయములు నిర్మించికొనియున్న శకునరుతము లనెడిశుభశకునములచే శివానుగ్రహంబు సన్నిహితమైన ట్లెఱుంగుచు, సన్మార్గవర్తులై విజ్ఞా కలమములవలె విరాజిల్లుసునాసీరాదిబృందారకులం గాంచె.

జరిగినకథావిధానముఁ జక్కఁ బలికి
యావిరోధులయాశయం బనువదించి
దేవదానవగణము సంధింప గురుఁడు
తగినసన్నాహము లొనర్పఁ దలఁచె నపుడు.

వ పిదప గొప్పబలతో మహాసన్నాహముతోఁ జక్కని కతో సంధింప వచ్చినదానవులు స్వభావకుటిలు లైనను మహాతపస్సు లొనర్చి పూతాత్ములై, మధ్యాహ్నభాస్కరులవలెఁ గన్నెత్తి చూడ రానివారై, ప్రళయాగ్నులవలె దురాసదులై, ప్రజాపతులవలె నమ్మ దగినవారై, పూర్ణచంద్రులవలె నేత్రానందకరులైన దేవతలం గాంచి కుశంకలను బోనాడి యనుచరులను నిషేధించి శస్త్రాస్త్రములఁ బరిత్య జించి, నిర్మలము లగుమనంబులతో నొకరి నొకరు కౌఁగిలించికొనిరి. ఇంద్రుఁడును న్యాయానుసారముగ దానవులంగూడి పురోహితుం డగు

భార్గవునికి నమస్కరించి గురునాజ్ఞ నంది సుధారస మొలుకుసటుల భాషించెను.

ధన్యము నాతపస్సు, జనిధన్యము, వేఁగను లయ్యె ధన్యముల్
ధన్యము నాదుజీవితము తథ్యము తాత యొసంగుదీవెనల్
మాన్యులు నగ్రజుల్ పితృసమానులు నైనవిరోచనాదు ల
న్యోన్యవిశిష్టవత్సలత నొప్పగ నాయెడఁ జూపి యుండుటన్

అన్నలు మీరు రాజ్యము సమస్త మొసంగి మిమున్ భజించితిన్
మిన్నలు భార్గవుల్ గురులు మేటిమహర్షులు వారినెల్ల నే
సన్నుతి సల్పితిన్ మిగుల శాంతుఁడ శాంతుఁడ, నాన వెట్టిరేన్
సన్నకసన్న నయ్యమృతసాధనకై ప్రయతింతు హాయిగన్.

వ. అని భాషించు మరుత్వంతునితో నసురేశ్వరు లిట్లనిరి. ఇంద్రా! నీవట్లు వచింపకుము.

క్రతుశతం బొనరించినఘనుఁడ వీవు
ప్రమధనాధునకున్ దయాస్పదమ వీవ
బాలకుఁడ వైన నింద్ర! నీపట్టువలన
మనకులం బనాకులముగ మనునుగాదె.

వ. నీవు తపం బొనరించుటకై ప్రయత్నించుచుండ స్వర్గరాజ్యము వ్యాకులమందు నని యెంచి నీకు సాయము చేయనెంచియే మేము మీరాజ్యమును పాలించుట.

ఇంతవార మిందఱము మే మిట్టులుండి
పాలన మొనర్చ సీరాజ్యభార మిం వా
కండవే వహియించి, తాఘనత యిట్టి
దని వచింపంగ నెవ్వరికైన వశమె?

అనుమతింతుము పీయూష మాస్వదింప
దానిని విభక్త మొనరించి యాను టొప్పఁ
గాని యవిభాజ్యపద్ధతి నూనరాదు.
ఇదియె మాకు సమ్మతము దేవేంద్ర! వినుము.

వ. కాన వాసుదేవుండు భాషించినటులు పారావారమధనముం గూర్చి సాధనమును నీవే వాకొనుము అని దానవు లడుగ నింద్రుఁడు తాను వినునదెల్ల వచించి యామందరము బెకలించి యుదధిం బడవైచుటకు బలి నుత్సాహపఱచెను.

పిదప నాకొండఁ బెకలించు టెంతపాటి? ముఖమారుతంబున నెగురఁగొట్టెద మొక్క చిట్టమిడి మెట్టిపై చిదము, వామహస్తంబున నెత్తెదము. ఒక్కవాలమ్మున జలనిధిలోనికిం దెచ్చెద మని బలగర్వమున దానవు లరచుచుండ బలి యిట్లనియె అయ్యో! మీరజ్ఞులగుబాలకుల వలెఁ బగ్గెలు గొట్టుచున్నారు.

ఆదిన్ వింశతిబాహులం బెనఁచి యూటాడింపఁ గైలాసమున్
పాదాంగుష్ఠనఖాగ్రియంత్రిణమునన్ భంగింపఁడే శూలి, పెం
పేదన్ వార్షికభేకమై యడఁగి యెంతే నేడ్చె నారావణుం
డో దైత్యుల్! శ్రుతిగోచరార్థ మది కాదో? విస్మృతం బయ్యెనో!

ద్వి॥ సిద్ధులచే మునిశ్రేష్ఠుల చేతఁ
గన్నెత్తి పరికింపఁగాని దాకొండ
శివునికారుణ్యంబు చేకూరకున్న
పెల్లగించుట కెన్ని వేలగుండియలు ?

వ. కాన నిప్పుడు మన మందఱము భగవంతుం డగు నుమాకాంతుని సమీపించి మనోవాక్కాయంబుల ధ్యానించి యాతనియనుగ్రహమునకుం బాత్రులమై యర్థింపఁ దగినదాని నభ్యర్థింత మనెను. బాగున్న దీయుపాయ మని భార్గవాంగిరసులు గొనియాడిరి. అనంతరము దేవాసురు లన్యోన్యము ప్రతిజ్ఞలువట్టి మందరాద్రిం జేరి మనసులు నిగ్రహించి కఠోరతపస్సు నాచరించువారై పరమేశ్వరు నిట్లు స్తుతించిరి.

ప్రలయోద్భిన్న నటత్తృతీయనయనప్రాదుర్భవద్భీకర
జ్వలనప్రోత్థకణప్రదగ్ధ సకలబ్రహ్మాండహా! విని
ర్మల శీతాంశుకళాకిరీట! హర! శర్వా! మేరుకోదండమం
డల! బీభత్సుజయైకహేతుశరదండా! మానమోవాకముల్.

శివముం గోరెద వెల్లలోకములకున్ జేకూర్తు భక్తాళికిన్
శివమున్ నామముచే శివుండవుగదా చిద్రూప! సర్వాత్మతన్
శివముం గోరెడిజంతు వెన్నటికి నేనిన్ నిన్నుఁదక్కన్యునిన్
జవికైనం దలపోయునే శివతరా! శంగా! నమస్కారముల్.

అమృతసిద్ధికి నీకు నిల్లైనమంద
రాద్రి కవ్వము గాఁగ క్షీరాబ్ధి వైవఁ
బూనితిమి, గిరిచాలనం బౌను దీనఁ
గాన ననుమతి నొసఁగు మీశాన! మాకు

వ. అంత మేఘగర్జనము వంటియాకాశభాషితముచే న ట్లొనర్ప వచ్చు ననియనుమతింప దేవదానవులు మురిసి తత్సన్నాహ మొనర్చిరి.

పాదములఁ దన్ని కరములఁ బట్టి యూఁపి
మోఁది బడియలతో బాణములను గ్రువ్వి
యలసి సొలసి విషణ్ణులై రసురు లపుడు
దాని దుర్నిమి త్తం బని తలఁచెఁ గవియు.

వ. అనంతరము దేవాచార్యుండు చరలగ్న కాలం బెఱింగి జగ త్ప్రాణునితో నోయీ నీవు ప్రళయఝంఝాభయంకరరూపమును ధరించి చరించు మని ముదలవెట్టుటయు నాప్రభంజనుండు;

ప్రలయఝంఝానిలము భాతి భయదగతిని
దిగ్విదిక్ప్రదేశములు భేదిల్ల విసరి
యబ్ధిజలములఁ జిమ్ముచు నవనిఁ దడిపి
కుదురు భేదించె మందరకుధరమునకు.

విడివడి మందమందముగ వీఁచెడిగాలుల మేఁత చాలమిన్
బొడ వడఁగన్ వసించుశివుభూషలు నాగులు మందరాద్రి, ని
య్యెడలఁ దదేకధారగ నహీనగతిం దెగవీఁచువాతమున్
గుడిగొని పొట్ట లుబ్బునటు గ్రోలి సుఖించెను బుస్స లెత్తుచున్.

వ. అదృష్టచర మగునామహావాతవేగమును గొనియాడుచు న్నటు లామందరగిరిశిఖరము రవంత యూఁగులాడంజొచ్చె.

కంపము గ్గలె దీని, కనుకంప వెలార్చె మహేశుఁడున్, వృథా
కంపము క్లైబ్యమున్ విడువఁగావలె, లెండిఁక ధైర్యమూని యీ
జంపు లవేల యుంచుఁ బెలుచన్ బలుబొబ్బలు వెట్టికొంచు నై
లింపులు దానవుల్ వడిఁ జలింపఁగఁ జేసిరి తన్నగేంద్రమున్.

మత్త॥ కూలువృక్షము లాకసమ్మున కుద్ధయించెడిపుల్గులున్
దూలి యద్భుతరీతి దొర్లెడిదొడ్డపాషాణకుల్ ఝుళం
ఝుళిఘోషలఁ బాఱు నిర్ఝరజాలముల్ పవనాహతిన్
ఱోలుకందరముల్ గలట్లు జనుల్ కనుంగొని రగ్గిరిన్.

వ. అంత వారు పర్జన్యములవలె గర్జిల్లుచుఁ గార్యము కరగత మైనటు లెంచుచుఁ దూర్పున దిక్పతులను దక్షిణమునఁ గడమ వేల్పులను బడమట వేయిబాహువులు గలపాశిని, నుత్తరమున నితరు లగుమహాసురులను వేఱువేఱుగ నియమించువారై, పరిఘపగిది మందరముచుట్టు త్రివ్వినగోతిలోనుండి పర్వతముక్రిందికిఁ దమహస్తంబులం జొనుపుచుఁ బ్రహరణసాధనములు విడుచుచు, వ్రేళ్ళయంగుళీయకమ్ములఁ దొలఁగించుచు, నడుముల నుత్తరీయముల బిగించుచుఁ, గరకంకణములను భుజకీర్తులవఱకు నెగఁదోయుచు, నివీతముగ వ్రేలుహారాదుల నుపవీతముగఁ దొడుగుచు నొకరి నొకరు మాటిమాటికి హెచ్చరించుకొనుచు 'ఓరీ! చేతులు సరిగఁ గాయుండు. చక్కఁగా లేవనెత్తుండు. ఒక్కసారిగ జాఱనిండు. ఉచ్ఛ్వాసనిశ్వాసము లొక్కసారిగ విడువుండు. మనబలము నొక్కసారిగ వినియోగింతము. లేనిచో దీనిశిఖరములు కూలి మీఁదఁ బడఁగలవు. కొండ యొడ్డగిలంగలదు. ఇందువలనఁ జంద్రశేఖరునిభద్రపీఠము చలించిపోఁగలదు. హిమగిరితనయ భయపడఁగలదు.

ప్రియాధులు క్షోభింపగలరు నందికేశ్వరుండు కోపింపగలఁడు. ఆపరవ
శిపురి జయరంతయానములో నున్నరీతి భద్రముగ మోయవలెను.

అని గంధర్వులు వాదిత్రములు మ్రోయించుచుండఁ, కిన్న
రులు గాధలను గాన మొనర్చుచుండ, దేవవేశ్యలు నాట్యమాడుచుండఁ
జారణగణమ్ములు స్తుతించుచుండ, మహామును లాశీస్సుల వర్షించు
చుండ, వలాహక మేఘములు పుష్పవర్షము కురియించుచుండ, హర
హర మహాదేవ శంభో!! అను కేకలచే దిక్కులు పిక్కటిల్ల నామందర
గిరి నువ్వెత్తుగ నెత్తిరి.

ఆపాతాలనిమగ్నమూలము భుజంగాధీశపౌధాగ్రశృం
గాపమ్యం బగుమందరాద్రి నటులొయ్యం ద్రివ్వ నందుండి తా
రేపుల్ నూవుచు నాడునాగతరుణీహేలావిలాసోల్లస
ద్రాపంబుల్ గననయ్యె ఖేచరుల కెంతో ప్రీతి సంధింపఁగన్.

ముదమున నందరాగము సమూలముగాఁ బెకలించివేయు న
య్యదటు సువర్ణశైలమున కై యది కొంచెము వ్రాలె, నంతలో
ద్రిదశపురోచ్చ సౌధము లుదీర్ణ విటంకములున్ బ్రిభిత్తికల్
గుదు రగుగుల్లగోపురములున్ దెగఁగూలెను దుప్పదుప్పనన్.

వ పాతాలమువఱకు దిగియున్నమందరమును దేవాసురులు వ
మొక్కనువలెఁ బెల్లగించి క్షీరాబ్ధికిఁ బయన మైరి. దానిశిఖరములు
చెదరకుండ, నితంబము కదలకుండ, గండోపలంబులు జారకుండ, వా
గులు తొనఁకకుండ, దరులు కూలకుండ, మహీరుహంబులు పెల్లగి

కుండ, గుల్మినులు కూలిపోకుండ, మృగములు చలింపకుండఁ, బక్షులుడ్డయింపకుండ, పాములు భంగపడకుండఁ, గిన్నరీగాన మాఁగిపోకుండ, సిద్ధచారణులకోలాహలములు నిలిచిపోకుండ, గంధర్వులయాతోద్యము లాఁగిపోకుండఁ, దపోధనులకు ధ్యానవిఘ్నము వాటిల్లకుండఁ, బరమేశ్వరు నానందపఱుచుచు, మందరమును మోసిరి.

అగ్గిరి సురాసురులచే మోయఁబడుచు సమస్తజగదాధారుండైన పశుపతికిఁ దా నాధార మైతిననుగర్వంబునంబోలె మిగిలినపర్వతశిఖరములను దనపాదముల నాక్రమించె. నలుకెలంకులకుఁ బాఱునిర్ఝరులమిషమ్మునఁ దననిర్మలకీర్తులను దృగ్గోచరము లగునట్లుగా దిశాముఖమ్ములకు విరజిమ్ముచుండె.

ఆమందరము నాకాశమార్గముగఁ గొంపోవుచుండ దాని క్రిందితలములం దచటనచటఁ దపం బొనరించువాచంయములు మిగుల దిగులుగొనుచు శుభాశంసల నొనర్చుచు, నవగ్రహమంత్రములం బఠించుచు, నభయంకరమంత్రముల జపించుచు, నమృతమృత్యుంజయుండు నాపదుద్ధరణుం డగునంబికాజానిం ధ్యానించుచు, బలాతిబలవిద్యలచే దేవాసురులకు శ్రమ కలుగకుండవలె నని కోరుచుండిరి. అగ్గిరియందలి దీప్తిమంతంబు లగుమణులనడుమఁ జిక్కికొని భాస్కరుండు కాంతివిహీనుండై వాని గొప్పవెలుఁగులలోఁదా నొక్కపగటిదీపమై మిణుకు మిణుకు మనుచుండెను.

తనప్రాణవల్లభుతోపాటు సుఖతరముగఁ గొంపోఁబడుచు సుందరప్రదేశంబుల గాంచుచుఁ వివిధవస్తుజాతంబుంగూర్చి తనమనోహరుని బృచ్ఛించుచు, మందరాద్రిని దనయనుజుం డగుమైనాకు నింట నిలుపనున్న దేవదానవులను దయామయి కాత్యాయిని దీవించెను.

జక్కలై యున్న నీశిఖరి జెప్పఁగఁ బర్వుచు నొక్కమాటలోఁ,
జక్కఁగ నుంగదా యని బుజంబుల మోయుచు మందరాగమున్
గ్రక్కున బాధ సెందు దితిజుల్ సురలున్ నడుదారి, గట్లకున్
జక్కలు సెక్కనిందు నిగుడించి గొణంగిరి విప్రలాపముల్.

గ్రక్కదలింప నేరక పొకాలెను దీని దశాననుండు నాఁ
డక్కట! శక్య మౌనె మన కంచు నుతించిరి కొంద ఱుత్తముల్;
నెక్కొని కొండలెల్లఁ బెకలించి మహాబ్ధిని మున్ను వానరుల్
గ్రక్కున ముంచరే? యిటఁ బొగడ్త లవేటి కటండ్రు కొందఱున్.

వ. ఇట్లు మహాభారమున వంగి దేవదానవులు మిక్కిలి శ్రమపైఁ బాలకడలిం జేరిరి. అద్దానిం గాంచి యచటి శ్వేతద్వీపవాసులలోఁ బెద్ద కోలాహలంబు చెలరేఁగె. అదిగో! ఆమందరాద్రిని, ఆ దేవతలను, రాక్షసులను గాంచుఁడు. దాని నిచ్చోటనే యబ్ధిం బడవైతురఁట. ఈద్వీపమును బూర్తిగ నిప్పుడీమహాబ్ధి ముంచెత్తివేయుంగలదు కానఁ దొందరగ నందఱును సిద్ధపడుఁడు. లెండు. ఈద్వీపముచుట్టుగట్టు నెత్తుచేయుండు. అనియు —

అయ్యో! యెవండురా యీబకబంధనోపాయంబుపదేశించిన వాఁడు? ఈమహాబ్ధి యేపాటి యుప్పొంగినను నీగట్టులుం బుట్టలు నాఁగునా? కాన మన మిప్పుడే సూర్యమండలంబునుగాని వైకుంఠమును గాని యారోహింతము. లేకున్న బ్రతుకులు లేవనియు —

ఎంతనీచ మైనయాలోచనమిది? సేవకులు భగవంతునివిడిచి వేఱొకచోటికిం బోవ ధర్మంబె? అనియు, దేవుని విడుచుటయా? ఆ

పరమపురుషుఁడే మందరాద్రిపాతముం గాంచవలె ననుకోరికతో బయలు దేఁ రున్నాఁడు. అనియు—

ఎన్నిసారు లీమందగిరి పడలేదు? ఎన్నెన్నియుగశరములం దీసముద్ర ముప్పొంగలేదు? మన మేబ్రహ్మకల్పంబునందైనఁ బరస్థల నివాస మెఱుంగుదుమె? ఓహో! యీనాఁటి భక్త శేఖరులవలన నిట్టి చిక్కులు గలుగుచున్నవి. అనియు—

కానిండు కానిండు. భూలోకమందలి శార్ఙపాణినెలవులగు జగన్నాథాది క్షేత్రములందు నదులు సంద్రములు మీవంటిభాగవతుల నెందఱెందఱిని ముంచలేదు. కాన మీరును నిచటనే యుండుఁడు. సము ద్రమునో మెఱుంగని మావంటినూతను లాత్మరక్షణ మొనర్చుకొను చు, గోవిందునే తలంచుచు, వేఱొకచోట నుందుము. అనియు—

వివదించువారై మాటిమాటికిఁ దల లెత్తి గాంచుచు, వచ్చు చున్నవైమానికుల నడుగుచు, మహాకోలాహలంబున నెల్లెడలఁ దిరుగు పారిషదులలో నగ్రణి యగువిష్వక్సేనుఁడు కోపించి వెలుపలికి వచ్చి నలుమూలలు పరికించుచు, మందరపాతసమయము సమీపించె నను కొనుచు సర్వజ్ఞుఁ డైనయావిశ్వంభరునికి స్వధర్మనిర్వహణార్థమై యీ వృత్తాంత మెఱిఁగించెను.

బంగరుకట్టుపుట్ట మొకభంగిఁ దొలంగఁగఁ గంఠహారమై
రంగగుమాల జాఱఁగ నురస్థలి కౌస్తుభ మొత్తగిల్లఁగాఁ
జంగున వెండికొండకొన జాఱెడినల్లనిమేఘమట్లు నీ
లాంగుఁడు మాధవుండు దిగె నత్యవదాత మనంతతల్పమున్.

చక్కఁగ వంగి వంగి పరిచర్య లొనర్చెడియాయుధాళితోఁ
జిక్కని బత్తితో నిలిచి చేతులు మోడ్చుతపోధనాళితో
నక్కడ నున్న యాగరుడిహస్తము లూఁతగ విశ్వనాథుఁడున్
బ్రక్కలు గాంచుచున్ నడచెఁ బారిషదాగ్రణి దారి చూఁపఁగన్.

వ. అదాటున బయలు వెడలినయరవిందనాభుని మార్గమధ్యమునఁ బరమేష్ఠి కలసి వివిక్తప్రదేశమందు సేవించుమహాభాగ్య మబ్బిన దని విస్మయానందభరితుండై మందరాద్రిని నెట్టెడి ముచ్చటను గాంచు నాహారిని మునులతోఁ బరివేష్టించి యుండెను.

నలినదళాక్షునిన్ నలిననాభుని నాద్యుని దత్త్వరూపు, ను
త్పలనిభదేహు, సుందరు నుదారు మనోహరుఁ గాంచి, ధైర్యసం
కలన సురల్ మనంబులను గార్యభరంబును వీడి రందఱున్
దలఁగిరి శైలభారము నుదగ్రత సంద్రముపా లొనర్చుచున్.

అమరుల్ దైత్యులు మందరాద్రి నటు త్రోయన్ శైలమూలస్థలా
క్రమగండోపల ఘాతసంక్షుభితపారావార తారధ్వనుల్
భ్రమ దత్యుగ్రతిమింగిలప్రకర వాలాఘాతసంజాత దు
ర్దమభీతావహశబ్దముల్ పెనఁగి యభ్రస్ఫూర్తి నిండారఁగన్.

పటుగిరిమజ్జనోచ్చల దభంగతరంగ మహోఘుమంఘుమా
ర్భటులకుఁ గూర్మనక్రగజరాజులు ఘూర్ణిలి మొత్తి లెత్తఁగా
స్ఫుటితచతుర్ముఖాండచయభూరిరవం బని భీతి దేవతల్
చటులవిలాపముల్ సలుప శౌరి హసించె నిజం బెఱుంచున్.

మొనసి దుగ్ధాబ్ధి నడుగంట మునుఁగఁ గాఁబు
నాఁగికింద్రిముమణిదీప్తు లలమికొనఁగ
మించి లికుచామలకములమితిని దుబ్బ్లు
పాలమక్కలై రిక్కలై పట్టె నభము.

మందర మూనుదైత్యసురమండలి మూఁపులు నొవ్వ పుట్ట, వా
రందఱు దారి నాఁగుచు మహార్తి భుజంబుల నెందుమార్చిరో
యందు జలస్థలంబుల ననంతమణిప్రకరంబు దుల్లుటన్
బొందుగ రత్నవత్ఖనులు పొల్చె నటంచుఁ దలంతు నెమ్మదిన్.

వ. మఱియు మిగుల నెత్తునుండి యగ్గిరి బడుటంబట్టి ప్రక్కల నున్ననీరము కొంత చెదరి కొంతదరీముఖములఁ బీల్చివేయఁగా సముద్రము వట్టిపోయిన ట్లుండె నని దేవదానవులు భయపడిరి. ఆపర్వత మూలములతాఁకుడువలన జలజంతువులు నలఁగి మరణింప నగ్గిరినుండి జారి యుదధిం బడినయేనుంగులే నీటియేనుంగులును, బోయలు జలమానవులును, సెలయేటిమత్స్యములే తిమితిమింగిలములును నై యొప్పెను.

మఱియు మందరము పాతాలముం బ్రవేశింప దరికి వచ్చిన పాలను గ్రహించి నంది మున్నగువా రీశ్వరలింగమును సంతోషముగ నభిషేకించుచుండిరి. స్వర్గమువఱకుఁ జింది, పైకి వచ్చినపాలు కలియుటచే సిద్ధనదియు దుగ్ధనది యయ్యె. మధురక్షీరములం దడుపఁబడి నందనోద్యానవృక్షంబు లానాఁటినుండియు మధురఫలంబులనే ఫలించుచుండెను.

మునుగంబాఱెడి మందరోదరదరీమూలంబులం జొచ్చి భీషణఘోషంబున సుళ్ళు చుట్టు జలవిస్తారంబుచే నబ్ధియున్ తనువుల్ డయ్యఁగ భిన్నభావమున సంస్తంభించి స్తోత్రాళి సల్పను బాల్పడ్డసురాళియున్ హరికి వేళం గూర్చె నానందమున్.

మునిఁగినచో మందరగిరి
మునుఁగును మాకుల మటంచు మొఱలిడి విబుధుల్
వనరిరి శరణము శరణం
బని యావైకుంఠునిన్ మురారి ముకుందున్.

వ. ఇట్లు భయభ్రాంతు లగు దేవాసురులు నారాయణుని స్తుతించుచుండ, నతఁడు దయామయుంబులైన వీక్షణంబుల ననుగ్రహించి కల్పవృక్షకిసలయముంబోలి మోక్షలక్ష్మీనివాస మగు కరారవిందమున వారి నూరడిల్లఁజేసె. వెంబడినే భూభారము వహించుటకతన భుగ్నమైన భుజంగపుంగవుని పడగవలె విశాలమై, వజ్రాయుధమువలెఁ గఠినమై, శాణోల్లీఢమైన వజ్రఫలకమువలె నున్ననై, సమస్తలోకాత్మకమైనను బదివేలయోజనముల విస్తారము గలచరమాంగముతోడను, వ్యాసభగవానుఁడు సంక్షేపించిన వేదము లనెడినాలుగుపాదములతోడను, చాఁగుటయు ముణుంగుటయు స్వభావమ్ముగాఁ గలమాయవంటి మెడతోడను, వేదమస్తకమువంటి పరమాద్భుత మగుమస్తకముతోడను, భూగర్భము నుండి పుట్టి ధనుర్విముక్త మగుబాణమ్ముకరణి నొకమహాకమఠము పైకి వచ్చిపడెను.

పైకి నువ్వెత్తుగాఁ, దేలుభవ్యకమఠ
కర్కశకఠోరపశ్చిమాంగంబు తగుల
బల్లిదుఁడు విసరినతాయిపగిదిఁ గొండ
శిథిలమూలమై దవ్వుగఁ జెదరి పడియె.

వెడలంగ్రిక్కిననీటఁ దద్దుహాలు వేవేల్ శూన్యగర్భంబులై
తడిగాలుల్ వెలిఁబుచ్చ నగ్గిరి నితాంతం బైనయాయాసమున్
బడుచు న్నక్కిరిబిక్కిరింగొనుచు మున్గం దేలఁగా లేసి రా
యిడి నీటం బడియున్నవానివలె నెంతేనొప్పె నప్పట్టునన్.

వ. ఆయుబ్బురముం గాంచి దేవతలానందతుందిలులై బ్రతికిపోయితిమి. ఈయనుగ్రహమువలనఁ గృతార్థులము. ఈమీఁదఁ జేయవలసినదేమని గరుడధ్వజు నడుగుచుండ సమీపమున నున్నపరమేష్ఠి వాసుకిని గొనిరం డని శాసించెను. అతనిశాసనము నంగీకరించి దేవత లీవలకు వచ్చి యేకగ్రామవాసులైనమీరే యావాసుకిని మచ్చికచేసి తేవలెనని రాక్షసులం గోరిరి.

చెలఁగి పాతాళమందు వసించుచున్న
యాలుబిడ్డల ముందె తా నరయఁగోరు
దనుజసంఘము మందరోద్ధరణవివర
సరణినిం బట్టి చేరె హర్షంబు గదుర.

వ. దానవులట్లు చేరి యువ్వెత్తుగఁ బెల్లగింపంబడినమందరకందరములనుండి జారిపడి మూర్ఛిలి యున్నపన్నగుల శుశ్రూషించుతద్బంధు

జనము గలిగి, సంద్రమున మునింగినమందరము తాఁకుడువలన నలఁగి యాక్రందించు నతలవితలాదిలోక ప్రజల నోదార్ప వచ్చినజానపదజనులు గలిగి, శరవేగమునఁ బైకి వచ్చిపడు నాదికచ్ఛపముకఠినపృష్ఠసంఘట్ట నంబునఁ బగిలి కూలుగండోపలంబులనుండి పుట్టుభయంకరస్ఫులింగంబు లచే దందహ్యమానంబు లగునగరగ్రామపల్లీనివేశంబులు గలిగి, తెఱపి లేనియుత్పాతములు కనంబడుచుండుటవలన భూమి తమమీఁదఁ గూలి పోవునేమో? మేరువు చలించునేమో ? బ్రహ్మాండకపాలము పగులు నేమో ? పారావారము పాతాళమునఁ బ్రవేశించునేమో ? శేషుఁ డీ భువనభారమును బరిత్యజించునేమో? యని భయమందుజనుల కింవదం తులతో నిబిడ మైనరసాతలముం గాంచిరి.

దానవులు వాసుకిం డగ్గఱి యథోచితగౌరవము లంది సము ద్రమథనవృత్తాంతముం జెప్పి నీవు మందరమునకుఁ ద్రాడుగ నుండవలె నని మెల్లఁగ నెఱిఁగించిరి. దాని కాతఁ డనుమోదించి చిఱునవ్వుతో ని ట్లనెను. అన్నదమ్ములయభ్యుదయ మీనాఁటికి నేను వినగలిగితిని. దైతేయు లాదితేయులతో నేకీభవించి కోరికను సాధించికొనుచుండ న న్నడుగకున్నను సోదరుల మగుమేము తోడ్పడవలసినదే. మీ రడిగి నపుడు గూడ వెనుదీయవలెనా ? దీనికి మీ రింతగఁ గోరవలెనా ? కాని;

వాలముచే మొదల్ శిఖరభాగమునుం దలచే బిగించి యా
శూలి సుమేరుశైలమునఁ జుట్టి ననుం దెగలాగ మున్ను, ద
త్కాలవిభగ్నశల్యగురుదర్పుఁడ నై శిథిలప్రసంధిబం
ధాలసకాస జృంభణుఁడ నై పడియుంటిని స్వేచ్ఛ దక్కితిన్.

చుట్టలు సుట్టి పండుకొనఁ జొప్పడ దేమృదుతల్ప మైన జా
చట్టునఁ బండిన ట్లగు, నిజంబుగ భోగము విప్పఁజాల నే
నెట్టులు చుట్ట నేర్చెద నహీనమహాతరుగుల్మకూట సం
ఘట్టితశైలరాజము నికామజరాశిథిలాంగకమ్ములన్.

వ. కాన నన్నిపుడు కొంచెమనుగ్రహించి విడిచి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, శంఖచూడుఁడు, గుళికుఁడు, ఐరావతుఁడు, పద్మముఖుఁడు మున్నగుయువనాగులను గొనిపొండు. శ్రమను లెక్కింపని శేషునైనఁ గొనిపొండు. అని వాసుకి పలికినఁ దిరిగి దానవు లిట్లనిరి.

ఘాతుకు లల్పజీవులకు, గర్హితు లే మొనరింత్రు వారు? వి
ఖ్యాతుని శేషునిం బిలువుఁ డంటివి తథ్యము మంచిమాట; య
త్యాతతభూభరోద్వహనమం దతఁ డుండుట తెల్లమింక ని
న్నాతఁడె యుంచు, శేషుఁడ వటంచును, వేఁడుట సుమ్ము వాసుకీ.

మణివలె నింతకొండయును మాకరకర్షణ సన్నగిల్లదే!
కునుకులుపోవ నిన్ను నటకుం దగ మోఁచుకపోమె హాయిగా
ననువునఁ జుట్టి యుల్లసన మబ్బునటుల్ నిను బట్టి లాగమే
యనుమతి నిమ్ము లెమ్ము యశ మందుము మావెను వెంట రమ్మిఁకన్.

వ. విశేషించి పలుక నేల ? మేము నీగృహంబున కెదురుగ నివసించువారము. చిరతరసాహచర్యమువలన మాహృదయములు నీకుఁ బరిచితపూర్వములు. కాన నిండలితత్త్వమును గ్రహింపుము.

మందరవర్ధితాజగరమాలికఁ దట్టుచుఁ ద్రిప్పవచ్చు, మీ
మందర మెక్కఁబెట్టునను హస్తము లానుచుఁ ద్రిచ్చవచ్చుఁ,ద్రి
ప్పందగు లావుపగ్గములఁ బట్టియు, నొల్కన దేమి మాకు? నీ
యందము రాదు కీర్తికరమా నిది నీ కని విన్నవించుటల్.

వ. అని దానవులు ప్రార్థింప భుజగపతి సమాధానము చెప్ప నేరక యెట్టకేల కియ్యకొని యొకచుట్టు విప్పి పడగ నెత్తునంత సముద్ర మథనక్షోభమువలనఁ గూలు ననిభయపడుభూమిని దృఢముగ నిలుపుటకై నలువ నిలిపిన వజ్రస్తంభమువలె నుండె. పదపడి పయనింపుఁ డనిదానవుల నాదేశించి మందరమును బెల్లగించిన బిలమార్గముఖముగ ముఖంబు చాఁచి భూభారవహాన మొనర్చుభగవత్స్వరూపుఁడగు శేషుని యనుమతి నంది తత్కాదు లనుమతింపఁ దనదేహావలయముల నొక్కొక్కటిగ విప్ప నారంభించెను.

వడి నయాచితముగ బిలాధ్వమున వెడలు
భూపరీమళయుత వాతపోతములను
గ్రోలి యాకంఠముగ ఫణీంద్రాళి మొదటి
యావసథమందె సౌఖ్యము నందుకొనియె.

వ. అనంతరము ప్రపాతమ్ముకరణి చదునైనయాబిలద్వారము నందుఁ బ్రయత్నపూర్వకంబుగఁ బదియోజనములమెట్ట నెగఁబ్రాకి నూఱుయోజనములపల్లము దిగఁబ్రాకి మరల నెక్కుచు నిమ్నోన్నతములఁ గాంచుచుఁ బుస్సలు గొట్టుచు శ్రమ చెందినంత హస్తాలంబనమిష చేతను బరిఘతోమరప్రాసాద్యాయుధములతోను సోపానములు

నిర్మించినట్లుగ నాకర్షించుచు రాక్షసు లామహానాగంబును దోడిసర్ప
రాజములను భూలోకమునకుం దెచ్చిరి.

బలిసద్మంబుననుండి మేరుచరణవ్యాప్తాయతంబై శ్రమా
కలితం బై పడియున్న వాసుకిమహాంగం బుజ్జ్వలం బద్ధ భూ
వలయోన్మూలితశిష్టపాదతల మై వర్తిల్లునామందరా
చలమూలం బన దేవదానవులకున్ సాక్షాత్కరించెం గడున్.

వ. అట్లు సేదలుదేరినవాసుకిని దానవులు వీక్షించి నగనగర గ్రామములతో నదీనదములతో దంతుర మగుభూమార్గమున మిగుల జాగగు నని తెలిపి యాతనియనుమతిం బడసి ఫణము మొదలు తోఁక వఱకున్న యాతనిదేహమును దమహస్తముల నూఁది యెత్తి బుజంబులఁ బూన్చుచు, మిగిలినమహోరగంబులను వ్రేళ్ళతో గోళీలనువలెఁ బాదముల కందెలవలెఁ జేతులకుఁ గంకణములవలె మొలలకుం గాంచికలవలె మెడలకు హారములు పగిది సవిలాసముగఁ దాల్చుచు నంతరిక్షమార్గమునఁ బయనమై దుగ్ధాబ్ధిం జేరిరి.

దనుజభుజలగ్న మై యాతతంబు నైన
భుజగపుంగవుకాయ మబ్బురము గొలుప
హైమగిరికూటములనుండి యవతరించు
గంగనాఁ గాంచి రా దేవగణము లెలమి.

వ. అట్లు మిగుల శ్రమచెంది యుచ్ఛ్వాసనిశ్శ్వాసంబులవలన నుబ్బుచు సన్నగిల్లుచు శరకాండమువలెఁ దెల్ల నగునాతని దేహమును బాలసంద్రమును నింపవచ్చి యుత్తుంగతరంగసంకులంబై స్తబ్ధమగు గంగానదిగా దేవదానవులు వీక్షించిరి.

గాలిని గ్రోలి గ్రోలి తనకాయము పెంచెడియాఫణీంద్రునిం
జాలగ మోఁచి మోఁచి భుజసంధులు దెళ్ళఁగ దానవాళి యా
వేళ సహాయముం జలుపువేడుకతో నెదురైనదేవతా
పాళినిఁ గూడి విష్ణుపదపంకజసన్నిధి దింపి రాతనిన్.

భరశిథిలాంసఖేదమును బాయఁగఁబెట్టఁగ నంగకమ్ములన్
బోరిఁబోరిఁ జాచుచున్ విదుర్చుచుపోటరు లౌపాలదిండ్లమేనులన్
కరచరణోదరాంగుళి శిఖాభుజకంఠములందునుండి చె
చ్చెర నొకకొన్నినాగులు విచిత్రముగా భువిఁగూలె దండడిన్.

బుజము కలియనియసురకుబ్జులును, నున్న
తులును నొవఁగ వసివాఁడి యలసి యున్న
వాసుకిశ్రమమ్ము తొలఁగ దేవతలు దితిజు
లల్లనన్ వీఁచు తాళవృంతానిలముల.

మందరాపాతవేగనిర్మథ్యమాన
దుగ్ధపాథోధిలహరికోద్భూతము లగు
నమృతశీకరముల సాంద్రమైనగాలిఁ
గ్రోలుకొని వాసుకి పరున్ ముకుందుఁ గాంచె.

వ. కాంచి వాసుకి తనఫణామణిదీప్తుల నీరాజనంబు లొసంగి యరవిందనాభునిపాదారవిందములం దనహృదయారవిందంబుల నర్చించి యిట్లనియె. స్వామీ! నేను శేషాహికరణి వైయాకరణిం గాను. పద్మనాగమువలెఁ బాంచరాత్రాగమమున నేర్పు లేనివాఁడ. కంబలాశ్వతర

భుజంగపుంగవులకు రణి గాంధర్వవిద్యయందుఁ బరిచితుఁడంగాను. నేను మేరుకోదండునకు మౌర్వినై యాతనిశరసంధానావసరమునలబ్ధమైన భవచ్చరణవిన్యాసభాగ్యము నే నాయంతఃకరణమున ధ్యానించువాఁడనై నీ శాసనమును బాలించుచు నీయాజ్ఞాకరణము నపేక్షించువాఁడనై త్వదధీనుండనై యుండుదు. మరియు,

మధునిషూదనచరణాబ్జమగ్నబుద్ధి
గలిగి వర్తిల్లుచో షడంగము లవేల?
తంత్రము లవేల వివిధమంత్రము లవేల?
భాసురాష్టాదశపురాణ పఠనమేల?

వ. అని స్తుతింప నిందిరారమణుండు వాసుకితో ని ట్లనెను. వత్స! వాసుకి! నీవి ట్లనం బనిలేదు. నీభక్తితత్త్వం బెఱింగియే నీకు బాతాళలోకాధిపత్యం బొసంగితి. కాన నిప్పుడు మహేశ్వర ధనుస్సునకు మౌర్వివై గడించినయశంబు మాహేశ్వరం బగునీశైలంబుం బ్రదక్షిణించి వృద్ధి పొందించికొమ్ము. ఇది మన్నియోగము.

దివ్యతేజోబలంబు సంధించి నీకు
శ్రమము తొలఁగ నొనర్తు నిశ్చయము వినుము
మందరాద్రిని జుట్టుకొమ్మా మహాత్మ!
దేవదానవుల్ నిను బట్టి తిగుచువారు.

వ. అని వాసుకి యిందిరారమణు వరమంది సురాసురుల నానందమగ్నుల నొనర్చుచు వైమానికులు సూచుచుండ వేగముగ నేగి తన దేహమును మందరాగమునకుఁ బెనచెను.

నీ ల క ం ఠ వి జ య ము

వాసవాదిసురాసురవర్యులెల్ల
రాజనార్ధను భగవాను నంజలించి
సింహనాదముల్ సంస్తుతుల్ చెలఁగుచుండ
నుదధిని మధింపఁ జేపట్టి కదలిరపుడు.

ఇది:— శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూరిగృహనామకపవిత్ర,
పెదశేషయార్యశేషమాంబాద్వితీయపుత్ర,
మహాగాయత్రీశరణ్యా, గురువేంకటరమణకారుణ్యా,
సూర్యనారాయణశాస్త్రిప్రణీతం బైన
ఆంధ్రనీలకంఠవిజయచంపూ మహాకావ్యంబున
తృతీయాశ్వాసము, సంపూర్ణము.

# నీలకంఠ విజయము

## చతుర్థాశ్వాసము.



జలధిలోనిమందరగిరి మొలకు రెండు
చుట్టలం జుట్టి వాసుకి దిట్టముగను
దేవదానవుల్ పట్టి మధించుకొఱకు
నసిగఁ దలఁదోఁక యోజనశతము మిగిలె.

వ. తదనంతరము పూర్వజులు వాసుకి పూర్వకాయమును నవరజు లవరకాయమును బరిగ్రహింపవలెనని దానవులు తగవులాడఁగమలాక్షుకనుసన్నన బ్రహ్మయు నట్లొనర్ప ముదలవెట్ట దేవత లుత్సహించి శిరోభాగమును రక్కసులకు విడిచి వాలభాగమును దాము పట్టిరి.

అప్పుడు క్షీరసాగరమున దిర్దిరందిరుగు మందరాద్రిమూలశిలలరాపిడిచే హాయిగ గోఁకినటు లుండ నిదురించుకమఠపతి నిట్టూర్పుగాలుల వలనఁ బవనాశనులు వసించు పాతాళమునకు దుర్భిక్షంబు దొలంగెను.

మిన్నంట నుప్పొంగుక్షీరాబ్ధితరంగములకలయికచే జలార్ణవంబు మిగులఁ దెల్లంబడెను. లోఁతుగఁ దిరుగుసుడిగుండములంబడి పరిభ్రమించుతిమితిమింగిలములు క్షుద్రమీనంబుల మ్రింగి జీర్ణము కాని వాని నుమియుచుండెను. ఉన్నతగిరిశిఖరములనుండి జాలునిర్ఝరజలము వ్రేత్తుగఁ బడి ప్రవహించుటవలనఁ జక్రవాళపర్వతశిలలు ధవళతరములై ప్రక్షాళితము లగుచుండె. మథనరభసమువలనం బుట్టినమనశ్శిలాదిధాతురాగము హాలాహలోపప్లవసూచక మైనయకాలసంధ్యారా

ంము గల్పించుచుండెను. తుళ్ళింతలోను దుగ్ధపాథస్తరంగశీకరము(లు) వాస్వాదించి స్రుక్కిపడిన వాసుకి దేహాద్రిఘర్షణసంవేగమువలన సురాసురసంఘములు లొట్టగిల్లుచుండ విరించి వారినెల్ల సరిదిద్దుచుండె. గండోపలంబుల యొఱయికవలన నుభయ పార్శ్వములనుండి యగ్నిజాలు తెల్లనగు వాసుకిమేని కుబుసంబులను బరిధానములుగఁ దాల్చ నుండడినొనర్చుచుఁ బ్రమథగణము లహమహమికం బర్వు లెత్తుచుండె.

అత్యాయాసపరిశ్రాంతుండై సహస్రవృద్ధగు వాసుకినోటి నుండి జాఱుచు విషానలజ్వాలికల వెలిగ్రక్కు లాలాజలధారలు పుట్టఁ బోవు హాలాహలంబునకు బీజావాపం బొనర్చెను. తననెల వగు మందరము భ్రమించుటవలనఁ బార్వతీసతి భయంపడి యయత్నముగ శివుని గవుంగిలింపఁ దదానందాతిరేకంబున మహాదేవుఁ డుప్పొంగుచుండ నందు మహాతపస్సులు వృద్ధినొందుచుండె.

లోఁతైనసముద్రావర్తగర్తములనుండి పాతాళవాసుల పరిస్థితులు కన్నులఁ గట్టుచుండఁ దమనెలవులు సురక్షితముగ నున్నటు లెఱింగి తక్షకాదులు సంతస మందుచు సేవించుచుండఁ దత్సేవలకు సర్పరాజు సంతసించుచుండెను. ఈపరిస్థితులు చూచువారల కద్భుతకరములై వినువారలకు మహాద్భుతాపాదకరములై, బృహస్పతి కేనివాచామగోచరములై కావ్యునకేని కావ్యశతముల వర్ణింపరానివై యుండె.

సనకసనందనాదులుఁగూడ నిర్వికల్పసమాధి విడిచి ఱెప్ప వేయక యావింతను గాంచుచుండిరి. ఇట్లమృతలాభాధృతివలన నాయాసపడు దేవతలు దేహశ్రమమును లెక్కింపక సముద్రమథన మొనర్చుచుండఁ దత్సంరంభంబు గాంచి గోవిందుం డానందించెను.

తిఱుగుటచేత సంధుల శ్లథం బగునగ్గిరినుండి జాఱుని
ర్ఝరములు తోఁచె నయ్యెడ నిరంతరతద్భ్రమణశ్రమంబునన్
బిరబిర నబ్ధినీరుఁ దెగఁ బీల్చి యుండక నోట ముక్కునం
దరముగఁ గ్రక్కుచున్నటు ముదంపడి చూడఁగ సిద్ధచారణుల్.

భోగిరాడ్విషనిశ్వాసపూత్కృతులకు
బుగ్గిబూడిద కాఁగఁ గర్బురగణంబు
భావికార్యము తేలికపఱుచు నుండె
ననుచు లోలోన మురిసి రయ్యమరవరులు.

వ. ఇట్లు మహోత్సాహ మొదవ మథించు దేవాసురులశక్తి సన్నగిల్లుట త్రివిక్రముండు సన్నకసన్నం గనుచు వాసుకిని వారలను దనదివ్యబలదానమునఁ బ్రోత్సహించువాఁడై తానుగూడఁ దత్కార్య మందుఁ బాలుకొనెను.

తనభుజంబుల వడిని మాధవుఁడు ద్రిప్ప
బొంగరములీల భ్రమియించె భూధరమ్ము.
మునులు యోగులు దనమాయ మునిఁగి దిరుగ
నబ్బురమె మట్టికొండ యిట్లల్లలాడ ?

వ. అంతలో మందరగిరికాననములందలి తరుజాలపుష్పపరాగ సంపర్కంబు నందినరీతి దిక్కులు ధూసరంబు లయ్యె. విదళితములై నిర్గలితము లైనవాసుకిఫణామణులకరణిఁ బ్రతికూల సూర్యు లుదయించిరి. లోకములకు సంభవించిన యీయకాండప్రలయమును దయామయుం డగుమహేశ్వరుండు గనుంగొనలేక కన్నులు మూసికొనె

నన్నటులు సూర్యచంద్రులు వియత్పథమ్మునఁ బ్రకాశింపరైరి. గ్రి కాననద్వీపంబులతో నిబిడ మగునీభూతలము గ్రక్కదలుటచేఁ జలించు సుమేరుశిఖరతలమునందలి సురరాజనగరప్రాసాదదీపికలవలె రిక్కలెల్ల టను రాలఁజొచ్చెను.

బ్రహ్మాండభాండంబు పగులునట్టులు మహా
నిర్ఘాతఘోషముల్ నింగిఁ జెలఁగ
ధూమకేతూపకేతువులు మహోత్పాత
సూచకంబుగ నింగి నేఁచి పెనఁగ
గుండెలు పగిలి యుద్దండతఁ గ్రిందిఁచు
దిగ్గజార్భటులు పెల్లగ్గలించె
గిరులు శృంగములు గిర్గిర తిర్గి వనధిలో
గుభిలుగుభిల్లునఁ గూలుచుండె

ఎగురుశ్యేనకంకములుఁ బెల్లేర్చుచిమ్మ
చీకటులు సుడిగాలులుఁ జెలఁగి విసరె
విశ్వమునకు మృత్యుముఖప్రవేశమేమొ
యనఁగ సర్వేళ బీభత్సమై యొసంగె.

వ. పిదప నుద్భవింపఁబోవు కాలకూటోష్మకలనఁ గళపెళ ను ఉఁగి పాథోధినుండి తుళ్ళుక్షీరకణజాలము లెచ్చటెచ్చటఁ బడెనో యచటికొండలెల్లఁ బిండి యయ్యె. మహామహీరుహములు లొక్కుమ్మడి భగ్గు మనియె. పశుపక్ష్యాదులు వినష్టంబు లయ్యె. మున్నే జలరా లోనిజంతువులెల్లఁ జచ్చి తెప్పునఁ దేలి తెట్టెలుగట్టె.

ఖేలోల్లోలితవిస్ఫులింగ జటిలాగ్నిప్రోజ్జ్వల జ్వాలికా
మాలాభంగ విటంకసంకలిత ధూమస్తోమభీమంబుగా
కాలాభీలకరాళ వక్త్రకుహరోద్గచ్ఛన్మహాభీకర
జ్వాలాజాల మహాట్టహాసరుచితో సాఁగెన్ మహావాతముల్.

తనదుగర్జనభర్జనతర్జనముల
భూతసంఘాతఘాతప్రభూతపాప
మలమికొన, దాని మాఁపుకోఁదలఁచియేమొ
కాలకూటము సింధువున్ గవిసె నపుడు.

వ. తదనంతరము దానిచే నాక్రమింపఁబడి సప్తసముద్రములును నేఁడు నేతిబొట్టులకరణి భగ్గురని మండినవి. దానియూష్మము భరింపఁజాలక జీవరాసులెల్లఁ బీనుంగుబెంటలై బుగ్గిం గలసె. ప్రజ్వలించు దీపశిఖయుం దుంచినయుమ్మెత్తపూవువగిది సుధానిధియు వాఁడి వత్తయయ్యెను ఈవిసపుగాలులు వీఁచుటవలనవిష్ణువాహనం బగుగరుత్మంతుఁడు దొరలిపోయెనో, కాలెనో, మాఁడి మసి యయ్యెనో, మూర్ఛనొందెనో, మరణించెనో దెలియకుండఁ బోయెను.

అసువులతోఁపాటు విసపుటగ్గిని వెలిగ్రక్కు వాసుకిశరీరము గూడ నిస్సారమై నీట ముంచినచర్మఖండికవలెను, వస్త్రభస్త్రికవలెను, దనసమస్తశక్తులు నుడిగి మందరనితంబమున వ్రేలాడఁదొడంగెను. అంతటిమాయావులగుదానవులుగూడ దానితాఁకునకు నిలువలేకుండిరి. మహాత్ములగుమహర్షులు, పుణ్యాత్ములగుదేవతలును నాయుర్బలమ్ము కతనఁ జైతన్యముమాత్రము మిగిలి డగ్గుత్తికలువట్టి సన్నగిల్లుపలుకులతోఁ బరిభ్రమించుచూడ్కులతోఁ, బ్రాకృతులవలెఁ బ్రవర్తించిరి.

తెనకుఁ గలట్టి సంక్రమణాధర్మము నందినయట్టి తాపముల్
పెనఁగొనె సూర్యుఁ, డెల్లుడికి పెంపఱి నీర్వడిచెం బ్రచేతుఁడున్
తనదుశరీర మెల్లెడలఁ బార్కొనుకన్నుల నశ్రుధార లా
ల్కను నోడలెల్లఁ జల్లబడిగాదె సజీవత నిల్చె జిష్ణుఁడున్.

వ. అంత దేవదానవులు పితామహుం గదిసి నీమూలకముగ నే మీ ప్రమాదకార్యంబునఁ బాల్కొని చచ్చితి మని యుపాలంభించుచుండ నాతఁడు మిగుల సిగ్గువడి విష్ణుదేవున కిట్లనియె. స్వామీ! దీని నేమని భావించుచున్నారు ?

ప్రలయము లేదు, తద్విలయవాతము వీవదు, నూఱువత్సరం
బుల కొకతూరిగాదె జగముల్ దెగమాడ్చుచునున్, దదూర్ధ్వవా
సులఁ దరిద్రొక్క దయ్యెదియుఁ, జూచుచునుండగఁ నీయజాండమున్
బలిగొను నొక్కముద్దగ సెబా సిది యేమిదురంతభూతమో ?

ఇది జ్వలనమ్మయేని నశియించునె యీజ్వలనుండు దీన? ని
య్యది విషమేని యావిషధరావళి యీల్గునె దీన? నేమి యా
నిది? సృజియింపఁగాఁబడని దీవును జెప్పని దింత యేల, నా
యెద గదలం గజంచెడి నిదేమయి యుండునో దెల్పుమీ ప్రభూ !

వ. అని హిరణ్యగర్భుండు వచియించుచుండఁ బాతాళలోకతాపము చేఁ గలిగినసమాధిక్షోభమువలనిదుర్భరక్రోధముచే మరీషం బగు కాలరుద్రునిఫాలనేత్రోత్థిత మైనప్రళయాగ్నివలెను, మథించుటవలన రేఁగినబడబాగ్నితోఁ గూడి ప్రతిసృష్టియందును బయలుదేరు శేషుని విషపూరితంబు లగునిశ్వాసధూమములవలనఁ గలిగినవిషమహీపిండము

వలెను,సుందరతరమ్ములగుమందరకందరమ్ములందలి స్వాయంభువశంభులింగకంపనంబునఁ గలిగినమహాకల్పిపంబువగిదిఁ బరమదారుణంబై, ప్రళయాగ్నిదగ్ధ మగుబ్రహ్మాండమును జీర్ణ మొనర్చిన కాలచండికాదేవి హస్తపరిక్షాలనజలంబుకరణి క్షీరాబ్ధిని నల్లబఱుచుచు, ముమ్మొదట పీఁచినపరికంపనుని స్పందనమాత్రిన సమస్తలోకములును నశింపఁగా నిఁక దగ్ధ మొనర్పఁదగువస్తువు లేక, భీకరక్షుధార్తిఁ జేఁ దనవేయినాలుకలం జాపి భీషణజ్వాలాకలాపమున బ్రహ్మలోకముంగూడ మ్రింగ నుంకించునట్లుండి, యణఁచినభువనకోలాహలంబుగల హాలాహలము మదనాగము మదనాగంబునువలె రమారమణుని వెంటాడి తఱిమెను.

వెంబడినే దుస్సహవిషాగ్నిజ్వాలలవలనఁ గలిగినమ్లానతను మాఁపఁబూనినమంత్రాక్షరంబు లనెడిబొగ్గుల సంసర్గంబునం బోలెఁ జతుర్ముఖునిదంతతాలురసనాధరమందు మాలిన్య మంటఁ జొచ్చెను.

ధూమలధూమసంగతిఁ జతుర్భుజుబంగరుచేల మాఁడఁ, బా
దామము వాఁడ, శంఖము విదారణభీతిని గూడఁ, జక్ర ము
ద్దామపుఁదేజు పీడఁ, బరితః పరివర్ధితకాలకూటసం
క్రామముఁ గాలరూపు డిది కాలపరాభవ మం చెదం గనెన్.

స్వామలదేహకాంతిసుధ లల్లల దిక్కుల వెల్లిగొల్పఁ బా
క్షామృతవారిధిన్ మణిమయం బగునౌకను దేలియాడుచున్
శ్రీమదపాంగమాత్రపరిశిక్షితతద్గరళప్రశస్తిఁ నెం
తే మది నెన్నె వెన్నుఁ డమృతేశ్వరి నంబఁ దదాత్మభావనన్.

ఈశిటిన్ మది భక్తితత్పరత నెంతే నాసుధాపూర్తిన్
తారాదేవిని సంస్తుతింప శివతాదాత్మ్యంబు తా నందుటన్
ఘోరాయంతునకాలకూట మపు డుక్కుం దక్కఁ జటాత్రిపై
నారల్ దనిసినశైవలం బటులు భిన్నాభిన్న మాచుం జనెన్.

వ. అనంతరము వైకుంఠుండు కొంత స్వస్థత గాంచి తన్నుం దా రక్షించుకొనుటయందు వ్యగ్రుండై హాలాహలనిగ్రహమందు నిరాసుం డయ్యె. ఈకృత్య మసాధ్యసాధకుం డగుపరమేశ్వరునివంతుగఁ దలంచి పరదేవతానుగ్రహంబు లేక పరమశివసాక్షాత్కారము కానేర దని నిర్ణయించి తానే యాశివశక్తి యగుట నెడంద గాఢముగ భావించుచున్నను నారాయణిం దదేకనిష్ఠ ధ్యానించి యిట్లని స్తుతించె.

ప్రతిభాసించు యదీయసన్నిధి హరబ్రహ్మంబునన్ లోకసం
తతి జన్మస్థితినాశకృత్యము, సమస్తవ్యాప్తి, వేదోక్తశా
శ్వతవిశ్వప్రభుతాంకముక్తికలనాస్వాతంత్ర్య, మయ్యాదిమ
స్తుతవిద్యామయి దేవి నే నని తలంతున్ గాంతు నిర్వాణమున్.

[ ద్వి॥ సృష్టిస్థితిలయప్రవృత్తి కర్తృతయు
వరమోక్షదాయకత్వప్రశస్తియును,
తతలోకవిలసదంతర్యామితయును
వేదోపపాద్య మహావిశ్వసామ్రాజ్య
లక్షణంబును, బరబ్రహ్మ మైయున్న
శర్వునం దేదేవిసాహచర్యమున
సంఘటిల్లుచుఁ జక్క సాఁగునో, యట్టి
యాత్మవిద్యారూప మైనచిచ్ఛక్తి
నేనే యటంచు ధ్యానించి తోషింతు. ]

లచ్చిమగండనై పరమలక్ష్యము యోగులకై నిశాచరా
భ్యచ్ఛయు మార్చు జేత నయి పూర్ణత గర్మఫలప్రదాతనై
నిచ్చలు నే వెలంగు టది నీసుభగత్వమహావిభూతిసం
పచ్ఛయులేశలేశమహిమంబునఁగాదె జగత్స్వరూపిణీ!

దీనరక్షణియై గుణాతీత యైన
శివపరాహంత నిపుడు యోజింతు మదిని
అజర మమరము నపరిమేయాద్వితీయ
మైనపరమపదమ్ము నా కందుఁగాక.

అచలుఁడై యర్థవంతము లైనసుతుల
రాజరాజేశ్వరీధ్యానరక్తుఁ డగుచుఁ
గమలలోచనుఁ డస్పందగాత్రుఁ డయ్యె
బొందె స్పందము దక్షిణాభుజమునందు.

వ. అంత నశరీరవాణి యాతనికర్ణంబులం బడెను.

బాగురా బిడ్డ! నీస్తుతి బాగు బాగు
ఓజగన్మయి! శౌరి! బాగున్నదయ్య
ఈశభావన నిన్ను నీ వెఱిఁగి చూడు
మాపరజ్యోతి కననగు నంత నంత.

అనుటతో నంతలోన నారాయణుండు
తత్సమాధిని విడిచి చిత్తమున నలరె
నంతలోపల నాపురహరమహస్సు
చక్కగాఁ నెట్టయెదుట సాక్షాత్కరించె.

వ. ఆమహాతేజస్సునందు:—

పావననదనదీసముద్రజలస్వరూపత్వమువలని నిరంతరార్ద్రత్వమువలననో, అర్ధవికసితతృతీయనేత్రధూమసంపర్కమువనో, గంగదేవికోపమును లోపల బంధించుటనో, పరిణత మైనపాటలవర్ణము గలిగినజటాజూటమున విరాజిల్లుటచే సాంధ్యరాగంబునఁ జుట్టుకొనఁబడిన ట్లుండి—

శైవశాస్త్రారంభసూచనకుంబోలు ద్వితీయాచంద్రత్వమును బొంది, జ్ఞానరూప మగుటనో యనఁ గళంకరహితంబై, జటాకలాపమునకు బంధించినసర్పదంష్ట్రాంకురమువలెఁ గుటిలనిర్మలము లైనచంద్రకళతో విరాజిల్లుచు—

జగంబును నిష్కామం బొనర్చుటకు హేతు వగుటనో యన నిష్కామజనుల కుపాసనీయంబును, నేత్రపక్ష్మములనుండి వెల్వడునిప్పురవ్వలచే సమస్తలోకములు నిశ్శేషము లగుట నికఁ జూడవలసినపదార్థము లేకయో యన నిత్యనిమీలితంబును, విభూతిరేఖ లనెడిహారమాలికకుఁ బద్మరాగరూప మగుతరళమణివలెనుండి భక్తులహృదయకుహరమందలితమస్సును హరించుచున్నలాలాటలోచనముచే నలరారుచు—

కుండలము లైనకుండలిరాజముల ఫణామణిమయూఖములచే నివాళింపఁబడుచు స్వభావసుందర మగుగండమండలము గల్గి, శ్రుత్యుల్లంఘన సాధ్వసంబునం బోలెఁ గర్ణాంతవిశ్రాంతంబై, యపారకరుణామృతధారలు వర్షించులోచనయుగళముతో నొప్పారుచు—

త్రిపురవిజయమువలనఁ గలిగినయశస్సుచేవలెఁ దెల్లనై, బ్రహ్మవిద్యావచనామృతమ్మునకరణి షడంగసహితచతుర్వేదాత్మకకర్మకాండ

ప్రతిపాదకవచనసుధాప్రవాహమువలె నున్నమందస్మితముచే మహాయోగుల మానసములను సంతోషపఱుచుచు —

ఈ చూడాచంద్రుఁ డెప్పుడు పూర్ణుఁడగును? ఎన్న డితనిలోఁ బ్రవేశింతు నను కుతూహలమున మెడ నెత్తి కాంచుచుఁ, జపలస్వభావము కలదాట సవ్యపాదము నెత్తి యెచటికో పోఁదలఁచిన ట్లున్న వేదమయమృగమును వెనుక కాళ్ళు పట్టి తనయందే నిశ్చలముగా నిలుపుచున్నటు లుండి —

అతికఠిన మగునజ్ఞానపాషాణమును భేదింపనో యనునటులు రెండవచేతఁ డంకమును, నిరుపద్రవకర మగుమోక్ష మొసంగుదు నను దీక్షఁబూనిన ట్లభయంకర మగుకరముచే విరాజిలుచు —

తుచ్ఛవైషయికసుఖము లొసంగునే నెంతపాటి? యనుసిగ్గునంబోలె నధోముఖమై వరదముద్రాంకిత మైనకరారవిందముచే భక్తుల ప్రార్థితార్థము లొసంగుచు —

రూపము లేనిదిగంబరము దాల్చితి నను జుగుప్సచేవలె బహురూపములు (వర్ణములు) గల వ్యాఘ్రచర్మము నతినిర్మలమై చిన్మయ మగు దేహమునఁ గప్పికొని —

జపాకుసుమసన్నిధినున్న స్ఫటికోపలన్యాయమున నూపురస్థానీయము లగుసర్పముల ఫణామణికాంతిపుంజములచే నెఱ్ఱవారిన చరణారవిందములుగలిగి —

పరిపక్వమైనమహాదృష్టముచేతను, యమనియమాదులచేతను, నిర్మలమై, ధ్యానయోగమునందుఁ జరణలగ్నములై మహాయోగులమనసులలోని పంచాక్షరీవర్ణములవలె నున్నట్టియు, నత్యంతమనో

హారము లగువామదక్షిణపాదముల నఖంబులచే వేదశిఖల నెల్లవేళల నలంకరించుచు —

లోకపుత్రధనగ్రామదారశాస్త్రగృహ దేహ సంబంధములగు వాసనలు విడిచి పరువఁబడిన యంతరాత్మ జీవాత్మ పరమాత్మ త్రయ మనునుత్కృష్టశయ్యచేఁ గల్పిత మైనపంచభూతతత్త్వముల నల్లంఘించి యానందమయమై యమూల్య మగుభద్రాసనమం దాసీన మగుచు —

లోకమాతయై జ్ఞానానందరూపమై మేఘమాలికవలెఁ గరుణా రసపూర్ణమై యాత్మవిద్యవలె సాదరముగ నాలింగన మొనర్చి, సమాన మగు గుణరూపస్వభావసౌందర్యాదుల ననుపమయై, భగవతి యగుసర్వ మంగళచే ననుసరింపఁబడుచు —

సుఖముగ విశ్రమించిన శరత్కాలమేఘమండలమువలె నమృతసారముతో మెదపి ముద్ద చేసినకర్పూరపరాగసంచయమువలె నతి కోమల మైనస్ఫాటికగిరివలె, ఘనీభవించిన వెన్నెలలోనిసారమువలె, చిక్కణీకృత మైనపరమామృతమువలెఁ దృప్తి తీఱక గాంచువారి కతి మనోహరమై యాశ్చర్యములకాశ్చర్యమై, మంగళములకు మంగళమై, నిఖిలకార్యముల కాదికారణమై, నశించువారల కవధియై, సమస్తమహా విద్యల కాలవాలమై, దయకును భక్తపరాధీనతకును నిలయమై, యచింతనీయప్రభావము గలిగినను భక్తజనులకుఁ జింతింపఁదగి, యద్వైత బ్రహ్మస్వరూపమైనను బంచబ్రహ్మరూపాత్మకమై, నీచప్రమాణముల కతిదూరమై, వేదవాక్ప్రపంచమునకు సన్నిహిత మైనదాక్షాయణీరమణ మూర్తిని మాధవుండు వీక్షించె.

శాణనిఘృష్టశారదనిశాకరతచ్ఛకలాకృతిన్ విని
ద్రాణము లైననేత్రకమలంబులఁ దీరుగఁ గాంచుశౌరియున్
దా నొకనాఁడు శంభుని కొనర్చినపూర్ణసహస్రకంజపూ
జానియతిం బొనర్చునతిసాహస మెంచె మహోచితంబుగన్.

వామదేవ్యకాలేయ శాక్వరరథంత
రముల వైరాజరాజనరౌహిణాది
సామముల ఋగ్యజుషమున సంస్తుతించి
శివునికి మురారి వేల్ నమస్కృతు లొనర్చె.

చేతఃప్రీతిగ మౌళి వంచి నుతియించెన్ భక్తితో నాపర
జ్యోతిర్మూర్తిని గద్గదశ్రుతిశిరస్సిద్ధాంతవాగ్వైఖరిన్
జోత లోబట్టె దయాదిహార్దకుసుమస్తోమంబు లందిచ్చి పూ
జాతంత్రమ్ములు దీర్చె హృన్నయనకంజాతార్పణప్రార్థనన్.

ఎవనిసన్నిధిమాత్ర బిందువు చలించి
యీజగమ్ముగ వైవర్త మోజఁ గనెనొ ?
అచల మద్వంద్వ మప్రతిహతము, శాంభ
వం బయినదాని కివ్వె నావందనములు.

సృష్టికాద్యంతములను సూచించునట్టి
ఓమ్-ఉమా యనునామము లొకఁడె మీకు
వేణి జట యనుపేరులు వేఱు లైన
కచభరం బభిధేయ మొక్కటియెగాదె.

వికటభ్రూకుటిభీషణంబును సముద్వేగావహంబున్ సుఘో
రకరాలం బయినన్ శ్రుతిం దగ నఘోరాభిఖ్యఁ జెన్నొంది, తా
నకలంకమ్ము భవార్తినాశకము ముఖ్యప్రాప్య మైయున్న తా
వకమా దక్షిణవక్త్రమే గతిగ సంభావింతు సర్వేశ్వరా!

వ. అని స్తుతించునిందిరాపతి నిందుశేఖరుండు గౌఁగిలించి యిట్లు పలికె. కమలలోచనా! నీదర్శనమ్మునఁ బరమానంద మందితిని. తనకుఁ దనకంటె బ్రీతిస్థానంబు వేఱొం డున్నె?

శివ యని ఘోర యంచు శ్రుతి చెప్పెఁ; దద్రమణీయమూర్తులం
దవుదువు నీవు మున్మొదటిదై, సగ మౌదువు నాదు మేన, నీ
వవుదువు నాదుసవ్యముఖమై, యిఁక నాదగుప్రీతి యెంతొ, నీ
కవగతమయ్యెనే? మనపురాకృతు లొక్కటిగాదె మాధవా!

వ. ఏమి వాంఛించుచుంటివి? నే నేమియొనర్పవలసియున్నది? అని యుమాకాంతుం డడుగ రమాకాంతుం డిట్లనియె. నాకితరవాంఛ లేమున్నవి? ఇదెద్దియో సంభావితునకు ఘటిల్లినయపయశంబుపగిది నిర్నిరోధముగ బ్రహ్మాండమండలంబు నాక్రమించి యతిగర్వితునిపాండిత్యమువలె బ్రహ్మాదులనుగూడఁ దృణీకరించి, నీచునిసంపదవలె నర్ధనిమేష మైన సహింప నశక్యమై, పాషండునిమోమురీతిఁ జూడరానిదై బాలిశభూపతిసేవకరణి ననుక్షణము విచిత్రముగ నుండి, శివభక్తాగ్రేసరుల నొనర్చునవహేళనమ్ముపగిది ముల్లోకమును భస్మమొనర్చుచు, క్షీణాయుష్కునిరోగవేగంబుతీరున విఫలప్రతీకారమై, వంచకులసౌహార్దంబువలెఁ బరమదారుణంబై, విషయసుఖానుభవంబువలె వ్యామోహకారకమై, త్వత్పాదసేవావైముఖ్యమువలన జనించుమహాపాతకమ్ము

భాతి త్వత్పాదాభివందనైకనివార్యమై, యూరుపేరులు లేనిదై, నిర్ణయింపరానిదై, అవ్యవధానబాధకం బగుటఁ గాలకూటం బనుటకేని వీలు కానిదై, హటాత్సిద్ధ మైనజన్మాంతరప్రారబ్ధమువలె జగత్త్రయంబు నాక్రమించి, దేవాసురులనెల్లఁ బడఁగొట్టి, బ్రహ్మను బాధించి నన్నుఁగూడఁ బూరికింగొనక, నాభూషణాంబరాదులపైఁ బ్రసరించి భగవతి యగు సుధామాలినీమాతృక చరణస్మరణపరిభావంబునఁ గొంచె మపసరిల్లినట్లుండి లోకమ్ములనెల్లఁ దలకింపఁ దొడఁగుచున్నది యిదేమి?

అకలంకౌషధిమంత్రతంత్రముల శస్త్రాస్త్రంబులంగాని, లె
క్కకు రాసియదు, యోగివర్యులకు లొంగంబోదు, మోహార్త్రుఁడై
వికలుం డంవిధి, దేవదానవులు నుర్విం గూలి, రీచేయి యా
డక స్తంభించె, నిదేమిభూత మగుఁ గట్టా తోఁచ దింతేనియున్.

జగ మిది, నీవు దీని నసిచక్కఁగఁ బాలనచేయు మంటి, వే
నగణిత మైననీదుకృప నప్పని జూచితి నింతదాఁక, నీ
పరిగతి దురూహదుస్సహాకరాలమహావిలయంబు గాఁగ నే
బెగడితి నోజగత్పతి! నివేదనచేసితి నీకు నింతయున్.

వ. అని గరుడధ్వజుండు నిర్విణ్ణుండై నివేదింపఁ బార్వతీపతి నవ్వుచు, చూడుము చూడు మనుచుఁ దనదక్షిణబాహువును జాచి హాలాహలమ్మును స్మరించెను.

అన్నిభయంబులం దొలఁచునట్టిమహేశునికొప్పులోని యా
క్రొన్నెలవెన్నెలల్ కసరి కొట్టఁగ లోకబహిష్కృతిస్థితిన్
సన్నకసన్న జాఱె విషసారము, మత్తమతంగతుండసం
భిన్నతఁ జెర్వులోఁ జెదరి పీలిక లై పడునాఁచు కైవడిన్.

కాలకూటసంతమసంబు గడకుఁ దొలఁగ
లోకములు దెల్వి గాంచెఁ జీకాకు లుడిగి
తార్కికులకలకలము శాంతత వహింపఁ
గవులభావంబు విశద మాకరణి సంత.

వ. పిదపఁ జంద్రచూడుని సన్నిధానమాత్రిన నరణ్యములు చిగిర్చి, సముద్రములు నిండి నదులు ప్రవహించి వాయువులు వీచినవి. సూర్యచంద్రులు ప్రకాశించిరి. దిక్కులు తెలివినందె నుత్పాతంబు లణంగిపోయె. శుభంబు లుప్పతిల్లె. జంతుజాలములు చైతన్య మందె. వాసుకి యథాపూర్వముగఁ బ్రబోధముంగాంచె. దేవాసురులు లేచిరి. కమలాసనుండు నెమ్మదిగఁ దెలివిం గాంచి లేచి పరమేశ్వరు జగత్కల్యాణసంధాను దర్శించె.

సాకూతస్మితసుందరోష్ఠపుటుఁడై శార్దూలచర్మాంబర
శ్రీకుండై శతపూర్ణ చంద్రనిభుఁడై శ్లిష్యత్సతీయుక్తుఁడై
స్తోకోన్నిద్రదృగబ్జుఁడై హరికి సంతోషంబు సంభావనన్
జేకూర్పం గర మెత్తుశంకరుని గాంచెన్ మాటికిన్ మాటికిన్.

వ. తదనంతరము బ్రహ్మాదిదేవతలు చైతన్యమొంది ప్రాతఃకాలమందు మేల్కాంచి కొలకొలలాడుపక్షిగణము సూర్యభగవానుని దర్శించినటులు పశుపతిని సేవించిరి. అప్పుడు సంసారసాగరనిమగ్నులైనభక్తుల నుద్ధరింపం జూపునను రాగమునవో, ప్రాణులపాశబంధంబులం దొలగించునాయాసమువలని యారుణ్యమ్మునవో, పార్వతీకుచంబులందలి కుంకుమపంకసంపర్కమునవో, తామరసగర్భమువలె నెఱ్ఱనైనయాతని

పాణితలమందుఁ గిసలయముపై నున్నతుమ్మెదవలెను, పద్మరాగకరండమం దున్నకస్తూరికవలెను, నేరేడుపండువలెను, సంకోచించియున్నను దారుణాతిదారుణమై భరింపరానియూష్మముతోఁ గూడి సాధ్వసమునఁ బోలెఁ దరళమైనగరళమును వారు గాంచిరి. ఆశ్చర్యమునఁ ద్రివిష్టపములు నిశ్చలంబు లయ్యె.

గరళము మాకు నూ కనియెగంబడు స్వప్రియధాళినిం గృపా
భరయుతసస్మితేక్షణలవంబునఁ గాంచుచుఁ బ్రేమయున్ భయం
కరతయుఁ దోఁపఁ బట్టుకొని గౌరి చటుక్కున వీడియున్నయా
కరమున నొప్పుశంకరు నిగారపుసంస్థితి యమ్ముఁ బ్రోచుతన్.

వ. తదనంతరము లోకము యథాస్థితి నందఁగా, దేవాసురులు తెలివింగాంచఁగాఁ,బద్మసంభవుండును బద్మనాభుండును స్తుతించుచుండ నడ్డుకొనుటకేని యనువర్తించుటకేని సాహసమ్ము లేనినంది మొదలగు పారిషదులు నిర్నిమేషులై కాంచుచుండ, లోలోపలఁ గల్యాణముల నాకాంక్షించునుమాదేవిచే నాశ్లేషింపఁబడి మహాదేవుండు, "ఈ హాలాహలమహావిషంబును నే నాచమింతు. భయంబు వలవదు. మీ మీసంతాపంబు లుడుగుఁడు" అని ప్రబోధించుచు మాధవుఁడు వెన్నముద్ద మ్రింగినటు లుమాధవుం డద్దానిం గబళించెను.

బడబానలమును శిష్యవర్గముగను, భుజంగవిషములను బరిచారవర్గముగను, నశనులను యాచకవర్గముగను, మిత్రుని మిత్రముగను గావించికొన్నయామహాకాలకూటవిషము తత్త్వాదృక్తీవ్రత నుపసంహరించికొని, నేరేడుపండువలెను, నెండినయుసిరికవలెను, ఖర్జూర

పుంబండువలెను, కవిరిముక్కువలెను, బరిణమించి త్రిణయనునియాన నమ్మును బ్రవేశించెను. అప్పుడు కుక్షిస్థాఖిలలోకములను దగ్ధంబు కానోపు ననుసాధ్వసమ్మున దయామయి యగుదాక్షాయణి తనచిగు రుంగేల నాతనిగళమును నిమిరెను.

పారము సారముం గనక పాపభవజ్వరవహ్నితప్తులా
వారికి జీవనౌషధ, మపారకృపామృతవర్షి యైనయా
గౌరికరంబు తాఁకుసను గమ్రశరద్భవచంద్రచంద్రికా
సారము నావిసం బడఁగె శంభుగళంబునఁ బుట్టుమచ్చయై.

హారపరిభుక్తశేషము విషాంశము పర్వతసింధుకల్పిత
తరువరవృశ్చికాదులను, దారదశాక్తికవత్సనాభతన్
గురుకొని తారకమ్య్య నాశ్వినులనుం గణియింపక పుర్వులట్లుగాఁ
బరమభయావహం బగుచుఁ బ్రాణహరంబగుచుండె నేఁటికిన్.

కాలమునన్ వికాసమును గాంచెడినల్లనికల్వరీతిఁ గా
కోలము వ్యోమకేశుగళగుంఫిత మయ్యు బహిర్గతంబగున్.
చాలఁగ గుట్టువెట్టినను సజ్జనశుద్ధహృదంతరంబులన్
దూలి యసత్యమొక్కపుడు దూరొనుఁగాదె జగత్ప్రసిద్ధిగన్.

వ. ఇట్లనాయాసముగా మహాదేవుండు కాలకూటముం గబళింప, భవాని మందస్మితవదనారవిందయై యాతని నోదార్చుచు మాటిమాటికి బిగియారఁ గౌఁగిలించుచు ముద్దాడుచు నాతనికంఠదేశమ్ము నిమురుచుండఁ, బ్రమథు లానందతుందిలులై పరస్పరము గౌఁగిలించుచు చిటికెలు వెట్టుచు, నవ్వుచుఁ గేరుచుఁ బరమశివునిపాదము లంటుచుండ

నట్టిత్రిలోచనుని గోవిందవిధిపురందరాది దేవతలును, బలివిరోచనాది దైత్యులును, సనకసనందనాదిమహర్షులును మహానందమున నర్థవంతమ్ములగునుడుల నిట్లు స్తుతింపఁజొచ్చిరి.

అతివికటగరళభగ్నుల
మితవునఁ దద్గరళ మాని తీవ్రుఁ గనుకనే
'నతి నీలగ్రీవాయ చ
శితికంఠాయ చ, యటంచు జేపెట్టె శ్రుతుల్.

తరమిడి నీలపీతహరితంబులు వజ్రపుఁటా లురంబునన్
కురులను గంఠసీమలను గూర్పఁగవచ్చు విశేష మేమి? శం
కర! యిదె భూషణం బగు జగంబులఁ గావఁగ నీవు మృత్యుభీ
కరఖరకాలకూటమును గ్రుక్కినఁ ద్వద్గళమం దడంచుటే.

స్వామీ! మీ గళసీమ యెన్నఁడు ఘనశ్యామంబుగాఁ దోఁచెనో
యీమీఁదన్ హరి లోకరక్షకుఁడు, బ్రహ్మేంద్రాదిదిక్పాలకుల్
తామై నిల్చిరి, దానవుల్ దమనతం దర్పించి, రీమానులున్
క్షేమారబ్ధసుమంత్రతంత్రులుఁ, జిరంజీవిత్వవిభ్రాజితుల్.

గద్య:—శైలాదికృతనిషేవణ! కైలాసశిఖరభూషణ!
తత్త్వార్థగోచర! చంద్రార్ధశేఖర!
శాపాయుధకులార్ధ్యసస్మితాపాంగ! కోపారుణకటాక్షభస్మితానంగ!
ఊరీకృతవిభూతిదివ్యాంగరాగ! గౌరీపరిగృహీతసవ్యాంగభాగ!
అంగానుషంగపావితనరాస్థిలేశ! గంగాతరంగభావితజటాప్రదేశ!

వందనాభిరతాఖండల! స్యందనాయితభూమండల!
అక్రీతదాసతాపసకదంబ! చక్రీకృతార్కశీతకరబింబ!
ఆదృతపురాణవేతండ! స్వీకృతసుమేరుకోదండ!
ఖర్వీకృతాసురమదానుపూర్వీవికాస!
దర్వీకరేశ్వరగృహీతమౌర్వీవిలాస!
వీణామునీంద్రఖ్యాపితగరిమపౌరుష!
బాణాధికారస్థాపితపరమపూరుష!
అనిలాశనవిహితసైపథ్య! కమలాసనవిహితసారథ్య!
విశ్వాధికత్వపదాలంబ! అశ్వాయితాద్యవచోగుంభ!
కుందస్మయహరకాంతిప్రకర! మందస్మితలవశాంతత్రిపుర!
నాదబిందుకళాభిజ్ఞాస్పదభూరిభద్ర!
స్వేదబిందులవావిర్భావితవీరభద్ర!
త్రస్తరక్షాపరతంత్ర! ధ్వస్తదక్షాధ్వరతంత్ర!
కిరీటానీతవివిధవేధఃకపాల! చపేటాఘాతశిథిలభాస్వత్కపోల!
జృంభితవిక్రమోద్దండ! స్తంభితచక్రిదోర్దండ!
బ్రహ్మాస్త్రోపచితమహోహర్ష! జిహ్మస్వభావజనదురాధర్ష!
వసుంధరాధరసుతోపలాలన! జలంధరాసురశిరోనిపాతన!
కోపాహతపతితాంతక! వ్యాపాదితసమదాంధక!
పరసంహననజటాసంభృతపరభాగగార!
నరసింహానియమనాలంబితశరభావతార!
ప్రపన్నభయమోచన! విభిన్నభగలోచన!
ప్రపంచదహనకారక! విరించివదనహారక!
సంచారపూతమందర! పంచాయుధాతిసుందర!

అపనీతదక్షానన ! అభినీతభిక్షాటన !
దారితమేరుకాననకుసుమమాలికాలంకార !
దారితదారుకావనకులపాలికాహంకార !
సమావర్జితభక్తమానసానుసార ! పరావర్తితదృప్తతాపసాభిచార !
వైయాసికోక్తిగోచర ! వైయాఘ్రకృత్తిభాసుర !
గతపరికర్మగణస్పృహా ! కృతగజచర్మపరిగ్రహా !
స్వధ్యానశమితపాతకప్రసంగ ! విధ్యాదివిబుధపూజితస్వలింగ !
శాంతమానసానురోధ ! క్రాంతతాపసాపరాధ !
ఘాలానలవలనభీషణ ! హాలాహలగరళభూషణ !
అరుణాంశుకందళమణిసుందరఫణికుండల !
చరణాగ్రయంత్రితదశకంధరభుజమండల !
ఆనందతాండవనటనానుబంధ ! గోవిందపూజితచరణారవింద !
వినయానతామృతాశనసహస్రహితప్రమోద !
తనయాభిలాషిమాధవతపస్యాకృతప్రసాద !
దివ్యాస్త్రదానతోషితభృగుసూనునమ్య !
నవ్యార్ధభాగభావితహరి రూపరమ్య !
వందితాగతశ్రుతిసార ! నందిపాలితప్రతిహార !
బుద్ధనానార్ధరహస్యశతమన్యుముఖ్యామరభక్తిగోచర !
దుగ్ధపానార్ధతపస్యదుపమన్యువిశ్రాణితదుగ్ధసాగర !
అధికసంచాలితదుష్టపీడాచరణ ! హరివిరించాపరిదృష్టగూఢాచరణ !
అంచద్ధర్మవృషాధార ! పంచబ్రహ్మమయాకార !
వేదాశ్వవరోపహితస్వామ్య ! శ్వేతాశ్వతరోపనిషద్గమ్య !
చాపల్యరహితరమ్యస్వభావ ! కైవల్యవచనగమ్యప్రభావ !

అథర్వమహాధిరాజ్యప్రతాప! అథర్వశిఖానువాద్యస్వరూప!

అగర్వనరస్తుతిముదిత! అథర్వశిరస్తుతిపఠిత!

నాదాంతవిభావనీయ! వేదాంతవిబోధనీయ!

ప్రణతార్తిహార! ప్రణవార్థసార!

ముగ్ధలావణ్యాధార! శుద్ధచైతన్యాకార!

ఆశీవిషధారక! కాశీపురనాయక!

హృదంబుజకృతవిలాస! చిదంబరకృతనివాస!

ఆకర్ణచలితాపాంగ! గోకర్ణరచితాసంగ!

ఘోరాసురపురధూమకేతుస్మిత! వారాకరగతరామసేతుస్థిత!

రక్షణలీలావిలాస! దక్షిణకైలాసవాస!

ఆతామ్రలోలనయన! ఏకామ్రమూలభవన!

ఆభీలవిధురసేవన! శ్రీశైలశిఖరపావన!

ఆద్రాక్షమధురవాగ్గుంభ! రుద్రాక్షరుచిరదోస్తంభ!

కాలకంఠరుచిఘటితలావణ్య! నీలకంఠమఖినిహితకారుణ్య!

సేవాపరతంత్రపాలక! శైవాగమతంత్రకారక!

స్వర్గస్థితిసంహృతికార్యత్రయస్థేయ!
భర్గశ్రుతియంత్రితగాయత్ర్యనుసంధేయ!

అధ్యాసితవరనికుంజగృహహిమాహార్య!
అధ్యాపితహరివిరించముఖశివాచార్య!

అర్చితానంతవిహార! సచ్చిదానందశరీర!

విజయీభవ, విజయీభవ, దిగ్విజయీభవ.

వ॥ శైలాది యనుభక్తుని సేవ లందినవాఁడా!
కైలాసశిఖరమునను భూషణ మైనవాఁడా!

ఉపనిషద్వాక్యార్థగోచర! చంద్రరేఖావిరాజితశేఖర!
మునివరు లపేక్షించు చిఱునవ్వుమోముగలవాఁడా!
కోపవీక్షణముల మదనదాహ మొనర్చినవాఁడా!
విభూతి యలందిన సర్వాంగములు గలవాఁడా!
వామాంగమున హైమవతి గల్గువాఁడా!
మానవాస్థిమాలికలఁ దాల్చుమహానుభావా!
గంగామతల్లిని జటల బంధించినయాదిదేవా!
ఇంద్రాదులమనస్సు లందెడివాఁడా!
భూమండలము రథముగా నైనవాఁడా!
తపోమహితులను దాసులుగఁ జేకొన్న దేవా!
సూర్యచంద్రులను జక్రములుగఁ జేసినమహానుభావా!
గణాధినాథు నాదరించినవాఁడా!
మేరువును గోదండముగఁ బూనినవాఁడా!
రక్కసులయుక్కును బోకార్చినవాఁడా!
వాసుకి నల్లెత్రాడుగఁ జేసికొన్నవాఁడా!
నారదాదిమునివందితమహామహిమాఢ్యా!
విష్ణు నమ్ముగా నొనర్చినయున్నతదార్ఢ్యా!
భుజంగమయనేపథ్యా! గృహీతవిధిసారథ్యా!
సర్వోన్నతపదమున కాధారమైనవాఁడా!
చతుర్వేదములు వాహనము లైనవాఁడా!
మల్లెల హసించునవ్వులవాఁడా!
మందస్మితమునఁ ద్రిపురదాహ మొనర్చినవాఁడా!

నాదబిందుకళాభిజ్ఞులను మంగళము లొసంగు దేవా!

స్వేదబిందువున వీరభద్రు నుత్పాదించిన మహానుభావా!

భీతుల రక్షించుప్రోడా! దక్షాధ్వరమును ధ్వంసమొనర్చినవాఁడా!

కిరీటమందు వివిధకపాలములు గలదేవా!

చెంపపెట్టున భాస్కరుని బోసిచేసినమహానుభావా!

విజృంభించిన పరాక్రమముగలవాఁడా!

విష్ణుహస్తమును స్తంభింపఁజేసినప్రోడా!

నలువపొగడ్తల కానందించినవాఁడా!

కుటిలబుద్ధులకు భయంకరమైనఱేఁడా!

పార్వతిలాలన మందినప్రోడా!

జలంధరునితల నూడ్చినఱేఁడా!

కోపమున యముని మర్దించిన ఱేఁడా!

అంధకాసురునిమద మడంచినప్రోడా!

ఉత్తమాంగజటాభారగార!

నరసింహానియమనాదృతశరభావతార!

ఆర్తులభయముల నడంచువాఁడా!

సూర్యునికన్నును బెకలించినప్రోడా!

ప్రపంచములను బ్రళయమున మాడ్చి వేయువాఁడా!

విరించిపంచమవదనమును ఛేదించినఱేఁడా!

మందరాద్రిసంచార! కందర్పసుందరాకార!

దక్షాననము నూడ్చినవాఁడా! భిక్షాటన మభినయించినఱేఁడా!

మేరూద్యానమందలి కుసుమమాలికల నలంకరించినవాఁడా!
దారుకావనకాంతల యహంకార మణంచినప్రోడా!
విషయపరాఙ్ముఖు లగుభక్తుల ననుసరించువాఁడా!
దారుకావనమునుల యాభిచారికమును ద్రిప్పినజేఁడా!
బ్రహ్మసూత్రముల భాసించుజేఁడా!
వ్యాఘ్రచర్మముతోఁ బ్రకాశించుప్రోడా!
ఆభరణధారణమం దాసక్తిలేనివాఁడా!
గజచర్మమును జక్క ధరించినప్రోడా!
ధ్యానమాత్రమున బాతకము లణంచినవాఁడా!
బ్రహ్మాదు లర్చించులింగరూపము గలప్రోడా!
శాంతమనస్కుల ననుసరించువాఁడా!
తాపసులనేరములను క్షమించినజేఁడా!
నొగటికంటిమంటలవలన బీతుగొలుపు దేవా!
హాలాహలము కంఠాభరణముగఁ గలమహానుభావా!
అరుణమణులు గలఫణులను గుండలములుగఁ దాల్చినవాఁడా!
చరణాగ్రమున నణంచినరావణభుజబలము గలప్రోడా!
ఆనందతాండవనృత్తము లొనర్చువాఁడా!
గోవిందునిపూజ లందినపాదకమలముగలజేఁడా!
వినయవినమ్రు లగుదేవతల కానంద మొడఁగూర్చినవాఁడా!
తనయాభిలాషఁ దపించినశ్రీకృష్ణు ననుగ్రహించినజేఁడా!
దివ్యాస్త్రముల నొసంగి భార్గవుని సంతోషపఱచినవాఁడా!
వామార్ధమందు హరిరూపమున విరాజిల్లుప్రోడా!

స్తోత్రపాఠకులైనశ్రుతులు గలవాఁడా !
ద్వారపాలకుఁడైననందిగలవేఁడా !
ధర్మజ్ఞులైనయింద్రాదులభక్తికి గోచరుఁడవైనదేవా !
క్షీరపానేచ్ఛఁ దపించునుపమన్యువునకు
క్షీరాబ్ధినిచ్చిన మహానుభావా !

దుష్టులపీడలఁ దొలఁగించినవాఁడా !
విష్ణుబ్రహ్మలు వీక్షింపలేనిశిరఃపాదములు గలప్రోడా !
సంచరించెడి ధర్మరూపవృషభమున కాధారుఁడా !
సద్యోజాతవామదేవాదిబ్రహ్మలరూపు గలవాఁడా !

వేదాశ్వములచే ధరింపఁబడుస్వామ్యముగలవాఁడా !
శ్వేతాశ్వతరోపనిషత్తుచేఁ దెలియఁదగినవేఁడా !

చపలత లేనిరమ్యస్వభావముగలవాఁడా !

ఉపనిషద్వచనము లెన్నినమహిమ గలవాఁడా !

అనల్పయజ్ఞాధిపత్యప్రతాపములు గలవాఁడా !
అథర్వశిఖోపనిషత్తు వచించినరూపుగలవేఁడా !

నిగర్వియగునర్జునునిస్తుతికి ముఱిసినవాఁడా !
అథర్వశిరస్సనునుపనిషత్తుచే వేద్యమగుప్రోడా !

ప్రణవచరమాంగమున భావింపఁబడువాఁడా !
వేదాంతములచేఁ దెలియఁదగినప్రోడా !

ప్రణతులబాధల హరించుదొరా ! ఓంకారార్థ ప్రభూతసార !
ముగ్ధలావణ్యము గలప్రోడా ! శుద్ధచైతన్యరూపము గలవేఁడా !

నాగాభరణాధారక! కాశీపురాధినాయక!
మనఃపంకజమున స్ఫురించువాఁడా!
చిదంబరక్షేత్రమున వసించువేఁడా!
విశాల మగుకీర్తిఁగంటిచూపులు గలవాఁడా!
గోకర్ణ క్షేత్రము నివాసముగాఁ గలప్రోడా!
ఘోరాసురపురములకు ధూమకేతు వగుస్మితము గలవాఁడా!
దక్షిణాబ్ధితీరమున రామసేతువునఁ దున్నప్రోడా!
భక్తావనవిలాస! దక్షిణకైలాసవాస!
చంచలారుణమనోహర నేత్ర! ఏకామ్రక్షేత్రనివాసపాత్ర!
హృషీకేశునిభవ్య సేవ లందినదేవా!
శ్రీశైలశిఖరమును బావన మొనర్చినమహానుభావా!
ద్రాక్షామధురము లగువాక్సందర్భములు గలవాఁడా!
రుద్రాక్షులచే నంద మగుభుజములు గలవేఁడా!
కాలకంఠకాంతిచే మించినలావణ్యము గలవాఁడా!
నీలకంఠదీక్షితుని దయ నేలినప్రోడా!
భక్త శేఖరుల భావించుదొరా!
శైవతంత్రముల నిర్మించినహరా!
సృష్టిస్థితిలయముల నిర్వర్తించువాఁడా!
గాయత్త్రీ మంత్రముచే ధ్యానింపఁదగువేఁడా!
హిమాలయనికుంజములం దుండువాఁడా!
విరించి మున్నగుశైవశాస్త్రవ్యాఖ్యాతలఁ జదివించినవేఁడా!

అర్చింపఁదగు ననంతవిహారములు గలవాఁడా!
సచ్చిదానందమయశరీరము గలతేఁడా!
విజయీభవ, విజయీభవ, విజయీభవ.

లీలగ క్ష్వేళమిట్లు కబళింపవయేని జగన్నివాస! దే
వాళియు సప్తతంతువుల హవ్యము లెట్లు భుజింపనేర్చు? నో
శూలి! సమస్తభూతములఁ జొక్కఁగ నీవు శ్మశానవాసివై
పాలన సేయకుండిన నుపర్వులు మేడల హాయి నుందురే?

నీవలనఁ బుట్టినారము
నీవే పెంచితివి నడుప నీవేగావా?
యీవిధి తెలిసిన మానిన
దేవా! మావంతు నిన్నుఁ దృప్తిపఱచుటే.

వ. అని స్తుతించు దేవతలను బురశాసనుం డిట్లని శాసించె.

హరిహరులున్ జతుర్ముఖుఁడు నాత్మజులౌట జగత్ప్రసిద్ధమే
హరిహయముఖ్యు లావిబుధు లాదనుజేశులు నాకు భృత్యు, లీ
గరళము మ్రింగి యేవరులకష్టము తీర్చితి? నీ కుటుంబ సం
భరణము పూనునాకు స్తుతిపాఠములా? యిది సిగ్గు కాదొకో!

వ. సముద్రమథనసమయము మతిక్రమించుచున్నదిగాన మీమీ స్తుతుల నుపసంహరింపుఁడు. బిడ్డలారా! దేవాసురులారా! నాయనా! చతురాననా? ఈనాపరమోపదేశమును శ్రద్ధగ వినుఁడు.

అపరిదృశ్యమానపురుషాకృతి నైన త్రివిక్రముండె గా
నాప్రియురాలు, మీదుజననంబున కైనసవిత్రి యాతఁడే,
నాపద మెట్టు లట్టులె కనన్వలెఁ దత్పదమున్, దదాజ్ఞయే
నాపరమాజ్ఞగా వినయనమ్రిత భక్తి భజింపుఁ డాతనిన్.

వ. అరవిందలోచన! నీకు నాపైఁ గలయనన్యాదృశప్రీతిని గ్రహించితిని. మధనానంతరము మనమిరువురము కలియుదుము. వీరల కమృత మీయవలసినకాలము దాఁటిపోవుచున్నది. కాన నాయెడఁ శాటునకుం జింతింపవలదు.

తలపఁగ 'భవాన్, భవానీ, పదములలోన
నొక్క 'ఈ, కారభేదమే యొప్పుగాదె?
ఏకవిగ్రహయుతులమై యెసఁగుచుండ
నరయ విశ్లేష మది యెట్లు పరగు మనకు?

వ. అని యిందుశిరోభూషణుం డోదార్చుచుండఁ బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి యతని పాదములఁ దలందాల్చి కవుంగిలించి యతి కష్టమున నాతని విశ్వంభరుండు వీడ నందఱుఁ గాంచుచుండ నంబికాసమేతుండై యంతర్ధాన మందె.

దివ్యము లైనసంస్తులు తీఱిచి విష్ణు నుతించి మించి యా
యవ్యయు పాదపద్మముల నల్లన మౌళుల నద్దుకొంచు సం
భావ్యత సంస్మరించుచుఁ గపర్దిని దేవత, లాసురాళితో
దీవ్యదనంతశక్తిని మధింపఁగఁ బూనిరి క్షీరవార్నిధిన్.

ఇది :- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూరి గృహనామకపవిత్ర,
పెదశేషయార్యశేషమాంబాద్వితీయపుత్త్ర,
మహాగాయత్త్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య,
సూర్యనారాయణశాస్త్రిప్రణీతం బైన
ఆంధ్రనీలకంఠవిజయచంపూ మహాకావ్యంబున
చతుర్థాశ్వాసము, సంపూర్ణము.



# నీలకంఠ విజయము

## పంచమాశ్వాసము



జలధి నడుగంట సురలు రాక్షసులుఁ గలిసి
యుగ్రదీక్షతోడ మథించుచున్నయంత
నీలకంఠుఁడు తాఁ గరుణించినట్టు
లదియుఁ గరుణించెఁ బుట్టింప నమృతరసము.

వ. అంత మథింపంబడు క్షీరసాగరమునుండి సజాతీయ మగు మందరాద్రి సంఘర్షమును సహింపలేక యందుండి లేచినమైనాకగిరి వలె నుండి, తమనిర్మలతను నిలుపుకొనుటకై యేకీభవించిన జలజంతువులచే మలినమదజలధారలను బరిహరించుటకు భూమిపైకి నెట్టఁబడినట్లుండి, సంతతము జలమందే వప్రక్రీడ లాడుస్వభావముగలదగుట దుగ్ధాబ్ధిలోని సరోజనాళములు చుట్టుకొనినట్లు వజ్రమణికటకములచేఁ బినద్ధమైనంత చతుష్టయముం బూని, సదాభూభారవహనమున నలసిన దిగ్గజములదృష్టిం బడఁబోక బలాత్కారముగ లాగు ననుశంకచే, నేదో యొకమార్గముగఁ దనంతతానే వెలుపలికివచ్చినటు లున్నయైరావత మనుమదసింధుర మాశ్చర్యకరముగఁ జనించెను.

పరిచలితదుగ్ధవేలా
పరిచయమున విమలమై విభాసిలునామం
దరగిరిని గొమరుకై వడి
నరిముది నైరావతము తనంతన దరిసెన్

తొండముచేఁ బరిమళకుసుమాళి నాఁ దెగఁజిల్చి నీరమున్
నిండ స్వదేహముం దడుపునేర్పున శీకరవృష్టి దేవతా
మండలి నిండుకొల్పి, గిరి మట్టుచుఁ గోరలఁ గ్రీడ సల్పు నే
దండము చేష్టలయ్యెడ ముదం బొదఁ గూర్చెను దేవతాళికిన్.

వ. అట్లది పైకి వచ్చి మావటీనిశితకు లెఱింగియుండని దగుట దేవాసురులనేని లెక్కసేయక, యమృతపానము వలనిసంతృప్తిచే బరులు దన కందిచ్చుపుండ్రేక్షుఖండంబులను, ననఁటికంబంబుల, రావి చిగుళ్లను మూఁచూడక జలజంతువులనెల్ల నొక్కపెట్టున రాపాడె.

దానిని వీక్షించుచు దేవదానవులు మరల మథనసంరంభము నకు దిగిరి. తోడనే యుబ్బర మగుతనహేషారవంబులతోఁ గల్లోల కోలాహలంబు నినుమడింపఁజేయుచుఁ, దనఖురపుటమ్ములచే దుగ్ధసాగర జలకణజాలమును నెగురఁజిమ్ముచు, నెల్లవేళల జలంబులందే మునింగి తేలుట యనెడికష్టము నోర్వంజాలని కుముదబాంధవు రథవాహ మ్మొకండు తెగించుకొని వచ్చిపడెనా యన్నటు లుచ్చైశ్శ్రవ మను నన్వర్థనామము గలయశ్వతల్లజము పాల్కడలినుండి పైకివచ్చె.

ఆప్య మైయున్నఁ దాను జవాధికతను
నాశుగునికిని గూడ ననాప్య మగుచు
తెల్ల నగుసైంధవము తేటతెల్లముగను
సైంధవోదరమందుండి చక్క వెడలె.

వ. ఆయుచ్చైశ్శ్రవము నాయుదేవునిశిరముపై నాపాదము నిలిపెద నన్నటులు తనయుగ్రపాదమును మాటిమాటికి నెత్తుచుండెను.

ఆరట్టవనాయుదేశసంభవము లైన యుత్తమాశ్వములనుగూడ భూసంచారమాత్రము నెఱింగిన వనియు, మత్స్యమండూక కర్కటకాదులవలె వరుణాశ్వములు నీటిలోనే సంచరింప సమర్థము లనియు, సూర్యాశ్వములు గానుఁగుటెద్దులవలె నిరంతరభ్రమణమాత్రస్వభావము గలవనియుఁ, దనసకిలింపులచే నపహసించుచున్న ట్లుండి మారుతవిజయముతోపాటు మనసులనుగూడ జయించెను.

మఱియు మనోనిగ్రహంబు బాడబనైసర్గికంబ. దాని కొఱ యత్న మేల యున్నటులు తనప్రోథమును గదలించుచుండెను. నన తోఁకవిసరులచే బిడౌజునిప్రాగ్వాహన మైనమేఘమండలంబు నుల్లంఘించుచుండె.

తాను హయగ్రీవావతార మెత్తినకాలమున నధ్యాపనమాత్రనఁ దనిసినవాఁ డగుట నద్దానిని సర్వతోముఖగతిచాతుర్యమం దసూయకలవానివలెఁ బద్మనాభుం డద్దానిని ఱెప్ప వేయక కాంచుచుండె.

దేవదానవు లిట్లు మథించుచుండఁ
గడలి బుధులను నొక్కొక్క కాన్క నిడియు
ప్రబలసంక్షోభ మే వారివలన నొందెఁ
గనికరింతురె రుచి నెఱింగిన రసికులు?

సురభి యనుపేర సాధ్వియై వరలుగోవు
గోప్రసూతత్వరూప మాగుణమువలన
'గావి' నై యసాధుతను నేఁ గాంతు ననుచు
నెఱిఁగియు జనించె నపుడు సాగరమునుండి.

దానిపయస్సుధామధురధారల మున్గుట కెంచు శంభుఁడున్
దానిపవిత్రదేహ జలధారలు పావితసర్వలోకముల్
దేని సురూపభావన ప్రతిం దలపోయుదు రామహర్షు లా
శ్రీనిధి దివ్యధేనువు ససిం గవివాక్కుల కింపు నింపుతన్.

అనఘ, సకలకామప్రద మైనసురభి
మొదటఁ బుట్టఁగఁ బొగడి రమ్మునులు సురలు
దానిని సహింపకో మహాదాత లగుచుఁ
బంచతరువులు వెన్వెంటఁ బ్రభవమందె.

వ. నిఖిలభువనాద్భుతము లగునీవృక్షకిసాలయములే స్వర్ణవస్త్రములు. వీనిపండుటాకులే చీనాంశుకములు. వీనిమొగ్గలే మౌక్తికములు. వీనినిర్యాసములే బుక్కాములు. వీనిపై వ్రాలుతుమ్మెదలే యింద్రనీలములు. వీనియూడలే ముత్తెంపుసరులు. వీనిమకరందములే యమృతరసపరిణామ మనిచెప్పుదురు.

ద్రుమము లై పుట్ట నేనాటిదుష్కృతంబొ
ఇట్టికీర్తికి మూల మ దెట్టిసుకృత
మో? విలక్షణకర్మ మేదో మఱొకటి;
యనెడివహానులవాదమ్ము లణఁగె నపుడు.

వ. ఈవృక్షములను సక్రమముగా స్థాపించి సమస్తరోగములను హరించి పంచేంద్రియములకు సంతృప్తి గలిగించెడి వీనినీడలయందు గొంతసేపు విశ్రమించి దేవదానవులు మరల మథింప మొదలిడి

అబ్ధిమథనమునం దమృతాంశురేఖ
యమలినానందకందళ మనఁగఁ బుట్టె
శివున కుత్తంసకుసుమ మై చెల్లు ననుచుఁ
జిత్తమందున హరి దాని శివుని కొసఁగె.

వ. అట్లు మనసున నెంచఁగనే నంది సమీపించి శివునివలె దేవాసురులమన్నన లంది మధుసూదనుఁ డర్పించిన చంద్రరేఖను గ్రహించి సాదరముగ నిట్లనెను.

ఎయ్యది యిష్టమో శివుని కెట్టిసపర్యఁ బ్రసన్నుఁ డౌనో? యా
తియ్యము నెయ్యమెన్నుచు మదిన్ హరసక్తి మొనర్తుగాన, మే
మియ్యెడ నీమహాసుకృత మెన్నఁగ శక్తులమే యుపేంద్ర! నీ
వెయ్యెడఁ బూర్ణసద్గురుఁడ వేడ్గడయున్ శివభక్తకోటికిన్.

ఆజగన్నాథుఁ డాప్రమథాధిపునకు
నెమ్మదిని బ్రీతి నీలోత్పల మ్మటన్న
దాని కీచంద్రికళ బంధువై నకతన
నత్యధికహర్ష మిందుపై నమరకున్నె?

వ. ఈచంద్రికళతో శివజటాజూటము నలంకరించి నీచేతిమీఁదుగ శివారాధకుండ నయ్యెద. విశ్వేదేవతలలోఁ బ్రథమభోక్త యగు శివుని ముమ్మొదటఁ బూజించుట యుచితము. కాన నిటీవలఁ బుట్టఁబోవువస్తువులను యథేచ్ఛముగ మీరుపయోగింపనగు. అని పలికి నంది యదృశ్యుండు కాఁగా మథనము పునఃప్రారంభ మయ్యె.

అతిశుద్ధాంబుధిబింబితమ్ములగునయ్యైనాగలోకాంగనా
ప్రతిమల్ త్రచ్చుటఁ గూడలిం దొలఁగి పైఁబై పొంగుపీయూషసం
గతిఁ జైతన్యము నందిన ట్లుదధిఁ జక్కంబుట్టి రబ్జాక్షు ల
య్యతనుప్రాజ్యజయాంకభాసురపతాకాళిన్ విడంబించుచున్.

వ. పిమ్మటఁ దరంగములు గొనివచ్చినపగడపుఁదీవలవలెను, నీల మేఘమాలికలనుండి జారిపడినమెఱపులవలెను, గుతూహలంబున నెవ్వఁడో నిర్మించినకౌస్తుభరత్నపుత్త్రికలవలెను, రూపెత్తివచ్చిన పంచసాయకుని సామ్రాజ్యలక్ష్ములవలెను, సమాన మైనవయోరూపవిలాసములతో నేక రూపమున నున్నయలంకారాంబరాదులతో, శరత్కాలమందు మానససరోవరమును విడిచి, వెలివడుహంసాంగనలవలె నున్నయాతరుణీమణులను సురాసురలు గాంచి సముద్రమథనాయాసమును విడిచి, పుట్టంబోవునమృతమునుగూడ నుపేక్షించి దగ్గఱ నున్నయాయచ్చరలయధరామృతము నపేక్షించిరి.

తాపసశ్రేష్ఠులును వారిని గాంచునంతఁ జలితమనస్కులై మంత్రజపములను మాని రతికూజితముల నభ్యసింపఁదలఁచిరి. పరమర్షులుగూడఁ బంచాగ్నులను వీడి పంచాస్త్రవిద్యనే గౌరవించిరి. వేనుడులేల? వేదన్యాయశాస్త్రము లెఱింగినపండితులుగూడ నాస్త్రీలదర్శన మగ్నిష్టోమయాగఫల మనియు, వారిగానశ్రవణము గవామయనక్రతుఫల మనియు, వారినాట్యాలోకనమే నక్షత్రసవనఫలిత మనియు, వారితోమాటలుకలుపుట వాజపేయయాగఫల మనియు, వారిపరిష్వంగము పౌండరీకయజ్ఞఫల మనియు, వారివదనాస్వాదనము వాజపేయయాగఫల మనియు, వారిదంతక్షతములు దాక్షాయణయాగకరణఫల మనియు,

వారినఖక్షతములు, అతిరాత్రాప్తోర్యామములఫలమనియు, వారి కుచ మర్దనము కుండపాయినామయనయాగఫల మనియు, వారిరశనావమర్శ నము రాజసూయఫల మనియు, వారియుపరతియే విశ్వసృజామయన ఫలమనియు, వారిచరణతాడనము చాంద్రాయణఫలమనియు, వారితో భాషించుట పరాకసాంతపనములఫల మనియుఁ జెప్పుదురు.

అంతదనుక సుహృద్వృత్తి నలరు దేవ
దానవులు వారికతన భేదము వహింప
నందర యథాస్థితిన్ నిల్పి యబ్జనాభుఁ
డనియె వారికి బధ్య మౌనట్టు లిటులు.

వ. ఓ దేవదానవులారా! తెలియనిమూర్ఖులవలె మీ రిట్లు ప్రవ ర్తించుట విచారకరము. మీరును వారును సమానముగ శ్రమపడి నపుడు ఫలముగూడఁ దుల్యముగనే యుండవలెను. కాన నీసముద్రమం దుద్భవిల్లినయచ్చరలుగూడ మీకు సామాన్యలు కావలెను.

ఒకయేనిక నొకయశ్వము
నొకగోవును నీగిమాత్రకు లొయ్యన నైదున్
ప్రకటానుకంప కలదే
నకించనుఁడు పాప మాబిడౌ జున కిడుఁడీ.

వ. అని వాకొనినంతనే యాతనిశాసనముం దలఁదాల్చి మీ రిట్లనుచుండ మే మేమిబదులు పలుకువారము? కాని దేవర కెట్టికా న్కలనొసంగకుండ నీవిభవమెల్ల మేమే యనుభవించుట సమంజసమా? ఈపైని పుట్టఁగలవస్తువుఁ దాముపరిగ్రహింపుఁడు. అని సురాసురులు ప్రార్థింప, స్మితం బొనరించి రమారమణుం డందులకల్లన నంగీకరించె.

ఎంతలో దేవదానవు లెసక మెసఁగ
నానిలం బొనరించిరో యబ్ధిఁ ద్రచ్చి
యంతలో సర్వజీవుల యంతరములు
ముజ్జగము లనావిలములై మోద మందె.

ఉదనిధిగర్భమం దుదయ మొందురమామణిహస్తసంగతిన్
హాదనుగ విచ్చియున్నకనకాబ్జసుగంధము లాని యాని యిం
పొదవఁగఁ జందనద్రవసముత్కరముం జిలికించువాతముల్
మృదువుగ వీఁచె నాహరిశరీరకదంబము కోరగింపఁగన్.

వ. పిదపఁ బూర్ణముగ వికసించినసువర్ణకమలవనములకాంతివలె నయనానందకరమై, శరత్కాలబాలచంద్రులనడుమ కరఁగి పోసినబాలారుణప్రభలచాకచక్యమువలెఁ జమత్కారజనకమై, సముద్రావర్తముల నుండి తేలినయాదిశేషుని ఫణామణికాంతివలెను, పాలసంద్రపుఁదరగలపైఁ బ్రతిఫలించిన చంద్రాతపమిళితసంధ్యారాగమువలె నొకమహాకాంతి కమలాక్షునికమలాక్షతను సార్థకమొనర్చెను.

అప్పుడు తాళవృంతము, చామరము, తాంబూలకరండము భృంగారువు మున్నగునుపకరణములం దాల్చి రూపెత్తి వచ్చినశృంగారాధిదేవతలవలె నుండి, రంభాదులసౌందర్యమును గాంచి తృప్తి పడిన దేవతలకనులకుఁ ద్రపాభరం బాపాదించుచు, నా మహాలక్ష్మియావశ్రీరణదేవతలు మున్ముందుగ నుదయించిరి.

ఆ వెనుక కరడు గట్టినయానందమునా నక్షరమాలికతోనిండి, శిరము మొదలు పాదమువఱకు మహాసౌందర్యము కలదై, పాతివ్రత్య

ధర్మానసారముగఁ బతిముఖమునే యాశ్రయించుచున్నను బరిసరప్రసారమాత్రన ముజ్జగంబులం బోషింపఁజాలినకటాక్షములచే జాతజాయమానజనిష్యమాణరూపములు కలదైనను జాతరూపైకమయివలె గోచరించుచు, ధార్మికులందు ధర్మస్వరూపురాలై, బ్రాహ్మణులయందు విజ్ఞానరూపిణియై, క్షత్రియులయందుఁ బరాక్రమావతారయై, యధీశ్వరులందు సంపద్రూపయై, ఘాతుకమృగములందు సాహసాకారయై, భర్తలయందుఁ గారుణ్యమయియై, పతియందుఁ గామకళామయురాలై, జనార్దనుని విజయపతాకయై, మకరధ్వజుని జీవనౌషధియై, చరాచరములకు మాతృదేవియై, నారాయణునికి మహిషియై సౌభాగ్యదేవత యావిర్భవించెను.

అలరమామణికుటిలకుంతలసమూహ
మనెడినీలోత్పలవన మ్మనంత శోభ
విరహము సహింపఁజాలనివిధము తోఁప
నాననేందునిసన్నిధి నధివసించె.

ఈమెచెక్కిళ్ళఁ గావింప నెంచి నలువ
చంద్రికళ నొక్కటిం దెచ్చి చాల దనుచుఁ
బారవైవఁగ నాత్రిపురారి దాని
రహిని వహియించెఁ దలపైఁ దురాయిరీతి.

వ. మఱియుఁ గమలాసనపదం బొసంగుటఁ గమలసాదృశ్యముగాని, మీనకేతనునిం గనుట మీనసాదృశ్యముగాని యామె కన్దోయి కొసంగఁ గవులు సిగ్గుపడుచుండిరి. తనచేతితామరను బరిమళము చూచుటయందు లగ్నమైనయుచటిమౌక్తికమే యామెకు నాసామణిగనుండెను.

ఏశ్రుతిన్ మణికర్ణిక యొసఁగుచుండె
నన్నమూర్ఖులముఖ ముద్రికై, సమస్త
తాపముల నార్చుచున్ జగన్మాతశ్రుతిని
యిమిడె నామణికర్ణిక యింపు లొలుక.

వ. ఆయమ పద్మహస్త యగుటచేఁ బాణికమలభేద మెఱుంగుటకుఁ గల్పింపబడినచిహ్నములో యనునటులు తత్కరకంకణంబులు విరాజిల్లె. పుట్టినదిమొదలామెమృదుహృదయము నాక్రమించికొను కఠినకుచకుంభములపైఁ గోపమున నెఱ్ఱవాఱినపుండరీకాక్షుని కటాక్షములవలెఁ గుంకుమపత్రభంగములు ప్రకాశించెను.

అంబికావక్త్రపాణిపాదాసనాక్షి
ధారణాబ్జంబు లారింటఁ దప్ప కొకటి
యేది యుద్బుద్ధమైన నహీనభవవి
మోహరాత్రికి మొదటికే మోస మగును.

పద్మమం దుండి పద్మముం బట్టి చేతఁ
బద్మ తనపద్మరాగంబు బాహిరించె
కాన భూషలు తాటంకకంకణములు
పద్మరాగమయమ్ములై పరగు టరుదె?

కమ్రవికసితపుండరీకమున మోఁప
నందములు చిందుపాదముల్ కందిపోవ
నాకె విహరింపఁ దగుచోటు లేక, హరియె
తనదునవనీతహృదయముం దా నొనర్చె.

వ. తదనంతరము సహస్రసూర్యప్రభలఁ జెలువొందు కౌస్తుభ మాణిక్యముతో నుదధినుండి వెలువడుచు, కమలముతోపాటు చింతామణిని గూడఁ జేతఁబట్టి, భగవంతునియింగిత మెఱింగి యామంగళదేవత నిజపరివారశక్తులం గలిసి పెక్కుభూపాలుర భుజములనుండి భుజాంతరమ్మునను సంక్రమించునభ్యాసమ్ముకతన భూవల్లభుం డగుశ్రీహరి భుజాంతరముఁ బ్రవేశించె.

మ్రోఁగెను దేవదుందుభులు ముద్దుగఁ బాడిరి కిన్నరాంగనల్
యోగులుఁ దాపసుల్ జయజయోక్తుల వేఁడిరి దేవి నెన్నుచున్
బాగుగఁ బూలవాన లతిబంధురమై గురిసెం బయోదముల్
రాగిలి పద్మనాభుఁయురం బనుసౌధము లక్ష్మి చేరుడున్.

వెన్నెల చంద్రునట్టులు, రవిం బరశోభలరీతిఁ జుట్టి తా
మెన్నఁడొ యైక్యముం గనియు నిప్పుడె మేలన మందినట్లుగాఁ
గన్నులఁగట్టుదంపతులఁ గాంచుచు నింద్రుఁడు తృప్తి లేక, వేఁ
గన్నుల మ్రొక్కి యంబదయకై నుతింపఁదొడంగె నమ్రుఁడై.

వ. భగవతీ! జగజ్జననీ! భక్తవత్సలా! నీవు లేనిచోఁ బరమ పురుషుం డైనను హిమచ్ఛన్నుం డగుసూర్యునిపగిది, వర్షాప్రారంభ మందలి కుముదబాంధవునికరణి మాదృష్టి కానంద మీయంజాలఁడు.

వ్యావల్గత్తులసీవనౌషధి యురోభాగంబునం దున్నయా
శ్రీవత్సం బనుపుట్టుమచ్చయును వాసిన్ మించి సౌందర్యని
త్యావాసం బగుతావకీనచరణన్యాసంబునన్; శౌరిసం
సేవాతత్పరు లైనభక్తులకుఁ దుష్టిం గూర్పఁగాఁ జాలవే?

వ. ఓతల్లీ! యింతదనుక శత్రుగృహావాస మొనర్చిననీవు సర్వ ధనామనికాంతివలె భయంకారిణి నైనను. నేటికి సర్వలోకశరణ్యుఁడగు నారాయణునివక్షస్థల మధిరోహించుటవలన మహానందమందితిని.

కానంజాలకొ నీదయాధికతనో గర్వంబుతోడం భవా
నీనిర్మాల్యమునం దవజ్ఞ నపుడెంతేఁ జేసియున్నాఁడ నం
బా! నాయజ్ఞత సైపుమా, సుతుఁడ నాపన్నుండ నం చెన్నినా
దీనన్ వాసవు నాదిలక్ష్మి దయ నుద్వీక్షించెఁ జిర్నవ్వుతో.

వ. పాకశాసనుం డిట్లనుచుండ దయామయ మైనశ్రీహరి మోముఁ దిలకించుచున్నరమాదేవి యతనిసంకల్పప్రకార మింద్రునకు జింతామణి నొసంగి సంతోషపెట్టెను. దానింబట్టి శ్రీహరికి సునాసీరు నందుఁ గలపక్షపాత మెల్లరకును, సువ్యక్తం బయ్యె. అట్లయ్యు నిసర్గ మదోన్మత్తు లగురాత్రించరులు మాయామోహితులై యీమణులతో గిఱులతో మన కేమిప్రయోజనము? కొంచెముసేపు తాళి మన మమృతమునే కాఁజేయవలె నని లోలో ననుకొనుచుఁ, బద్మనాభునే యనుసరించి యుండిరి.

మథనవిషణ్ణదైత్యసురమండలిపాలిటిజీవనౌషధుల్
శిథిలితసంధిబంధతను జేడ్పడువాసుకిప్రాణదాతలున్
ప్రథితదయాంబువర్షశిశిరంబులు లక్ష్మికటాక్షలేశముల్
పొదిగొనఁ జల్లనై మరలఁ బూనిరి త్రచ్చఁగ దేవదానవుల్.

వ. తదనంతరము మందరాద్రిరాయిడికి దుఃఖితునికరణి, తన సర్వస్వమును హరించుటచే విరాగి యైనట్లు, తనయావియోగబాధచేఁ

జిత్తచాంచల్య మందినవానివలె సముద్రిండు సాకారుండై; ముల్లోక ముల నారోగ్యవంతముగ నొనర్ప సమర్థ మగుదివ్యౌషధులం బూని, సువర్ణామృతకుంభపరీమళముల మాత్రిన జరామరణక్లేశములఁ దొలఁగించుచు లోకానుగ్రహార్థ మవతరించినవిష్ణుమూర్తిభేద మగుధన్వంతరితో పాటు బహిర్గతుండై భక్తియుక్తముగఁ బురుషోత్తమునికిఁ గై మోడ్పు లర్పించి, ధన్వంతరిహస్తమ్మునుండి యమృతకలశంబును గ్రహించి లక్ష్మీ పతిముం దిడి యి ట్లనియె.

ఈవే సర్వజనాంతరస్థుఁడవు సర్వేశా! పరబ్రహ్మవున్
నీవే, నీకు నలభ్యవస్తువులు లేనేలేవు ముల్లోకమం
దో వైకుంఠ! మరేమికానుకలిడువారో దీను లౌయీజనుల్?
నీవే మమ్ము ననుగ్రహించి తయినన్ నీరూపసాక్షాత్కృతిన్.

ధేనువు నశ్వముం గరిని దివ్యమణిన్ విధు నప్సరస్త్రతిన్
పాణగురున్ సుధన్ రమ నుపాయన మిచ్చితిఁ గల్పకాళి నా
పాణములతోడిపాటుగ; కృపాపర! నాపయిఁ బ్రేమ మున్న నీ
దీనుని ధన్యుఁ జేయుము త్వదీయదయామృతశీతలేక్షలన్.

లచ్చిజనకుండు నదులవల్లభుఁడు సింధు
విట్లు తీయము లాడ నుపేంద్రుఁ డలరి
దయను గ్రిఁగంటఁ గనుచు నార్ద్రింపునుడుల
నమృతవర్షము కురియించె నతనిమీఁద.

వ. అనంతరము సముద్రుండు వెడలఁగా బ్రహ్మాదులు పరమేశ్వ రుని సెలవునకు నిరీక్షించుచుఁ గేశవునిం జుట్టుముట్టి నిలిచిరి. ఇఁక దాన

వులును నమృతకలశము మనయందటినడుమ నునుపవలసినదే. మధు
సూదనునియెదుట నుంపనేల? అని శంకించుచు, గరుడధ్వజుం డేమని
పక్షపాత మొనర్చునో యని యెంచుచుఁ జింతామణి నింద్రుకై వసం
బొనర్చుట పక్షపాతంబుగఁ బరిగణించుచు, నొకరిచెవి యొక్కరుకొఱు
కుకొని శ్రమాపనోదనం బనుమిషతో సుధాకలశముం జట్టి, యాయు
ధాళిం బట్టి, బంధుజనులం గూడఁగట్టి, ముందే కయ్యమునకుఁ గాలు
ద్రువ్వుచు, నొకపరిసంగము మొదలిడిరి. చక్రాయుధ! చతుర్ముఖ!
యీయమృతమును మన మెట్లు పంచికొనవలెను? పోనిండు, మి
మ్ముడుగనేల?

ప్రియములం బల్కి మీరు ప్రార్థింపలేదు,
పిలువఁగా లేదు మీరు మమ్ములను జేరి,
తొల్లి యెవ్వరు వచ్చి మాతో శపథముఁ
జేసిరో వారితోడ భాషింతు మేము.

వ. ఓ సోదర దేవతలారా! మున్ను మాతో మీగురుం డొన
ర్చిన నిర్ణయప్రకారంబు మీ రెఱింగియే యుందురు.

ఎక్కడిమందరాచల? మదేడ దురుత్తరసాగరమ్ము? తా
నెక్కడజీర్ణవృద్ధుఁడు ఫణీంద్రుడు వాసుకి? మీరె కార్యమున్
జక్కఁగఁ జేసికొం డమృతసాధనకై ప్రయతింపుఁ డీసురల్
మిక్కిలి బంధువర్గముగ మీరు సుధారస మానుఁ డాసురుల్.

శక్తి గలవార మేని మీసాయ మేల?
అబ్ధిని మథింప సాధకు లౌదు రీరె
యైన మాశక్తి కొలదిఁ దో డౌదు మేము
యత్నమునుబట్టి పరుల మీ రరయువలయు.

వ. అని మీయాచార్యుం డనలేదా? కాన మీరే యాలోచింపుఁడు.

పర్వతము మోసి యెందఱు భగ్నులైరి?
వాసుకి వహించి యెందఱు పతితులైరి?
భుజగవిషముల నెందఱు బుగ్గిఁ గలసి
రకట! మే మెన్ని భాగము లందవలెనో?

వ. అని దానవులనుచుండ బృహస్పతి యిట్లనియె.

మీరలు భంగ మందఁగ, సమీరుఁడె ముందు గిరిం గదల్చె, మీ
దారతనూజులం గను ముదంబున మెట్టితి రే రథస్థలిన్
కోరి వహించినారు విషగుంఫితజిహ్వగరాట్ప్రణాంగ్రి, మీ
తీరులు మీగురుండు కవి తెల్లముగా నెఱుఁగున్ సమస్తమున్.

వ. అని గీష్పతి యుక్తియుక్తంబుగఁ బలుకుచుండ భార్గవుండును శక్తికొలంది సమాధాన మొసంగుచుండ మెల్లఁగఁ గలహంబును విజృంభింప దానవులు కత్తు లెత్తిరి. దేవతలు నడుములు బిగించిరి. అప్పుడు రమాపతి పరదేవతను మనసునఁ జింతించి తదీయమోహనరూపంబు ధరించి దానవుల వంచించి యమరుల ననుగ్రహింతు ననుకొనుచు బ్రహ్మతోఁ దిరోహితుం డయ్యె.

మోవగరాని శైలమును మోచుటచే వసివాడు బాహులన్
లావగు కాలకూటగరళప్రభ సుర్కిన మేనిచాయలన్
బోవఁగ నున్నప్రాణములఁ బోకమి వీడినయూర్పులన్ బోరన్
లావతి దానవుల్ దివిజులం బరిమార్పఁగఁ బూని రీసునన్.

అరదములు సశ్వములును శస్త్రాస్త్రములును
కాల్బలమ్ములును భగ్న సాంకేతన సురలు
నసురులును సర్వతోభగ్నులై మహావి
చారమునఁ గ్రుంగి యుండఁజట్టుపడిరి.

వ. ఇట్లుభయులును మిగుల నలసి బిక్కమొగంబులు వైచి దిక్కులు గాంచుచుండిరి. అంతలో సమకాలమున వికసించిన సంపెఁగలు, పొగడలు, శ్రీగంధములు, తిలకములు, మల్లికలు, సహకారములు, వాసంతికలు, కరవీరములు, చామంతులు మున్నగు కుసుమముల సౌరభముతో వీఁచుమందమారుతము ననుసరించు బంభరంబులఝుంకారములతోఁ గూడినకలకంఠముల కలకలారవము వీనులవిందొనర్చుచుండ, విరహిణులు పఱచికొన్న కిసలయశయ్యలతోఁ బ్రకాశించు లతానికుంజములు గలిగి:—

వంజుళములయందుఁ దుమ్మెదలు వ్రాలి పూదుమ్ములను రాల్చుచుండ నయ్యవి బోదెలయందుఁ బ్రవహించునీటిపైఁ బడి తెట్టులుకట్టుచుండఁ దజ్జలంబులఁ దడిసి చిగిర్చినతరువులనీడల హాయిగఁ గూరుచుండినకిన్నరులసల్లాపంబులను వినుట నభినయించు కొండగోఁగుమొగ్గలగుత్తులచే మనోహరమై:—

అలంఘ్యశాసనుం డగుమన్మథుని శాసనపత్రికలవంటి కిసలయములను వహించుశారికలకుఁ గింకరులైనయుపవనములలో వనముల కానందమై భూలోకనందనమై, సమస్తగుణముల కాకరమై మనోహరంబైనయశోకవనముం గాంచిరి.

మందస్పందరసాలసాలశిఖరోన్మత్తభ్రమత్కోకిలా
నందోదంచితపంచమధ్వనులకన్నన్ మిన్నలై వన్నెలై
కందర్పాహవఖిన్నకిన్నరవధూ కంఠోన్మిషత్కాకలీ
బృందవ్యాకులితమ్ములై నుదులు పర్వెన్ దేవజీవాతువుల్.

వ. ఆయుద్యానవనమ్మున నేపుగ వర్ధిల్లినకదళీతరుగర్భంబుల నుండి వెలివడుకప్పూరములచల్లఁదనమ్ము నొందినపిల్లకాలువలజలములచే వృక్షమూలంబులెల్లఁ దడియుచుండ, నచ్చట నిదురించుకేకులక్రేంకారములు మనోహరముగ నుండెను.

ఇంద్రనీలమణికాంతులచే నైల్యము నొందినపరిసరభూములం దెడతెఱపిలేక రాలువకుళకుసుమములపరిమళములకు గుమిగూడి వచ్చు నళికులముల ఱెక్కలగాలిచేఁ బూఁదుమ్ము లెగయుచుండ మనోహరమగుతద్వృక్షచ్ఛాయమున నొకయువతి వారిదృష్టిం బడెను.

ఆమెఫాలభాగంబును నిర్మించుకుతూహలము గలవిరించి నిస్సారమగుటఁ ద్రోసిపుచ్చినచంద్రకళలవలె నున్న మొగలిరేకు లామె జడయందు దండిగ నుండెను. శ్రావణభాద్రపదకృష్ణపక్షరాత్రులవంటి యుభయకేశపక్షములకు నప్పటప్పట నుదయించుకలహముం బోఁగొట్టునట్టిసీమావిభాగవీథివలె నామెసీమంత మమరియుండె. అందలిపద్మరాగసింధూరప్రభలు సంధ్యారాగసంపదల నీనుచుండె. భువనమండలమును లోఁగఁదీసికొన్నయీషద్వక్రము లగునామెకనుబొమలు మన్మథవిలునికిఁ బ్రమాదమునఁ దాఁపురించినపరాభవమును బరిహరించుచుండె.

ఆస్వాదింపకయే యతిమధురము లగునమృతములవలెను, ఘ్రాయఁబడకయే చల్లని వగుకర్పూరపరాగములమాడ్కి నుండి, కర్ణ

త్పలము నాకర్షింపనో యన ననుక్షణము కర్ణపర్యంతము వ్యాపించుచు, ముఖమండలమును మెల్లఁగ నాక్రమింప నుంకించుచు, మదనసంజీవ నౌషధులై, శృంగారమునకుఁ బరంపరాప్రాప్తగురుమూర్తులై, విభ్రమములకు విలాసభవనములై, యౌవనచంద్రికలవలన నుప్పొంగులావణ్యసాగరతరంగములవలె నున్నకటాక్షంబులచే నిఖిలలోకములను మదనుని యాన కాయము లోనగున ట్లొనర్చుచుండె.

శృంగారరసమును వర్షించుటకు విద్యుత్పుంజము నొక్కసారిగ వెలిగ్రక్కుచున్న ట్లామెకర్ణాభరణమ్ములు ప్రకాశించుచుండెను. ముఖసౌందర్యప్రవాహబిందువువలె నామెనాసామౌక్తికము విరాజిల్లుచుండెను ఆమెయధరమందుఁ బ్రతిఫలించిన నాసామణింబోలుమందహాసము మహాయోగులచిత్తములంగూడఁ జొక్కింపఁజేయుచుండె.

క్షణక్షణప్రవర్ధమాన మగుస్తనయుగళభారమ్మున బిగిసిపోవు కంచుకమ్ముముడి నామె మాటిమాటికి సడలించుకొనుచుండెను. క్రీడాకందుకముఁ దట్టుటంబట్టి యెఱ్ఱవాఱినకరపల్లవముకడ భ్రమించు బంభరములంబోలిన స్వీయాపాంగంబులచేఁ జూచువారలయెడందలను గూడ నామె దూలింపఁజేయుచుండెను.

కలమధురగానామృతముచేఁ గరఁగి ప్రవహించుమాణిక్యవితర్దులపైఁ బడుటవలనఁ గందుకము దడిసియు ననుశంకచే నద్దాని వారించుట కిటు నటు లామె చలించుచుండెను. నూపురఝుళంఝుళధ్వానులతో మిశ్రిత మైనయామెకాంచీరవము మదనునివిక్రమము చాటుచున్నటు లుండెను.

విశ్రమింపవచ్చినవిద్యుల్లతికవలె, సంచరించురత్నసాలభంజికకరణి, సజీవ మైనరత్నశలాకవోలె, మూర్తిమతి యగుశరచ్చంద్రి

చంద్రిక నాఁగ, సౌందర్య మనుసౌందర్యసంపదయట్లు, యౌవనసామ్రాజ్యాధిదేవత యన, మదనశాస్త్రసంప్రదాయవిద్యాకరణి నతిలోకసౌందర్యమున నామె యలరారుచుండెను.

వికసితోత్పలనయన కన్విచ్చి చూచు
తావులందెల్ల, నెక్కుడుధనువు లంది
విరహులను వేఁటలాడంగ వెడలినటులు
వేలకొలఁది మన్మథు లుద్భవించుచుంద్రి.

అతనురుజాప్రసక్తపరమాద్భుతమోహమహాంధకారబా
ధితుల సముద్ధరింప గడిదేఱుకటాక్షసమీక్షలం బ్రిగ
ల్భత తొనఁకాడుకప్పురపులప్పలచల్లఁదనాలపల్కులన్
క్షితి గలయందఱన్ గరఁగఁజేసెను మోహిని మోహనాకృతిన్.

కొసరి యపాంగముల్ దెసలకున్ విరఁజిమ్ముచుఁ జేయిదమ్ములన్
ససిగ విదిర్చి తట్టి పలుసారులు చెండు నటింపఁజేయుచున్
ముసిముసినవ్వులన్ జలదమున్ విడివచ్చు మెఱుంగుపోల్కిఁ దా
రసిలె సురాళి నాయమ బిరాన మనోభవుమాయపోలికన్.

చిగురుంగేల్ కదలించి చెండును మహాచిత్రమ్ముగాఁ దట్టుచున్
నిగుడుంగుబ్బల జాఱుపయ్యెదను నెంతే నేర్పుగా దిద్దుచున్
సొగపుల్ పుట్ట నవేవొ రాగముల నెంతో హాయిగాఁ బాడుచున్
బొగడుంబోఁతుల బొమ్మల ట్లొనరిచెన్ బూఁబోఁడి యాదైత్యులన్.

అంచల్లీలఁ జలత్సుధార్ణవతరంగాలోలపూతమ్ములై
పంచారించినచూపులం గనుచు సంభావింప; నామెన్ సురల్
పంచబ్రిహ్మవినిర్మితాసనపరబ్రహ్మాంకపర్యంకినిన్
పంచామ్నాయశిరోగతం దెలిసి రంబన్ గాఁగ నద్దేవతన్.

వ. రక్కసులు మదనుని ప్రాణశక్తి వలెను, శృంగారభాగ్యదేవత వలె నాయాప్రాంతములఁ దిరుగాడునామెం గాంచుచు నీక్షింపకుం డను సుధాకలశము నుపేక్షింపను,సమర్థులు కాక క్షణకాలము డోలాం దోలితమనస్కులైరి. అంత—

బంతినిం బట్టఁ బర్వునెపమ్మతోడ
నామె దేవదానవులమధ్యమున నిలిచి
యమృతమున వారిశస్త్రిఖిన్నాంగకముల
సేచన మొనర్చినటులు భాషింపఁదొడఁగె.

వ. మీ రెవ్వరయ్యా! ఉద్యోగులవలె యుద్ధవీరులవలె, పరస్పరద్వేషము కలవారిపగిది, విషణ్ణులపోల్కి నున్నారే! కన్యకలు స్వేచ్ఛావిహార మొనర్చునీవనప్రదేశమును రక్తవసామాంసదూషిత మొనర్తురేల ? అని ప్రశ్నింపఁ గోరికలీరిక లెత్తఁజేయుచు సుధామధురమ్ము లగునామెమాటలను రాత్రించరు లాలించి యిట్లనిరి.

స్థానములనుండి సురలెల్లఁ దఱుమఁబడిరి
పట్టితిమి వజ్రినెలవు మాబలముకతన
ఈమహాదైత్య దానవు లెల్లవేళ
నిజముగా నీకు దాసులే నీరజాక్షి!

ఈవేరాజ్యము మాకు, నీవె బల, మీవే మాధన, మ్మీవె మా
జీవాత్మోండవు, నీవె సర్వమును, రాజీవాననా! నీకటా
క్షావిర్భూతికి మేము దాసుల మనన్యంబౌను నీరూపమున్
నీవేమన్న నదే ప్రమాణ మింకఁ దన్వీ! మాకు వే యేటికిన్.

వ. అని స్వీయహృదయమ్ముల నెఱింగింప నేమిచేయంగలదో యేమని వచింపఁగలదో యని దిక్పాలురు సంశయగ్రస్తులైరి. అప్పు డామాయమోహినిఁ జిఱునవ్వు చెంగలింప 'అయ్యో! మీరలు సత్యార్థ మెఱింగియు నన్నశేషములందు మహాసనాధికారులపగిది నీ యమృతకలశమునకై కలహించుచున్నారు. వలదు.

మీ రుభయులును బంతులు తీర్చి కూర్చుండుఁడు. దీనిని మీకు నేను పంచెదను. పదభ్రష్టులై చిరకాలమునుండి భుక్తిలేక నక నకలాడువీరలకు ముందుగ వడ్డించి మిగిలినపాత్రితో నేను మిమ్ముఁ జేరెదను. అనెను.

బాగు బాగని యామాట కందఱును నంగీకరించి యా మె చెప్పినచొప్పున నొనర్చి, ముందుగ నామెవాగమృతమునఁ దృప్తి చెంది, తదుపరి కలశామృతమునకై వేచి యుండిరి.

తదనంతర మా మె క్రీడాకందుకమును సఖిచేతి కందిచ్చి కొందఱు చేటికలు మోమునం గలచిఱుచెమ్మట లొత్తుచుండఁ గప్పు రపుపరాగమునఁ దనకరపల్లవము శుభ్రపఱచికొని, కనుసంజ్ఞచే దాసీ జన మమృతకలశ మందీయ దానిం గ్రహించి లోకత్రాణపరాయణ మగునెడమచేత దానిం బట్టి, తనకుడిచేత సర్వమణికల్పిత మగుదర్విని బట్టి చీరచెఱంగును నీవికడ దోఁపికొనుచు, జడలోనిపూలమాల

లొయ్యారములొలికించుచుండఁ, దరంగహీన మైనపారావారమువలెను, గర్జలు లేనిప్రళయమేఘమువలెను, వీక్షణప్రసారమాత్రిన దేవాసుర సంఘమునునోరెత్తకుండఁజేయుచు, నెవండైనఁజేసాచినను గుసగుసలాడినను, దొందర పడినను, నఱచినను, సమాధాన మిచ్చినను, వెంటనే తిరోధాన మందెద నని శపథపూర్వకముగ వారల భయపెట్టుచు నా పరదేవత దేవతలపంక్తి కభిముఖముగ నిలువంబడెను.

తమ్ములపుటాకుఁజుట్టలఁ బదంపడి చేటి యొసంగ నందుచున్
నమలుచు నందమైనరతనాలగరింటెయు సవ్యహస్తమం
దమరఁ దదన్యపాణిని సుధాపరిపూరితపాత్రి దాల్చి, యే
యుమయుగుఁజిత్స్వరూప, ప్రమథాధిపురాణివసించునా యెదన్.

మూఁతఁ దొలఁగించి కొంతయిమ్మగను నమృత
భాండమును వంచి మణిదర్విఁ బట్టి సుధను
దివిజులకుఁ బోయుశాంకరదివ్యకళ, త
టిల్లతనుబోలి భువి విరాజిల్లుచుండె.

అమ్మ విసము పెట్టిన నది యాత్మజులకు
నమృత మగు ననుమాట సత్య మగుకరణిఁ
దాను దర్వీకరత్వమ్ముఁ దాల్చియున్న
నమృత మిడు నీమె తనబిడ్డ లందఱకును.

అలఘునితంబబింబరశనాస్ఫుటకింకిణికారవంబులన్
లలితపదాబ్జనూపురఝుళంఝుళరావములం జరించుచున్
గలికితనంపుఁజూపుల ముఖం బటుతిప్పి హసించి రక్కసుల్
చలితమనస్కు లౌనటు పచారములం బొనరించు నచ్చటన్.

వ. అంత నామె దేవతలకుఁ దనదయారసంబువోలె సుధారసంబు నొసంగుచుండఁ భావరూపులం దాల్చి దేవతలపంక్తిని జేరి రాహుకేతువు లనురక్కసు లమృతముం ద్రావి రని సూర్యచంద్రు లెఱింగింపఁ దోడనే యామె తనకరమ్మునఁ గరమ్ము విరాజిల్లుదర్వీకరమ్మున వారికంఠములఁ గఱక్కున నఱికివైచె.

పదరి యెవ్వఁడు సుధను లోపలికి మ్రింగ
నట్టిరాత్రించరుని దేహ మట్టె మిగిలె
నవనికమృతము నోటియుం దిరవుకొనెనొ
యతఁడు ఫణమాత్రశేషుఁడై స్థితి గడించె.

సూర్యచంద్రు లెద్దానిని జూచినారొ
దానిఁ దనదృష్టి వీక్షించెఁ దప్పకుండఁ
గాన నాదుర్మదులపాపకర్మ మనుమ
తింపలేదయ్యొ నాపర దేవతయును.

వ. దేవతల నిట్లు తృప్తిగా ననుగ్రహించి గరింటె నమృతపాత్రములో నుంచి గణగణ మ్రోగించుచు దానిని రాక్షసులముందునిచి కొంచెము విశ్రాంతి గోరుచున్నటు లటఁ గూలంబడెను. పిదప నమృతపానమున శక్తిసంపన్ను లగుచు నాదిత్యులు సందేహము లుడిగి యామను భక్తిపూర్వకముగ నిట్లు స్తుతించిరి.

నతు లివె వంద్యుఁ డక్కమలనాభున కాద్యున కవ్యయాత్మకున్
నతు లివె లోకమోహనసనాతనశాంకరదివ్యశక్తికిన్
నతు లివె తద్ద్వయైక్యపరిణామనిదానమహావిభూతికిన్
నతు లివె నీలకంఠునకు నవ్యసుధాంశుకళాకిరీటికిన్.

ఓనిర్వ్యాజకృపాతరంగితమతీ! యోస్వామి! దీనావనా!
నీనైరంతరసత్కృపాబలముచే నీచుల్ జితుల్ రక్కసుల్,
ఈనాఁడీభువనాళియున్ జితముకాదే! దేవ కర్తవ్య మిం
కైనన్నట్టేగద; ముందుఁ జేయఁగల దేదయ్యా! రమావల్లభా!

అరవిందాయతనేత్రసుందరమునై యానీలకేశంబునై
దరహాసాంకురముగ్ధమోహనసముద్యత్సత్కృపాపూర్ణమై
వరకాశ్మీరవిలిప్తవత్స మగుచున్ వర్తిల్లునీదివ్యసుం
దరరూపంబె శరణ్య మీసురల కాద్యా! శౌరి! సర్వేశ్వరా!

నీదుపదపద్మములను ధ్యానింప మఱచి
నీపరిపాదతిరస్కృతి నెఱపినట్టి
స్వర్గరాజ్యాధినేత మాస్వామియెగ్గు
మన్నన మొనర్ప నిపుడు మామనవి జనని!

వ. అని కొనియాడంబడునామెను యాతుధానులు గాంచి యి
దేమిదేమి? ఇట్లుగా జరిగిన దేమి? ఈమె యెవతె? అనుచు శంకించి
యమృతవిహీన మైనపాత్రిం గాంచి రోషావిష్టులై యుద్ధసన్నద్ధు లగు
చుండ వెంటనే శంఖచక్రగదాఖడ్గపద్మమ్ముల విరాజిల్లుకరములతో
సురలోకభయంకరం బగునారాయణరూపము ధరించి 'ఓయిందాద్రి
దేవతలారా! మశకంబులనుబోలె నీరాతిరించరులఁ దోలివేయుఁడు.
మందరంబును యథాస్థానమునం జేరిచి వాసుకిని విడిచి విరూపాక్షుని
బ్రిశాంతపఱచి నాయాజ్ఞ నంది స్వర్గరాజ్యమును హాయిగఁ బాలించు

కొనుండు. అని దేవతల ననుగ్రహించి విరించితోఁగూడ శ్రీహరి యంతర్ధాన మందె.

హరి తిరోధాన మందఁగా నసురవరులు
బాధ నొందుచు గురునకుఁ బ్రణతు లిడుచుఁ
దాము పాతాళమం దుండ దయ ననుగ్ర
హింపఁగోరిరి విబుధులు నిష్టపడిరి.

వ పిదప లోలోపల మాత్సర్యము గలిగినను వినయము నభిన యించుచుఁ గోఱలు పెఱికిన త్రాఁచులవలె నున్న రక్కసులను వీక్షి, యమృతపానాత్తమహాశక్తులై, కందుకమ్ముకరణి మందరమ్మును జేతులం బట్టి దేవత లద్దాని యథాస్థానమున నిలిపిరి. నీవలననే మే మమర్త్యుల మైతి మని ప్రశంసించుచు నవ్వాసుకిని గాఁగిలించి యాతనిం బాతాళ మున కనిపి యవ్వలఁ జంద్రశేఖరుని స్తుతింపఁజొచ్చిరి.

మందరాద్రిని బెకలించినందులకును
నిత్యపూజలు నీ కేము నెఱపకునికి
విసము మ్రింగు మన్నందుకు విషమనేత్ర!
మమ్ము మన్నింపుమా దిక్కు మాకు నీవ!

పుష్పవంతు లక్షులు గాఁగఁ బొలుచుహరియు
నొక్కయక్షి నీపదములం దునిచి తాను
పుండరీకసమాక్షులఁ బొందఁగలిగెఁ
జతురుఁ డాతండు వ్యోమకేశా! గిరీశ!

సురలకునే నలభ్యమగుచోటిది, గుప్పెడు బిల్వపత్రితో
స్మరహరు మోసగించి కన(జాలితి నంచు జనుండు తల్చు, మ
త్పరు( డగుదాసదాసునకు భంగురధాతృపదం బొసంగి, క
స్మరపియు భక్తవంచన మొనర్చితి నే నని యెంచె దీవునన్.

వ. అని స్తుతించుచు సుపర్వులు "అనుగ్రహించితిమి, యథాపూర్వముగ స్వారాజ్యమును పాలించికొం(" డనుప్రసన్నగంభీర మగు పరమేశ్వరవాణిని విని పరమానంద మంది రిక్కసులు విడిచినపిదప విశ్వకర్మచే( బునరలంకృతం బై సర్వసౌభాగ్యసుందరం బై నస్వర్గము నంది బృహస్పతికి నమస్కరించి మహర్షులను గారవించి పరస్పరము గౌ(గిలించి, శతక్రతుని రాజ్యమం దభిషేకించి, దేవతలు తమతమస్థానములు తామాక్రమించి, మించి స్వర్గమును బరిపాలించిరి.

నతులతో నుతులతో నతిభక్తి( దరుణేందు
శేఖరుపూజలు చేసికొనుచు
బహువిధస్తుతుల సంభావించి తలవంచి
దామోదరస్వామి( దల(చికొనుచు
చాగిల్లి ప్రణమిల్లి శాంభవి( బరశక్తి(
ద్రిభువనమోహినిం దెలచికొనుచు
మునుల నానందాబ్ధి ముంచుచు, శిరముల
గీప్సతియానల( గీల్కొలుపుచు

హాయిగా స్వేచ్ఛగా మహాహ్లాద మొదవ
దేవతాధర్మపథముల దీటుకొలిపి
యెట్టియాతంకములు లేక నెల్లసురలు
ననుభవించిరి స్వర్గరాజ్యము చిరమ్ము.

ఇది :- శ్రీమదాత్రేయసగోత్ర, దువ్వూరి గృహనామకపవిత్ర,
పెదశేషయార్య శేషమాంబాద్వితీయపుత్త్ర,
మహాగాయత్త్రీశరణ్య, గురువేంకటరమణకారుణ్య,
సూర్యనారాయణశాస్త్రిప్రణీతం బైన
ఆంధ్రనీలకంఠవిజయచంపూ మహాకావ్యంబున
పంచమాశ్వాసము సర్వము సంపూర్ణము.

ఓ మితి శివమ్.